శ్రీకృష్ణ.

# శ్రీమహాభారత శ్రీమద్రామాయణ విమర్శము.

2

---

ఇది

మహారాజసాహెబ్ మెహర్బాన్ దోస్తాన్

మహారాజా

శ్రీరావు సర్ శ్రీ వెంకట శ్వేతాచలపతి

రంగారావు బహద్దర్

కె. సి. ఐ. ఇ.,

మహారాజా ఆఫ్ బొబ్బిలి వారిచే

విద్వద్విమర్శనార్థముగ,

రచియింపఁబడినది.

---


చెన్నపురి:

వైజయంతీముద్రాశాల న్ముద్రింపఁబడినది.

---

1907.

# అవతారిక.

మన దేశములోనున్న మహారాజులలో ప్రజాపరిపాలనమందును లోకానుభవమందును రాజనీతియందును బండితరంజనమందును విఖ్యాతులును బొబ్బిలి సంస్థానాధిపతులు నగు శ్రీవేంకట శ్వేతాచలపతి రంగారాయ మహారాజావారు తాము రచించిన శ్రీమన్మహాభారత రామాయణ విమర్శమను గ్రంథమునకు భూమికను వ్రాయుమని నాతో సెలవిచ్చిరి. సకల హిందూధర్మ ఖనులనదగిన యీ గ్రంథములలోనున్న యపూర్వార్థములను జూపిన శ్రీమహారాజావారికృతికిఁ బ్రస్తావనను వ్రాయుటకుఁదగిన సామర్థ్యము నాకుఁ గలదా యను విషయము సంశయాస్పద మగుటచే నొకించుక జంకియును తద్దయాసూచకమగు నియోగము నతిక్రమింప లేకుండుటనుబట్టి యీ యవతారికను వ్రాయబూనితిని.

చిరకాలమునుండి ధర్మార్థ కామ మోక్షములతో సంబంధించిన సర్వ విషయములందును మహాభారత రామాయణములు హిందువులచే బ్రమాణగ్రంథములుగ నంగీకరింపఁబడియున్నవి. వీనిలో నుదహరింపఁబడిన సంగతులీగ్రంథకర్తల

కాలమునకు జాలముందు జరిగె ననుటకు సందేహము లేదు. సమకాలీనములగు విషయములఁగూర్చి వానిని జూచినవారు నట్టివారివలన వినినవారును వ్రాయునపుడుగూడ యథావృత్తముగ వ్రాయుట జరుగదు. కావున సంగతులు జరిగినపిదప చిరకాలమునకు వానినిఁగూర్చి వ్రాయువారు పొరపాటుగ వ్రాయరనుట దురూహ్యము. కనుక పురాణేతిహాసములు సత్యాసత్య మిశ్రిక థాపూర్ణములై యున్నవి. చిరకాలమైన పిదప వీనిలో నేవిసత్యమో యేవియసత్యమో నిశ్చయించుట యసాధ్యమగుటచేతను క్రమముగా నాధునికులలో సంభావ్యాసంభావ్య వివేచన సామర్థ్యము తగ్గుటవలనను నీగ్రంథములలో నున్న సర్వవిషయములను హిందువులు జరిగినవానినిగా నమ్ముచున్నారు.

పురాణములలోనున్న యనేకగాథలలోఁ గొన్ని యర్థవాదములని పూర్వగ్రంథకర్తలు సెప్పినను నేవి యర్థవాదములో యేవి యథావృత్తబోధకములో తెలుపుచుఁ మనవారిలో బూర్వు లెవరును వ్రాసినట్లగపడదు. కనుక మహారాజావారు భారతరామాయణ గ్రంథములను విమర్శించి తెలుగుభాషలో దమ యభిప్రాయమును దెలియజేయువారిలో మొదటివారుగ నున్నారు. ఈ మహాభారత రామాయణ విమర్శములో వివరింపఁబడిన కొన్ని విషయములలోఁ గొందరు మహారాజావారితో

నేకీభవింపకయుండిన నుండవచ్చునుగాని యనేక ముఖ్యాంశ
ములలో వారి యభిప్రాయమును దీసికొనక తప్పదనియును
వారిచే జూపఁబడిన మార్గము బుద్ధివైశృంఖల్యమును గలుగ
జేసి శుద్ధజ్ఞానమును బెంచుననుటకు సందేహము లేదు.

మహాభారత రామాయణములలో నున్న విషయముల
నాలోచించుటకు ముందీగ్రంథములనుఁగూర్చిన రెండుసంగ
తులు విచారణీయములయి యున్నవి. మొదటిది ఈ కథలలో
నేది పూర్వ మేది పరము? రెండవది, ఈ గ్రంథములలో నేది
ప్రాచీన మేది నవీనము? సామాన్యముగ హిందూ గ్రంథకర్తలు
రామకథ ప్రాచీనమనియును గురుపాండవకథ నవీనమనియు
నభిప్రాయపడుచున్నారు. పాశ్చాత్య పండితుల యభిప్రాయము
వీనికి గేవలము విరుద్ధముగానున్నది. మన వేదములలో నర్జున
జనమేజయ కురు పాంచాలాది శబ్దములుండుటనుబట్టియు నామ
బోధకములగు రామ లక్ష్మణ సుగ్రీవాదిపదములు లేకుండుటను
బట్టియు రామకథ భారతకథకింటె నవీనమని కొందరభి
ప్రాయపడుచున్నారు. మఱికొందరు రామాయణములో నుద
హరింపఁబడిన ధూమ్రాంక్ష విరూపాక్ష దేవాంతక నరాంతక
వజ్రదంష్ట్రాతికాయ మహాకాయాది శబ్దములు కల్పితములుగ
నగపడుటవలనను నితర కారణములవలనను రామకథ యంత
యును గవికల్పితముగాని యథాభూతార్థమును దెలియఁజేయు

నదికాదనియు నిది యార్యులుత్తర హిందూస్థానమునుండి దక్షిణ హిందూస్థానమునకు వచ్చి దానినిఁ జయించి సింహళద్వీపము వరకును బోవుటను దెలియఁజేయుచున్నదనియు నభిప్రాయపడు చున్నారు. రామాయణములో గల్పితకథ లనేకములుండిన నుండుగాని రామకథ సర్వమన్యార్థ వ్యంజకంబనుట రామా యణ కథనుగూర్చి వ్రాసిన హిందూ పండితుల యభిప్రాయ మునకు కేవలవిరుద్ధమయి యున్నది.

ఏ తద్గ్రంథ రచనా పౌర్వాపర్యమును గూర్చివిచారించుటలో భాషాస్వరూపమును, శైలినిఁ బరీక్షింపగా భారతములో గొన్ని భాగములు రామాయణముకంటె స్పష్టముగ బ్రాచీన ముగ నగపడుచున్నవి.

మహాభారతములోఁ గురు పాండవచరిత్రము ముఖ్యాంశము గనుక దీనిలోఁ బ్రధానపురుషులను గూర్చి మహారాజావారు తమ యభిప్రాయమును దెలియఁజేసియున్నారు. గ్రంథవిస్తర భయముచే విమర్శితంబులయిన వానిలో గొన్ని విషయము లనుఁగూర్చి మాత్రము నాకుఁ దోచిన రీతిని వ్రాయుచున్నాను.

కురువృద్ధని పేరు నొందిన భీష్ముఁడనేక మహాగుణశాలి ఈ యన తనతండ్రి సంతోషమునకై రాజ్యమును సుఖమును విడిచి బ్రహ్మచారియై పరుల నాశ్రయించి జీవితకాలమును గడ

పెను. "ఈ కురువృద్ధు డస్త్రవిద్యయందును లోకానుభవమం దును, ధర్మాధర్మ నేత్తృత్వమందును, తత్త్వజ్ఞానమందును బ్రసిద్ధి జెందిన మహానుభావుఁడు. ఇట్టివాడును మహారాజావారు చెప్పిన రీతిని గొన్ని సమయములందు దుర్యోధన ముఖోల్లాస మునకై స్వానురూపమగు మార్గమున నడువని వాడాయెను. కపటద్యూతకాలముననను, ద్రౌపదీ వస్త్రాపహరణ సమయమునను గౌరవులను వారింపక భీష్ముఁడూరకుండుట సరికాదని వారు చెప్పిన దాని నందరు నొప్పుకొనవలసియున్నది.

అస్త్రవిద్యాచార్యుఁడని కురుపాండవులచేతనే కాక యితర క్షత్రియ వంశజులచేత గూడ గౌరవింపఁబడిన ద్రోణాచార్యుఁ డభిమన్యుని విషయమై ధర్మవిరుద్ధముగురీతిని నడచెనని మహారాజావారు చెప్పినదానికి విరుద్ధముగ నెవరు చెప్పగలరు?

యుధిష్ఠిరుఁ డీభూమండలంబున జన్మించిన మహాపురుషులలో నొకఁడని చెప్పవచ్చును. భూతదయ యందును, ధర్మాధర్మవిచారంబు నందును, సత్యపరాయణత్వమందును, పరార్థము స్వసుఖము నపేక్షింపక యుండుటయందును నీతనితో సమానులగు పృథ్వీపతులు మృగ్యులు. ఇట్టి మహాపురుషుఁ డొక సమయమున నబద్ధమాడినట్లు భారతములో జెప్పఁబడియున్నది. ఈ యన యనృతమాడి యుండడని మహారాజావారి యభిప్రాయము. ఇట్టి యభిప్రాయము మహాగుణశాలియగు యుధి

ష్ఠిరుని చరిత్రము వినినవారికందరికిని న్యాయ్యంబని తోఁచును. ఆజన్మాంతము పరమోత్తమ ధర్మచారియగు నీయన స్వచారిత్రము నంతయును గళంకితముగఁ జేయునట్లొకమా రాకస్మికముగ ననృతమాడునా? ఒకవేళ యుద్ధవిజయార్థము తద్ద్వారా రాజ్యప్రాప్తికి నిట్టులాడిన నాడియుండవచ్చునని యూహించుట కీయన రాజ్యభోగ వైరస్యము సుప్రసిద్ధమేగదా! కావున నీ విషయమున మహారాజావారియభిప్రాయము సయుక్తికముగ నున్నది. మఱియు మహాభారత గ్రంథకర్త కౌరవ పక్షపాతి యగుటచే నిష్కళంకుఁడగు ధర్మరాజునకుఁ గూడ నొక కళంకమున్నదని చెప్పుటకైన నీ కథను గల్పించియుండిన నుండవచ్చును.

కర్ణుని శౌర్యౌత్కృష్ట్యమును జూపుటకై మహాభారత కవి కొన్ని గాథలను గల్పించినాడు గాని యవి సత్యములని మనము తీసికొనగూడదని మహారాజావారి యభిప్రాయము. దాతృత్వముతప్ప మహాభారతమునందెల్ల నితని దుర్గుణములే యగపడుచున్నవి. ఇట్టి దుర్గుణరాశి నిజమైనదాతయా యని విచారింపవలసియున్నది ఈయన దాతయై యుండిన నుండ వచ్చును. కాని యీ దాతృత్వమునకుఁ గారణము పరులచే శ్లాఘింపఁబడుట యందలి యభిలాషయేయని తోఁచుచున్నది. ఏమన, నిజమైన భూతదయలేనివాఁడు దాత కానేరడు. అట్టి భూతదయయే యుండినయెడల గర్ణకృతంబులని భారతములో

నుదాహరింపఁబడినకార్యముల నాయన చేసియుండఁడు. కావున కర్ణుని దాతృత్వముగూడ నిర్వ్యాజౌదార్య సూచకముకాదు.

శ్రీమన్నారాయణావతారంబని హిందూమతస్థులందరునమ్మిన శ్రీ కృష్ణుఁడు పరాత్పరుని యవతారంబు లన్నిటిలోఁ బరమాద్భుతమయిన యవతారమని చెప్పుటలో సందేహ మేమియు లేదు. ఇట్టి యవతారపురుషుఁడు సామాన్యముగ మనుష్యనింద్యములయిన కొన్ని కృత్యములను జేసినటుల భారతములోను భాగవతాది పురాణములలోను నున్నది. లోకరక్షణార్థము మనుష్య రూపమునొందిన హరి యిట్టిపనులను జేయునా యని విచారించుటలో నీ పనులను గూర్చినగాథలు శ్రీకృష్ణనిరసనంబునకై కల్పితంబులైన గావలెను. కానిచో మనము వాని నన్యార్థ వ్యంజకంబులుగానైనఁ దీసికొనవలయును. ఈ గాథలకు వ్యంగార్థమిచ్చుట సందర్భము గాదనియు నివి కేవల కృష్ణనిరసన బుద్ధితో గ్రంథకర్తచే గల్పింపఁబడినవియనియు మహారాజావారి యభిప్రాయము. సామాన్యముగ నీ గాథలలో గొన్నిటికి వేదాంతులగు వ్యాఖ్యాతలిచ్చిన వ్యంగ్యార్థము నంగీకరించుటకు జాల బాధలున్నవి. కనుక వానిని వ్యంగ్యార్థమున గ్రహింప వీలులేదు. శ్రీకృష్ణులు నారాయణావతారంబని నమ్మినవా రందరును గర్హ్యక్రియాగోచరములైన యీ గాథలను యథావృత్తబోధకములుగా నంగీకరింపఁ జాలరు.

మఱియుఁ గొన్ని సందర్భంబుల శ్రీకృష్ణుల విషయమై మన దేశ ములో వ్యాపించియున్న పురాతన కథలను నవీనులైన పౌరాణికులు సరిగ గ్రహింపఁజాలక పరిహాసనీయమగు విధమున వానినిఁ బెంచిరి. మహారాజావారు కాళియమర్దన కథను దీని కుదాహరణముగ నిచ్చియున్నారు. నాగులను నొక జాతి వా రున్నట్లు తెలియకపోవుటచేతగదా నాగశబ్దమును సర్ప పరముగా దీసికొని చిత్రమైనకథ నొకదానిని పౌరాణికులు కల్పించిరి. ఇటులనే గాంధారిగర్భము నూరు శకలములైన దనియుఁ, బ్రతిశకలము గొంత కాలము పెంపఁబడిన వెనుక నొక మగశిశువాయె ననియును భారతములో నున్నది. ఈ కథకు మహారాజావారు చేసిన యర్థము సయుక్తికముగ నున్నది.

రామాయణ మాదికావ్యమని వాడఁబడుచున్నది. తనకు ముందెవ్వరును సంస్కృతభాషను ఛందోబద్ధముగ రచింపలేదని వాల్మీకి చెప్పియున్నాడు. సంస్కృతభాషా రచితంబులగు సమస్త గ్రంథములలో వేదములు మొదటివను సంగతి యందరు నొప్పు కొనినదే. ఈ వేదములకు ఛందస్సులను నామమున్న సంగతియు నందరికిఁ దెలిసినదియే కదా? వేదములలోనున్న వృత్తములు పురాణకావ్యనాటకాది గ్రంథములలోనున్న వృత్తములకంటె వేరుగానున్న నవి వృత్తములు కావని ఛందోజ్ఞు లెవ్వరైన నన గలరా? కనుక స్పష్టమయిన యిట్టి సంగతిలో వాల్మీకి తానే

మొట్టమొదట సంస్కృతభాషను ఛందోబద్ధముగ జేసె ననుటకు గారణ మగపడదు. ఇట్టి యభిప్రాయమును స్థాపించుచు మహారాజా వా రిచ్చిన హేతువులు బాగుగ నున్నవి.

మహారాజావా రభిప్రాయపడినట్లు శ్రీరామ నిర్యాణమునకు చాలకాలము పిదప రామాయణకవి యీ కావ్యమును వ్రాసి యుండవలెను. ఈయన శ్రీరామ సహాయులైన సుగ్రీవాదుల నందరిని కోతులుగ వర్ణించియున్నారు. వీరు నిజముగ కోతులయి యుందురా? కోతులయినయెడల హనుమదాదులు చేసినట్లు రామాయణకవి చెప్పిన పనులను వానరులు చేసియుందురా? అట్టిపనులను వానరులు చేసి యుందురని చెప్పుట యసంభావ్యము. గనుక సుగ్రీవాదులు ప్రస్తుత మరణ్యప్రదేశములందున్న మనుష్యజాతులవారై యుండవచ్చును. కనుక సుగ్రీవాదులందరు మనుష్యులేయని చెప్పిన మహారాజావారి యభిప్రాయము నందరు నంగీకరింపక తప్పదు.

సామాన్యముగ హిందువులకు జాతకముహూర్త విషయములందు నమ్మకమున్నది. ఇట్టి నమ్మకము పరప్రతారకులగు ననేకులకు జీవనోపాధిఁ గల్పించుటయే గాక కొన్ని సమయములందు దాదృశ విశ్వాసానుసారముగ నడచువారికి హానిని

జేయుచున్నది. వసిష్ఠకథా సందర్భములో "నీయనచే నుంప బడిన పట్టాభిషేక ముహూర్తము కార్యకారి గాకపోవుటయే గాక శ్రీరాములవారి కరణ్యవాస కష్టమును గలుగజేసెను. కావున ముహూర్త మనునది పదిమంది చేరుటకును నా పనికి గావలసిన సంభారములు జాగ్రత్తపడుటకును వీలగు కాలసదు పాయమును గలిగించునే కాని వారివారి యదృష్టములను మార్పజాలద"ని మహారాజావారు వ్రాసియున్నారు. ముహూర్త విషయమున హిందువులందరును వీరి యభిప్రాయము కలవారై యున్నయెడల ప్రస్తుతము ముహూర్తవిశ్వాసమువలన గలుగు ననేక విపత్తులకు లోబడక సుఖ మనుభవింతురు.

శ్రీమన్నారాయణావతారములలో శ్రీరాములవారు స్వకీయ ప్రవర్తనముచే వివిధావస్థలయందు జనుల కుత్తమ ధర్మాచరణ రీతిని గనబరచియున్నారు. శ్రీరామచారిత్రమువలనఁ బితృవాక్య పరిపాలనము, భ్రాతృస్నేహము, మిత్రప్రీతి, ఏకపత్నీవ్రతము, సత్యసంగరత్వము మొదలయిన గుణములను, సీతాచరిత్రము వలన మహాపతివ్రతాలక్షణమును, లక్ష్మణ భరత శత్రుఘ్నుల చరిత్రమువలన స్వసుఖ నిరపేక్షముగ జ్యేష్ఠసోదరానువృత్తి మొదలయిన గుణములను జదువరులు నేర్చుకొనవలసియున్న దని శ్రీ మహారాజావారు వ్రాసినది సర్వాంగికార్యముగ నున్నది.

రావణునికి దశముఖ దశకంఠాద్యపరనామములు కలవు. ఇందువలన హిందువులు నిజముగ నతనికి బదితల లున్నట్లు భ్రమపడుచున్నారు గాని రావణుఁడు నితర మనుజులవలె నేక ముఖుఁడుగాని యనేక ముఖుఁడుగాడని మహారాజావారు వ్రాసి యున్నారు. సయుక్తికముగ నాలోచించు శక్తిగలవారెవరు నీయభిప్రాయమునకు విరుద్ధముగ జెప్పలేరు. కార్తవీర్యార్జునునకు సహస్రబాహుఁడని పేరుగలదు. ఈయన దుష్టశిక్షణమందతి సమర్థుఁడని మన పురాణములలో నున్నది. కనుక దుష్టనిగ్రహమందు వేయిభుజములు గలవానివలె నుండెనని సహస్రబాహుశబ్దమున కర్థము కావచ్చును. ఇటులనే దశముఖ దశకంఠాదిశబ్దములును వ్యంజనావృత్తి ప్రయుక్తము లనవలెగాని సర్వలోకానుభవ విరుద్ధమగు విచిత్రసృష్టి యితని విషయమై జరిగెనని యనుట యసమంజసము.

బహుకాలమునుండియు శ్రీరామకృష్ణులు భగవదవతారంబులని హిందూమతస్థులు పూర్ణముగా నమ్ముటచేత వారిచర్యలను వారి యుపదేశములను జెప్పుచున్న రామాయణ మహాభారత గ్రంథములు సకల విషయముల నుత్తమధర్మబోధకములుగ నెన్నఁబడి వానిలోనున్న ముఖ్యాంశములేగాక యముఖ్యాంశములు నసంగతములయిన కథలుగూడ విశ్వసనీయములని తలంపబడుచున్నవి. మరియు నీ కారణముచేతనే పండి

తులుగూడ నీ కథలలో గొన్నిటిని నమ్మినచో బ్రత్యవాయ మగునను భీతిచే నా గ్రంథస్థములైన సమస్తవిషయములు గ్రాహ్యములే యనుచున్నారు.

మహారాజావారు పండితంమన్యులకు వెరువక తమకు న్యాయ్య మని తోచినరీతి నందరిచేతను బ్రమాణగ్రంథములని యొప్పు కొనఁబడిన వానినిగూడ విమర్శించి సోపపత్తికముగ వీని లోనిది గ్రాహ్యమిది యగ్రాహ్యమని తెలుపుటకై యాంధ్ర భాషలో మహాభారత రామాయణ విమర్శమను నీ గ్రంథ మును జేసియున్నారు. ఈ గ్రంథ మాంధ్రభాషాభిజ్ఞులకు భారత రామాయణగ్రంథ తాత్పర్యమును సహేతుకముగ బ్రకటన చేయుటయేగాక పూర్వగ్రంథములను బరిశీలించుట కపూర్వమార్గమునుజూపుచు గృతికర్తయొక్క వివిధభాషా గ్రంథావలోడన జనిత సంభావ్యాసంభావ్యవివేచన సామర్థ్యము నార్యమతాభినివేశమును దెలుపుచున్నది.

విజయనగరము
1907.

కడాంబి-రామానుజాచార్యులు,
(ప్రిన్సిపల్, మహారాజాస్ కాలేజి,)
విజయనగరం.

శ్రీకృష్ణ.

# ఉపోద్ఘాతము.



మన యార్యమతగ్రంథములు మూఁడువిధములు. ప్రభుసమ్మితములు, సుహృత్సమ్మితములు, స్త్రీసమ్మితములు. అందు ప్రభుసమ్మితములు వేదములు, అనఁగా శ్రుతిస్మృతులు. సుహృత్సమ్మితములు పురాణములు. స్త్రీసమ్మితములు కావ్యములు. శ్రుతిస్మృతులు ప్రభువాజ్ఞవంటివి కావున వానిని విడిచి పామరులకొరకు బుట్టినపురాణాదులవిషయము ముందుగ గొంత చర్చ జేసి యాపిదప నాయీగ్రంథమును వ్రాయఁ బూనుచున్నాను. పురాణములు పదునెనిమిది, ఉపపురాణములు పదునెనిమి దనియు, ఇరువదియొకటంటె నెక్కుడు గల వనియు గ్రంథాంతరములవలనఁ దెలియుచున్నది. వానిలో మొదటి పురాణసంహిత లారనియే శ్రీభాగవతగ్రంథములోఁ జెప్పఁబడియున్నది. ఎటులైనను త్రిమతాచార్యులచేత నంగీకరింపఁబడిన పురాణములే గాని యితర మైనవి ప్రమాణములు కావు. మతపక్షపాత బుద్ధితోఁ జెప్పఁబడినవి కావున మనము వానిని విననే కూడదు. పురాణములకు మొదటి సృష్టి యనఁగా గోళముల

సృష్టియు, నాపైని గలిగెడువస్తుజీవసృష్టులు, సూర్యచంద్రవంశ ములు, తత్తద్వంశీయులవృత్తాంతములు మన్వాదులకాలములు నను నైదులక్షణములు గలిగియుండవలెను ధర్మార్థ కామమోక్ష ముల నుపదేశించు పూర్వకాలపుగథలతో నిండియున్నది యితి హాసము. వ్యంగ్యముగా నీతిని బోధించునది కావ్యము. శ్రీమ ద్భాగవతాదికములగు పదునెనిమిదిపురాణములకుఁ బురాణ లక్షణములుగల వనియెదరు. ఇతిహాసలక్షణము గలది మహా భారతమని చెప్పుదురు. శ్రీమద్రామాయణమును గావ్య మని నుడివెదరు. ఈ విభాగములతోఁ బని కవులకే గాని మనవంటి చదువరులకు లేదు. పైనిఁ జెప్పఁబడిన త్రివిధగ్రంథములయం దును ధర్మార్థకామమోక్షములను బోధించు పూర్వరాజులచరి త్రలు, వంశానుక్రమములు సమముగనె యున్నవి. మఱియు నీ మూడువిధములయిన గ్రంథములయందును ననేకగాథలు మత సంబంధపు నమ్మకములును గలవు. కావున వానిని ముందుగఁ జెప్పవలసియున్నది. అందు గాథ లైదువిధములు. వాని నిజ ముగ జరిగినవానిగా మనము తీసికొనఁగూడదు. అవి యెవ్వి యనిన :—1. నీతిబోధకములు, 2. అధిక్యమును దెచ్చుకొరకు చెప్పఁబడినవి. 3. ప్రశ్నకు సమాధానముగా నుండునవి, 4. గ్రంథ కర్తలు పడినదురభిప్రాయములను బలపరుచుటకుఁ జెప్పఁబడినవి. 5. అవివేకపునమ్మకములతో నున్నవి. వీనిని మన మెంత

మాత్రము నిజముగ జరిగిన వని నమ్మగూడదు. ఇంక మతసంబంధపు నమ్మికలు ప్రతిమతమందును గొన్ని గలవు. వానిని నమ్మకపోయినయెడల నేమతమును నిలువఁబడదు. అందు మన యార్యమత మాది యగుటచేత హెచ్చుగ నున్నవి. అవి యెవ్వియనిన:—అంతరిక్షగమనము, కామరూపము, తపోమహిమ, వరప్రభావము, ఊర్ధ్వలోకవాసుల యాగమనము, భగవత్ప్రత్యక్షము, భగవత్సాహాయ్యము. అదియు ప్రత్యక్షపరోక్షకృతము, దీర్ఘకాలజీవితము, స్వచ్ఛందమరణము వీనిని మనము తప్పక నమ్మవలెను. అందు స్వచ్ఛందమరణము సరిగ జరుపఁబడక పోయినయెడల నాత్మహత్యలోనికిఁ జేరును. భీష్మునిది యటుల కాదు. ఏ మనిన: పోవుటకు సిద్ధముగ నున్నప్రాణమును నేకాదశివరకు నిలిపియుంచెను.

# శ్రీమహాభారత విషయము.

జనమేయమహారాజు తనకు మహాభారతకథను జెప్పుమని వ్యాసులవారి నడుగ నతఁ డాకథ నామహారాజునకుఁజెప్పుమని వైశంపాయనమహర్షిని నియోగించినటులను నాఋషి యీభారతకథను జెప్పినటులను గానిపించుచున్నది. వ్యాసులవారు ముందుఁ జెప్పినదానినే వైశంపాయనుఁడు చెప్పియుండిన నుండవచ్చును లేదా వ్యాసులవారివలన వినియున్న

కథను వైశంపాయనుఁడు గ్రంథరూపముగఁ జెప్పియుండవచ్చును. లేదా మనపురాణము లన్నియు వ్యాసప్రోక్తములు గాఁజెప్పినటుల వ్యాసులవారివలన వినిన ట్లూహించి వైశంపాయనులవారు చెప్పియుండవలెను. ఎవరు చెప్పియుండినను నాచర్చతో మన కేమిపని? కావున నెవ్వరు చెప్పియున్నను నాగ్రంథకర్త కౌరవపక్షపాతియు, నద్వైతియు నై యున్నాఁడు. ఇందు మొదటివిషయము చర్చించునపు డాగ్రంథములోని చాలయసందర్భములు బయలఁబడును. వానిని ముఖ్యముగ నాగ్రంథమును జదువువారును వినువారును దప్పక గమనింపవలసి యున్నది.

ఈగ్రంథ మనేకేతిహాసములు, రాజవంశముల వృత్తాంతములు, నీతులు, ధర్మములు వీనితో నిండియున్నది. అందుచే దీని నైదవవేద మని చెప్పుదురు.

ఒకరితో నొకరు సంభాషించునపు డెల్లను నీతితోఁ జేరని మాటలే తరుచుగ నుండవు. ఎదురువాదపుసమయములలో నిరుప్రక్కలవారు చెప్పెడినీతులు వినఁగనే బహుప్రశస్తముగ దోఁచును. చదువరులకును వినువారికిని నబ్బురపాటుగ నుండును. కావున నెవ్వరెవ్వరిచరిత్రములవలన మన మేమేమి గ్రహింపవలెనో దానినిఁ జూపుట కీగ్రంథమును వ్రాయఁబూనితిని గాని యన్నినీతులను ధర్మములను జెప్పుటకు గాదు. వానినిఁ

దెలిసికొనుటకు శ్రీభగవద్గీతలు శాంత్యాను శాసనికములే చాలును.

శాంత్యానుశాసనికములలో భీష్ములవారు ధర్మరాజుతోఁ జెప్పినవి కొంచెము ఛాందసముగాను, పరస్పరవిరుద్ధముగాను పునరుక్తముగాను గనుపడును. వారియిరువురిమధ్యను జరిగిన సంభాషణ యొక్క నాటిది గాక యనేకదినములు జరిగినదగుట చేతను, ధర్మరాజును నడిగినప్రశ్నమునే పలుమారు వేరొక సందర్భములో వేరొకవిధముగ నడుగుటచేతను, భీష్ముఁడు తన యాదినిబట్టి మాటలుగాఁ జెప్పుటచేతనుఁ బయిని వ్రాసినట్లుండును. అంతమాత్రముచేత భీష్మునియందుఁ దప్పు నెంచఁ గూడదు.

మాక్సుముల్లరుగారి యాజమాన్యముక్రిందఁ బుట్టిన పవిత్రమైన తూర్పుదేశపుగ్రంథము లనేనామముతో నున్న గ్రంథములలో గీతలు, సనత్సుజాతీయము అనుగీతలు గల పుస్తక మొకటి గలదు. ఆమూడింటి యుపోద్ఘాతములను నింగ్లీషు నేర్చిన మనయార్యమతస్థులందరును జదువఁ గోరుచున్నాఁడను. ఆగ్రంథకర్త సనత్సుజాతీయము అద్వైతమతాభిమానిచే నిటీవలఁ జెప్పఁబడి భారతమునఁ జేర్పబడిన దని బహువిధముల సాధించెను. అటులనే యనుగీతలను నవి మరియు నిటీవల ననఁగా బౌద్ధజైనమతములు పుట్టినపిదపఁ జెప్పఁబడి యా

భారతమునఁ జేర్పఁబడినటులను సాధించెను. ఆచర్చ నిచట వ్రాయఁబూనుట యనవసరము. నేను దానినిఁ జదివి యాయా యుక్తులను, సందర్భములను బండితులతోఁ జర్చించితిని. వారును నేనును నా గ్రంథముయొక్క యుపోద్ఘాతము వ్రాసినవానియభిప్రాయముతోనే యేకీభవించితిమి.

ఇఁక మహాభారతగ్రంథకర్త కౌరవపక్షపాతి యనువిషయము ను వ్రాయుచున్నాను.

1. గాంధారికి నొకమాంసపిండము పుట్టిన దనియు, దానిని నూరుశకలములుగఁ గోసి వేరువేరుపాత్రములయందుంచి వానికిఁ గొన్నిదోహదములు చేయఁగా నవి నూర్గురు కుమారు లైనటుల జెప్పఁబడి యున్నది. మాంసపిండమే గర్భములో నుండి వచ్చినపిదప శిశువు గానేరదు. అట్టి దానిని నూరుతునకలుగాఁ గోసి కుండలలో నుంచుటయు నవి నూర్వురుబిడ్డ లగుటయుఁ గడువింతగ నున్నది. ఇట్టియసంభావితమును విచారించిచూచినచో నెవ్వరును నొప్పఁజాలరు. అయితే నటుల నెందులకుఁ జెప్పఁబడిన దన, ఆపిండము గాంధారిగర్భములోనే పెరిగి యందరుబిడ్డల తోపాటుపుట్టక పోవుటయే కాక నూరుశకలములుగ విభజింపఁబడి నూర్గురు కుమారులయినందున బలక్షీణమయి, యాకుమారులు భీముని చేత హతు లయిరి గాని • లేకపోయినయెడ భీమునకే కాక

యెవ్వరికిని వారినిఁ జంప నశమా యనునాధిక్యమును వ్యక్త పరచుట కీవిచిత్రసృష్టికథను గ్రంథకర్త కల్పించెను.

గాంధారి పట్టమహిషి గావున ధృతరాష్ట్రునికుమారు లందరు నామె కుమారులుగా నే వాడఁబడిరి. ఆమెకు బహుశః దుర్యోధనదుశ్శాసనులు స్వకుమారు లై యుండవచ్చును. తది తరు లితరభార్యల లేదా భార్యలవలె నంతఃపురమునం దుంపఁ బడిన స్త్రీల కుమారు లై యుండవచ్చును. అట్లైనాను గాక వివాహితభార్యల కుమారు లైనచో నాభార్యలపేరు లేల చెప్పఁబడవు. యుయుత్సుఁ డనువాఁడు ధృతరాష్ట్రునికి గోమటి దానియందుఁ బుట్టిన ట్లొక చోట స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. ఇందుమూలముగఁ జూచినను నుంపుడుస్త్రీలు ధృతరాష్ట్రునకుఁ గలిగి యుండుట స్పష్టమగుచున్నది. లేదా గాంధారికుమారులే యని వీరినిఁ జెప్పుదుమంటిమా; ఒకస్త్రీకి నూర్గురుకుమారులు పుట్టుట యసంభావితము. ఆకాలముననే గాక యిప్పటివరకు రాజు లుంపుడుస్త్రీల నంతఃపురమునం దుంచుటయు, నట్టిస్త్రీల కుమారులకు సముఖమునందు గూర్చుండుమర్యాద నిచ్చు టయు, కుమార్తె లైనయెడల వివాహములు చేయుటయు జరుగుచున్నది

2. అరణ్యవాససమయమున నింద్రునిపనుపున నర్జునుఁడు స్వర్గమునకుఁ బోయి యింద్రునివలనఁ దివ్యాస్త్రలాభముఁ

బడసెననియు, నింద్రాదులకు జంప శక్యముగాని నివాతకవచు లను రాక్షసులను సంహరించెననియుఁ జెప్పఁబడియున్నది. ఈకథ యెందుకు గల్పింపఁబడినదో చూతము. ఎవ్వఁడైన మనుజుఁడు తనమానవశరీరముతో స్వర్గామ్యార్థ్యలోకములకుఁ బోవుటకు వీ లుండు నని పూర్ణముగఁ జదివినపండితు లంగీకరింతురా? మరి యేమి యనిన; అమానుషమైన స్వర్గారోహణముఁ జేసి యింద్రాదులకుఁ జయింప శక్యముగాని యా రాక్షసులను జంపి యింద్రునివలన నస్త్రలాభము నొందినసమర్థుఁడు గావుననే కర్ణాదులను భారతయుద్ధమున నితఁడు చంపె నని కౌరవుల యాధిక్యముకొరకీకథ చెప్పఁబడినది. సాధారణముగ జదువు వార లర్జునునియాధిక్యమునుఁ దీసికొనియెదరు. సఖుఁడైన సర్వేశ్వరుఁ డతనికి సారథియై యుండఁగ మరియొకరిసాహా య్యము గావలెనా?

3. భీష్మునిపరాక్రమమునకు జడిసి యతనినిఁ జంపఁజాలమని తలఁచి శ్రీకృష్ణులవారిపనుపునఁ బాండవులు నీచావువిధమునుఁ జెప్పు మని యతనియొద్దకు రాత్రివేళ బ్రచ్ఛన్నముగఁ బోయి చెప్పుకొని ప్రార్థించినటులఁ జెప్పఁబడి యున్నది. యుద్ధదివస ములలో నట్లు వైరులశిబిరములకుఁ బోవుటకు వీలు పడునా? వదియేనిఁ దెలిసికొనవలసి యుండినయెడల సర్వజ్ఞులగు శ్రీస్వామి వారికిఁ దెలియనిది భూతభవిష్యద్వర్తమానములలో నేదియైన

నుండునా? ఈగ్రంథకర్త కెంతపిచ్చి? మరియు శ్రీస్వామివారు పాండవులను రక్షింపఁ బూనుకొనియుండి వీరి కీట్టితుచ్ఛమైన పనినిఁ జేయు మని చెప్పుదురా? ఒకవేళ ధర్మరాజు భీష్ముని యాటోపమునకు జడిసియుండినను భీమార్జును లాముసలివానికి జడియుదురా? కావున నిదియుఁ గల్పితకథయే యయి యున్నది. ఎందుకు జెప్పఁబడిన దనఁగా: శ్రీపరశురాముని జయించినవాఁడును స్వచ్ఛందమరణముగలవాఁడును నగు నీతనినిఁ జయింప నీయర్జునునకు శక్యముగాదు కావున నిట్టిప్రార్థనవలన భీష్ముఁడు మడిసె నని చెప్పుటకుగా నీకథ కల్పింపఁబడినది.

4. అర్జునుఁడు శిఖండిని ముం దిడికొని భీష్ముని గ్రిందఁ బడువరకు బాణములతో గొట్టె నని యున్నది. మహావీరుఁడగునర్జునుఁ డొకనిచాటున నుండి మృగమును గొట్టినట్లు చేయఁబూనునా? ఈకథయు భీష్మునియాధిక్యముకొరకు గల్పింపఁబడిన ట్లున్నది. కాని నేను వేరొకయభిప్రాయమునుఁ దీసికొని యెదను. అర్జునునియందు భీష్మున కతిప్రేమ గలదు. ఎప్పుడు వీరిరువురు నెదురుకొనినను నెదిరించి నిలువఁబడి యుద్ధము చేయక యస్త్రమునకు బ్రత్యస్త్రమునుమాత్రము వేయుచు దాటిపోవుచుందురు. శిఖండి స్వతః భీష్ముని బడఁద్రోయునంతటి వీరుఁడు గాకపోయెను. అందువలన నీభీష్మునికి బరమశత్రు వగుశిఖండిప్రక్క జేరి యర్జునుఁడు యుద్ధము చేసెను. శత్రువు

ప్రక్క నుండి యుద్ధముచేయు నీతనిని మునుపటివలె ప్రేమతోఁ దప్పించివోలేక నిలువఁబడి కోపముతో రణము చేసెను. అది యేసమయముగ నర్జునుఁడు తీసికొని భీష్మునిఁ గూల్చెను. సంగతి సందర్భములనుఁ గొంచెము యోచించువారికి శిఖండిప్రక్క నుండి యర్జునుఁడు భీష్మునిఁ బడఁద్రోయుట కిదియే కారణ మని తోఁచక మానదు.

5. భగదత్తునిచే నర్జునునిమీఁద వేయఁబడినవైష్ణవాస్త్రమును శ్రీకృష్ణులవారు రథముపైని నర్జునునకు నడ్డముగ నిలువఁబడి పూలదండనుగాఁ జేసికొని రని యొకచోటఁ జెప్పఁబడి యున్నది. ఆభగదత్తుఁ డెంతయవివేకి? విష్ణుసంబంధమైన యస్త్రమును విష్ణుఁడు ముందు గల యర్జునునిమీఁద విడువఁ దగునా? ఆ యస్త్రమే శ్రీకృష్ణులవారిమెడను బూలదండగాఁ బరిణమించి యుండును గాని శ్రీకృష్ణులవా రడ్డముగ నిలిచి యుందురా! ఆభగదత్తుని యవివేకము నుభయపక్షముల వీరులకుఁ జూపుటకుఁ బూలదండగ నైనపిదప రథముపయి నిలువఁబడి యుందురు. లేదా అటుల స్వామివారు చేయక పోయినయెడల నర్జునుఁ డాయస్త్రము చేత నే మడిసియుండు నని చెప్పుటకు గల్పింపఁబడినకథగా నుండును.

6. సైంధవవధ నాఁటిముందురాత్రి స్వప్నమునం దర్జునుఁడు కైలాసమునకుఁ బోయి యీశ్వరునివలనఁ బాశుపతాస్త్ర

ప్రయోగవిధమును నేర్చుకొనివచ్చె నని యున్నది. ఆయస్త్రము నర్జునుఁడు పూర్వ మీశ్వరునివలనఁ బొందియే యున్నాఁడు గదా? తిరుగ నెందుకు వెళ్లవలెను. మహావీరుఁ డగునర్జునుఁ డనేకాస్త్రప్రయోగములను దెలిసి యీయస్త్రప్రయోగవిధాన మునుమాత్రము మరచునా? స్వప్నమందు గైలాసమున కేగుట యెటుల నగును? కావున నీకథనుఁ గల్పితకథగాఁ దీసికొన వలెను. ఈకథకుఁడు వ్యాసాదిమహర్షులయొక్కయు, భీష్మాదుల యొక్కయు స్తవములచే శ్రీకృష్ణులవారిని బరాత్పరుఁడని తెలిసి కొని యుండెను. ఇదిగాక గీతలలో "నాకంటె వేరుదైవము లేదు, ఆయాదేవతల నారాధించుటకంటె నన్నే యారా ధింపుమనియు, నాదేవతలద్వారా ఫలము నిచ్చువాఁడను నేనే" యనియు శ్రీకృష్ణులవారు సెల విచ్చియుండుటచేత నద్వైతి యగు నీగ్రంథకర్త మత్సరబుద్ధిచే నాఁటిరాత్రి శ్రీకృష్ణులవారి పాదములయందుఁ బూజింపఁబడినపుష్పములే కైలాసమునం దీశ్వరునిపాదములయం దుండుట నర్జునుఁడు చూచినట్లు తెలి యుట కీకథనుఁ జేర్చెను. దీనివలన శివకేశవుల కభేదమని తోఁచ గల దని తలఁచెను. అటుల నభేద ముండిన నుండును గాక. ఇట్టి మత్సరబుద్ధితో నీయసందర్భపుగథను గల్పించుట సరికాదు.

7. సైంధవవధనాఁ డతనినిఁ జంపుట కర్జునునకు శక్యము గాకపోవునపుడు శ్రీస్వామివా రొకమాయాతిమిరమును సూ

ర్యునివైపు కల్పించినటులను, దానివలన సూర్యుఁ డస్తమించె నని తలఁచి తల యెత్తి చూచుచుండ నతనితల నర్జునుఁడు ఖండిచిన ట్లున్నది. ఈకథ యర్జునునకుఁ బ్రతిజ్ఞాభంగ మైన దనియు, కౌరవవీరులు సైంధవుని జంపుటకు వీలులేనియట్లు కాపాడి రనియు నాధిక్యముకొరకుఁ జెప్పఁబడినది. కాని శ్రీస్వామివారు తిమిరమును గల్పించి మోసము చేసియుందు రా? ఒకప్పుడు మేఘ మడ్డమై యుండుట యే నిజ మైనయెడల సాయంకాలసమయమున న ట్లుండుట తరుచుగ గలదు.

8. ద్రోణాచార్యునివధకొరకు ధర్మరాజుచేత శ్రీస్వామి వా రబద్ధ మాడించినటుల నొకకథ గలదు. ఇదియు భీష్ముని శిబిరమునకు బ్రచ్ఛన్నముగఁ బోయి రనుకథవంటిదే. ఈ ముసలిబ్రాహ్మణుని చావుకొరకు శ్రీస్వామివారు మోసము చేయుట కబద్ధ మాడు మని నియమింతురా? అస్త్రగురు చావునకు ధర్మరా జనృత మాడునా? ఏమివింత? అట్లు కానిచోఁ ద్రోణుఁడు యుద్ధమునందు మడియునా యను నతిశయోక్తి కొరకు గల్పింపఁబడినకథ గాని వేరు కాదు. యుద్ధానంతరము శ్రీకృష్ణులవారు తమద్వారకకుఁ బోయి వసుదేవునితోఁ జెప్పు టలో నీద్రోణుఁడు ముసలివాఁ డగుటచేత నలసిపోయి హతుఁ డయ్యె నని యున్నది కాని ధర్మరా జబద్ధ మాడిన ప్రస్తావనయే లేదు.

9. ప్రాణములు వదలిన ద్రోణునిశిరస్సును ధృష్టద్యుమ్నుఁడు నరికినటుల నున్నది. ప్రాణములు వదిలిన కళేబరము క్రిందఁ బడక కూర్చొని యుండునా? కావున నిది యసంభావితము. అలసిన యీముసలివాఁడు ప్రాయోపవేశముచేఁ బ్రాణములను విడుచుటకొరకు గూర్చొని యుండును. ఇతని కావని యెందు కని ధృష్టద్యుమ్నుఁ డోర్వలేక తలఁ దునిమి యుండును.

10. అశ్వత్థామచే వేయఁబడిన నారాయణాస్త్రమును శ్రీస్వామివారు వ్యర్థముచేసినట్లు లోకచోటఁ జెప్పఁబడియున్నది. వాహనములను దిగిన వారి నది యేమియుఁ జేయ దని యెరిఁగినవారు కావున నట్లు సెల విచ్చి యుందురు. అట్లు చేయుట తప్పగ గానరాదు. ఈయస్త్రమును సేన మొత్తముమీఁదఁ బ్రయోగించెను. అటుల లేక యర్జునునిమీఁదనే వేసియుండిన యెడల భగదత్తునిచే వేయఁబడినవైష్ణవాస్త్రమువలె నిదియు శ్రీస్వామివారియం దేదో యొకయలంకారముగఁ బరిణమించి యుండును. వృథాగా దానివలన మడియుటకంటె బ్రాణములను సులభసాధనమువలనఁ దప్పించుకొనుట వీరధర్మము నైయున్నది. ప్రత్యస్త్రప్రయోగమువలన నలసినపుడును, మూర్ఛఁ జెందినపుడును సారథి తననేర్పువలన రథికుని యుద్ధభూమినుండి వేరొకచోటికిఁ దొలగించుట మొదలగు ననేకమైన పనులు యుద్ధములోఁ జరుగుటఁ గలదు. ఇందు మనము తెలిసికొన

వలసిన మంచినీతి కలదు. అది యేది యనిన: జడమైన యీ నారాయణాస్త్రమే నమ్రము లైనవారిని నేమియుఁ జేయక దాని యంత నదియే యుపశమించినపుడు తదధిష్ఠానదేవత యగు శ్రీమన్నారాయణుఁడు శరణాగతవత్సలుఁ డౌట నిస్సందేహము. అట్టి దైవము నారాధించి భక్తిచేతగాని, ప్రపత్తిచేతగాని శాశ్వత విష్ణులోకమునుఁ బడయవలెను. అట్లు చేయక, ఆహా! పాపము స్వల్పసుఖముకొరకశాశ్వతలోకప్రాప్తినిఁ గోరి యితరదైవముల నేల యారాధింపఁ బూనవలెను.

11. భారతయుద్ధానంతరము శ్రీస్వామివారు శిబిరమునకు వచ్చి యర్జునునిముందు దిగు మని పిదప దాము రథావతరణముచేసి రనియు, వెంటనే యారథము కాలిపోయిన దనియు, భీష్మద్రోణకర్ణాదివీరులయస్త్రముల వేడిమివలన నది యట్లు కాలిన దనియు, నంతవరకు శ్రీస్వామివారె తమమహిమవలన దానిని గాలనీయక యుంచి రనియుఁ జెప్పఁబడి యున్నది. ఇది యంతయుఁ జచ్చిన యధర్మవీరులయాధిక్యముకొరకుఁ గల్పింపఁ బడినది. ఇందుఁ గల యసందర్భము లెవ్వి యనఁగా: ఎప్పుడు గాని రథికుఁడు రథావతరణము చేసినపిదప సారథి రథము దిగ్గును. అట్టిస్థితిలో ముందుగ నర్జునుని దిగు మని శ్రీకృష్ణుల వా రేల సెల వీయ వలెను? మరియు శ్రీస్వామివా రనేక పర్యాయములలో నొక్కనాఁటియుద్ధానంతరము రథమును దిగి

యుండలేదా? అప్పు డేల యారథము కాలిపోలేదు. అప్పు డంతయు శ్రీస్వామివారు దానినిఁ గాలనీయక రక్షించి రని యంటిమా, యట్టిశక్తి గలవాఁ డిప్పుడు మాత్రము దానిని గాల కుండ రక్షింపలేక పోవునా? ఏమివింత? కావున నిదియుఁ గ్రంథకర్తయొక్క కల్పిత కథయే యయి యున్నది.

కర్ణునినే నమ్ముకొని దుర్యోధనుఁ డిట్టియధర్మము జేసి ప్రజానాశనము జేయుటయే కాక వృద్ధబంధుమిత్రు లగువారిని హతులనుగాఁ జేసియున్నందున నట్టికర్ణునివిషయముఁ జెప్పు టకు జివరకు నిలిపి యుంచితిని గావున నతనివిషయము నింకఁ జెప్పఁబోవుచున్నాను.

1. ఈకర్ణుఁడు జన్మించుటలో నభేద్యకవచకుండలములతోఁ బుట్టెనఁట. ఇది యపూర్వసృష్టి. అవి యుండినయెడల నర్జునుఁ డితనినిఁ జయింపఁజాలఁ డని యింద్రుఁడు వీనినిఁ దన కిమ్మను టయుఁ నీకర్ణుఁడు దానముకంటె వేరొకసుకృతము లే దని శరీర మును గోసి యాకవచమును గుండలములను నిచ్చిన ట్లొకగాథ కలదు. చర్మమును దీసిన బ్రదుకుట యెట్లు? ఈ యసంభావిత విషయమునుఁ దెలిసికొనలేక కవులు వెఱ్ఱులై యొక నిదానవిష యము పొగడవలసి వచ్చినప్పుడు దాన కర్ణుఁ డని వర్ణించెదరు.

2. కుంతిదేవి కిచ్చినవరమున నర్జునుఁడు గాక తక్కిన నలుగురుపాండవులను నీకర్ణుఁడు చంపక విడిచెనఁట. మరియు

ధర్మరాజు రాజ్యముచేయుటకుఁ దగినవాఁడు గాని నే నందుకుఁ దగ నని కుంతితోఁ జెప్పెనఁట. సూతజాతి గలిగి దుర్యోధనుని వలన నొకస్వల్పరాజ్యమునకు నధిపతి యయి విఱ్ఱవీగుచు ననేకాధర్మకార్యములనుఁ జేసి యధర్మయుద్ధముచ్చే ననేకులఁ జంపిన యీదురాత్ముఁడు కుంతితో నట్లు పలికి యుండునా? ఏమివింత? తక్కిననలుగురుపాండవులను నొక్కొక్కసమయము నందు జంపక విడిచె నని కుంతీవరకథను బ్రతిష్ఠించుటకుఁ జెప్పఁబడి యున్నది. అనఁగా నీవరమే లేకపోయినయెడల నా నలుగురినిఁ జంపియే యుండు నని యతిశయోక్తికొఱకు నీగాథ కల్పింపఁబడినది.

3. కర్ణునిచేత వేయఁబడినసర్పముఖశరము శ్రీస్వామివా రర్జునునిరథమును గ్రిందికి నణగునట్లు చేయుటచేత నర్జునుని శిరస్సును దునుమక కిరీటమును హరించె నని యున్నది. ఇది కల్పితకథ కాకపోవునని మనము నమ్మవచ్చును. దీని నాధార ముగఁ జేసికొని కర్ణుఁడు తనరథచక్రము భూమిలో గ్రుంగగానే దిగి యాచక్రము నెత్తఁగా భూమియంతయు మీఁదికి లేచిన దని యొకకథ కల్పింపఁబడినది. ఎవ్వఁడీబ్రహ్మాండము లన్నిటికి నాధారుఁడో యట్టివాఁడు రథముపయి నుండి దానినిఁ భూమిలోఁ గ్రుంగునట్లు చేయఁగలఁడు. ఆమహానుభావునితో నీకర్ణుఁడు సముఁ డని తెలుపుటకు గర్ణుఁడు చక్ర మెత్తినకథను

గల్పించెను. ఇట్లు వానిరథచక్రము గ్రుంగుటకు బ్రాహ్మణ శాపము గల దని వేరొకకథ కల్పింపఁబడినది. మఱియు రథస్థుఁ డగునర్జునుఁడు భూమిస్థుఁ డగుకర్ణుని దునిమె నని చెప్పఁబడి నది. ఏనుఁగుమీఁద నున్న భగదత్తునితో నర్జునుఁడు యుద్ధము చేయలేదా? ఉభయపక్ష వీరులును ననేకపర్యాయములు విరథు లయి రథస్థులమీఁద దలపడలేదా? నలుప్రక్కలను గ్రిందు మీఁదు తలఁపక ప్రయోగము చేయువాఁడే వేటుకాఁడు కాని యితరుఁడగునా? ఈగ్రంథకర్తకు యుద్ధసంప్రదాయమే తెలియదు.

4. శల్యుఁ డెప్పుడో యొకనాఁడు కర్ణుని సారథ్యము చేయు నని తెలిసికొని ధర్మరాజాశల్యునితో 'నీకు గర్ణుని సారథ్యము తటస్థ మగును. అప్పుడు కర్ణునికి మనోవైకల్యముఁ గలిగించి యర్జునుని గాపాడు,మని కోరినటుల నున్నది. అటుల మోసముఁ జేయు మని ధర్మరా జట్లు ప్రార్థించునా? రా జగుశల్యుఁ డట్టి పని జేయఁ బ్రతిన యిచ్చునా? కావునఁ దీనిని నమ్మఁగూడదు. మఱియు, తనను దక్కినసోదరులను గాపాడు మని ధర్మరా జేల కోరరాదు. మరి యేమి యనిన: అటుల మనోవైకల్యముచేత గర్ణుఁ డర్జునునిఁ జంపలేకపోయెను గాని లేకపోయిన జంపియే యుండు నని సూచించుటకు నీగాథ కల్పింపఁబడినది.

కౌరవపక్షపాతబుద్ధితో నీగ్రంథకర్త కల్పించినగాథల ననేకముల ని ట్లెత్తి చెప్పితిని. మఱికొన్ని నిలిచియుండిన నుండ

వచ్చును. వానివిషయములోనుసు జదువరులు మీఁద వ్రాసిన కారణ సంప్రదాయములనుఁబట్టి యోచించినచో నిటులనే కల్పితగాథ లని తోఁచక మానదు.

మఱియు నీగ్రంథకర్తకు యుద్ధసంప్రదాయమే తెలియదు. యుద్ధవిషయములో ననేకపర్యాయముల సంభావితములను జెప్పియున్నాఁడు. వాని నిచ్చట వివరించుట కవసరము లేదు. చదువరులు కొంచెము విచారించినయెడల బోధపడగలదు. అయితే బ్రాహ్మణులకు యుద్ధముయొక్క వేటలయొక్క సంప్రదాయములు తెలియనివారలకు నిట్టివి మనస్సులకు వచ్చుట గష్టముగ నుండు నని తలఁచెద.

ఈగ్రంథకర్త కౌరవపక్షపాతియే కాక యద్వైతి యనియు ముందుఁ జెప్పియుంటిని. అద్వైతి యనఁగా జీవేశ్వరాభేద బుద్ధిముదిరిన వెఱ్ఱి యద్వైతి కాఁడు. మఱి యేమి యనిన శివ

శిసి

ర

ఇంక నెవ్వరెవ్వరచరిత్రములవలన నేమేమి మంచిచెడుగులనుఁ గ్రహింపవలెనో యావిషయమును వ్రాయుట కుపక్రమించెదను.

శ్రీకృష్ణ:

# శ్రీ మహాభారత విమర్శనము.

## ౧. జనమేజయుఁడు.

ఈయన యర్జునుని ప్రపౌత్రుఁడు. తనతండ్రి యనంతరము వ్యాసునిశిష్యుఁ డగు వైశంపాయనునివలన మహాభారతకథను వినెను.

తమ పూర్వులచరిత్రమును వైశంపాయనునివలన నీతఁడు వినినందున నాకథ లోకమునఁ బ్రచురపరుపఁబడినది. అటుల లేనిచో నాచరిత్ర కాలక్రమమున మఱువఁబడవలసినదియే కదా? కావునఁ బ్రసిద్ధవంశజులు వారివారి పూర్వులచరిత్రలను గ్రంథస్థముఁ జేసియుంచుట యావశ్యకము.

## ౨. పరీక్షిత్తు.

ఈతఁ డర్జునుని పౌత్రుఁడు. తన పెద్దతాతయగు ధర్మజునితోఁబాటు ధర్మపరిపాలనఁ జేసినవాఁడు. కుమారునికి రాజ్యము నొప్పగించి తనతాతలతోఁబాటుగ నరణ్యమున కేగి యచట నొకసర్పముచేఁ గఱచి చంపఁబడెను. ఈపాము కాటునకు శాపమని యొకకథ కల్పించి చెప్పఁబడినది.

ఎంతగొప్పవారైనను దుష్టజంతువులవిషయమున మిగుల జాగ్రత్తగ నుండునది.

## 3. భీష్ముఁడు.

ఈయన శంతను చక్రవర్తియొక్క జ్యేష్ఠకుమారుఁడు. భారతయుద్ధములోఁ బదిదినములు యుద్ధముఁ జేసి గాయములచే యుద్ధభూమినుండి వెడలి మాఘశుద్ధైకాదశినాఁడు ప్రాణత్యాగమునుఁ జేసెను. యుద్ధానంతరము ప్రాణత్యాగకాలములోగా ధర్మరాజునకు శాంతి, అనుశాసనిక, పర్వముల లోని యనేకనీతులనుఁ జెప్పెను.

తండ్రియొక్క యాజ్ఞకు బద్ధుఁడయి వివాహ మాడక రాజ్యమును దనసవతితల్లికుమారునకు విడిచిపెట్టెను.

ద్రౌపదీవివాహానంతరము పాండవులు ద్రుపదునిపురమున సుఖముగ నున్నా రని విన్నకాలమున వారినిఁ దెచ్చి వారివంతు రాజ్యము వారి కిచ్చివేయు మని యీభీష్ముఁడు చెప్పెను. పాండవులు బాల్యమున వారణావతమున లక్క యిండ్లలోఁ బెట్టి చంపఁబడి రని యదివరకు నమ్మియున్నవాడు గాన నిపుడు వారు సుఖజీవులయి యున్నా రని విని తత్కాలమునుబట్టి స్వచ్ఛమైనహృదయముతోనే యిట్లు చెప్పె నని తలఁపవలసి యున్నది.

ధర్మరాజు రాజసూయయాగము సేయునపు డగ్రపూజ చేయుతరుణమున నట్టి యగ్రపూజకు శ్రీకృష్ణుఁడే యర్హుఁడని భీష్ముఁడు చెప్పెను. ఈకౌరవులలో శ్రీకృష్ణులవారి మహిమ నెఱిఁగియున్నవాఁ డీయన యొక్కఁడే యని చెప్ప వచ్చును.

కౌరవపాండవులు బాంధవముచే దనకు సములయి యుండుటయే కాక కౌరవులది యధర్మమైనప్పటికి దనను బోషించు ధృతరాష్ట్రునకు సూయ కలుగు ననుతలంపుతోఁ భీష్ముఁడు కపటద్యూతమును మొదట వారించుటకుఁ బ్రయత్నింపక పోయెను. ఇది బాగు గాదు.

ద్రౌపదీవస్త్రాపహరణసమయమున గురువృద్ధుఁడగు నీతఁడు సమర్థుఁడయి యుండియు, నాదుష్టమైనపని నివారింపు మని ధృతరాష్ట్రునకుఁ జెప్పకపోవుట సరికాదు.

అజ్ఞాతవాసములోఁ బాండవు లున్నప్పుడు వారికి దీక్షా భంగము చేయుటకయి దుర్యోధనుఁడు ప్రయత్నించునవసరమున వా రుండు దేశమునుఁ గనిపెట్టుటకుఁ గల కొన్ని గుర్తులను భీష్ముఁడు చెప్పెను. ఇది మంచిపని కాదు.

సంధిప్రయత్నములోఁ బాండవులు నీతిమంతులు సమర్థులును గాబట్టి యట్టివారితోఁ గలహము వద్దనియు, వారిభాగ

మును వారి కిచ్చివేయు మనియు, బలుమారు లొత్తి చెప్పెను. ఇట్లు చెప్పుట చిత్తశుద్ధిచేఁ గాదు. ఇష్ట ముండినను లేకపోయి నను సంధికార్యములయందు సభలలోఁ దగువారు సంధి కను కూల మగునటులఁ జెప్పక తీరదు.

యుద్ధారంభమునకు ముం దనుజ్ఞ గొనుటకయి భీష్మ ద్రోణకృపులయొద్దకు ధర్మరాజు వచ్చినపుడు, తాము కౌర వులకు ధనముచే గట్టుపడియుంటి మనియు, అందుచే వారి పక్షమున యుద్ధముచేయక తప్ప దనియు, పాండవులకే మేలు కోరుచుందు మనియు, నీ మువ్వురు నేకరీతినిఁ జెప్పినటుల మహాభారతమున నున్నది. వీరిమాటలను బట్టి విచారింపఁగా, అధర్మపరు లగుకౌరవులకు సాయము సేయుట మధ్యస్థులును, వృద్ధులును, నగు తమకు ధర్మము కాదని లోకులు నిందింతురని తలఁచి తమమనశ్శాంతికొరకును, పయి మెప్పుకొరకును, వీరు ముందే యోచించుకొని బడిపిల్లలు పాఠము నొప్పగించినట్టు లేకరీతిని ని ట్లాడినట్లు తోఁచుచున్నది. కానిచో శూరులును, వృద్ధులును, నగు తాము రెండుపక్షములయెడ సమబుద్ధిఁ గలిగి యుండుట నిజమే యయినపక్షమున విదురబలరాములతోఁ బాటు యుద్ధమునుఁ జేయుట మానిన నెంత శ్లాఘ్యముగ నుం డును? తమ్ముఁ గౌరవు లేమి చేయఁగలరు? వారు తమ్ముఁ బోషింపఁ రని యింతమాత్రమునకు భయపడవలెనా? బాగుగ

నాలోచింపఁగా నీభీష్మద్రోణకృపులకు జిరకాలమునుండి యుద్ధ కుతూహల మున్నట్టును, అందుఁ భీష్మునకు సర్వసేనాధిపత్యము చేయువేడుక యున్నట్టును, స్పష్టమగుచున్నది. తండ్రియిష్టము కొరకు రాజ్యమునే విడుచుకొన్న యితఁడు కౌరవసేనాధిపత్య మున కభిషిక్తుఁడయి యుప్పొంగెను. ఇదియే స్వచ్ఛందమర ణము గల యీతనికి జావును సమకూర్చినది.

ఈయన శరతల్పగతుం డయ్యును, మాఘశుద్ధైకాదశి నాఁటివరకును ప్రాణములు ధరించియుండుటవలన నసాధారణ శక్తిగలవాఁడును, భగవదనుగ్రహమువలన శరవేదనయు క్షుత్పి పాసలును లేక బుద్ధిస్ఫూర్తి గలిగి యనేకధర్మములను ధర్మ రాజున కెఱింగించినవాఁడును, నయి యున్నాఁడు. ఆధర్మములు, శాంతి, ఆనుశాసనిక, పర్వములలో ధర్మరాజుచే నడుగఁబడిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరరూపమునఁ జెప్పియున్నాఁడు. ఇది యొక నాఁటిసంభాషణము కాక యనేకదినములు జరిగియుండిన దగుట చేతను, అడుగఁబడినప్రశ్నలే మాటిమాటికి వేరొకరూపమున నడుగఁబడుచున్నందునను నీభీష్ముఁడు చెప్పిననీతులును బున రుక్తము లైనటులను, ఛాందసము లైనటులను, స్వల్పముగ బర స్పరవిరోధములు గలిగియున్నట్లును జదువరులకు గానవచ్చును. అయినను మరణమును నిరీక్షించుచున్నట్టియు, వృద్ధుఁడయి నట్టియు, నీభీష్ముఁడు తాను వినియున్న యావద్ధర్మములను

మనువక యథాశ్రుతముగఁ జెప్పినందున నీతఁడు మిగులఁ గొనియాడఁ దగియున్నాఁడు.

## ౪. ద్రోణాచార్యుఁడు.

ఈతఁడు బ్రాహ్మణుఁ డయ్యును ధనుర్విద్యను బాగుగ నేర్చికొని పాండవకౌరవులకే కాక యనేకరాజకుమారులకు విలువిద్య నేర్పెను. భారతయుద్ధములో భీష్మునితరువాత గౌరవ సైన్యాధిపత్యమును వహించి, యైదుదినములు యుద్ధముచేసి పాండవసేనాధిపతియగు ధృష్టద్యుమ్నునిచే దల దునిమి చంపఁ బడెను. ఉభయపక్షముల వారికి గురువై యుండియు మొదటి జూదమున భీష్మునితోపాటు వల దని చెప్పియుండలేదు. అర్జునుఁడు తనకు ముఖ్యశిష్యుఁ డైనప్పటికి నరణ్యవాసమునందు శ్రమలకు జడిసియు, తనవిరోధి యగు ద్రుపదుఁడు పాండవ పక్షములోనివాఁ డగుటవలన నతనితోఁ బోరాడఁ గోరియు, నీతఁడు పాండవపక్షములోఁ జేరలేదు. ధర్మరాజు యుద్ధము చేయుట కనుజ్ఞ గొనుటకయి తనయొద్దకు వచ్చినపుడు, భీష్మునితోబాటు ముందు వల్లించుకొనినమాటలనే చెప్పెను.

అర్జునునికుమారుఁ డగు నభిమన్యుఁ డేకాకి యై, పద్మవ్యూహమును భేదించి, దానిలో యుద్ధముచేయునపుడు ధర్మయుద్ధమును మాని, పదిమందియు గలిసి యతనినిఁ జంపిరి

ఆవీరులలో నితఁడు ముఖ్యుఁడు. ఇట్లే మఱికొన్ని సమయము లలో నధర్మయుద్ధమునుఁ జేసియున్నాఁడు.

బ్రాహ్మణుఁ డైనవాఁడు స్వధర్మమును విడిచి హింసాకర మైన రాజధర్మమును వహించియుండుటచేతనే యెంత దుష్కా ర్యము నైనను జేయుటకుఁ దగియున్నాఁడు.

## ౫. కృపాచార్యుఁడు.

ఈతఁడు బ్రాహ్మణుఁడు. ద్రోణునిరాకకు ముందు నుం డియు రాజకుమారుల కస్త్రవిద్య నేర్పుచుండెను. ధర్మరాజు యుద్ధమున కనుజ్ఞ గొనుటకయి యీతనియొద్దకు వచ్చినపుడు, భీష్మద్రోణులవలెనే ముందు వల్లించినమాటల నొప్పగించెను. అభిమన్యువధాదిసమయములలో నధర్మయుద్ధమునుఁ జేసినాఁడు. యుద్ధానంతరము కౌరవసేనయందు మిగిలినముగ్గురిలో నీతఁ డొక్క డయి యున్నాఁడు.

## ౬. అశ్వత్థామ.

ఈయన ద్రోణాచార్యుని కుమారుఁడు. భారతయుద్ధానం తరము కౌరవసేనలో మిగిలిన ముగ్గురిలో నీతఁ డొక్కఁడు. దుర్యోధనుఁడు భీమగదాప్రహారమున దొడలు విరిగిపడిన నాఁటిరాత్రి, పాండవశిబిరములో దొంగవలెఁ జొచ్చి, నిద్రపోవు చున్న మిగిలిన సేనానాయకులను, నుపపాండవులను గొంతులు కోసి చంపెను. కటికివాఁ డైనను నిదురబోవుచున్న జంతువుల

సీతనివలె గోసి చంపఁడు. ఇట్టి యమానుష ఘోరకృత్యము చేసిన యితనిఁ నామరుచటిదినమున నోడించి, యితనిశిరోమణినిఁ ద్రౌపది కిచ్చి, యీమెదుఃఖమును పాండవు లుపశమింపఁ జేసిరి.

## ౭. శల్యుఁడు.

ఈయన మద్రదేశపురాజు. నకులసహదేవులకు మేన మామ. ధర్మరాజుయొక్క యాహ్వానముచే బాండవపక్షమున యుద్ధముఁజేయుటకు వచ్చుచుండునప్పుడు, మధ్యమార్గమునఁ దుర్యోధనుని కృత్రిమాతిథిసత్కారమునకు మెచ్చుకొని, పాండవులచేఁ జేయఁబడిన దని భ్రమసి, మోసపోయి, దుర్యోధనుని పక్షమున యుద్ధముచేయుట కియ్యకొని, యుద్ధము చేసెను. కర్ణుని యనంతరము కౌరవసేనాధిపత్యము నొక యర్ధదిన మొంది ధర్మజునిచేఁ జంపఁబడెను.

ప్రభు వగువాఁ డనేక రాజభోగముల ననుభవించి యుండియు, వివేకములేక యొకనాఁటిసత్కారమునకు మోస పోయినందున, నీతఁడు తమవారిపక్షమున యుద్ధము చేయక పోవుటయే కాక, యెవ్వరివలన నాహ్వానము చేయఁబడెనో యట్టిధర్మరాజుచేఁ జంపఁబడెను.

## ౮. ధృతరాష్ట్రుఁడు.

ఈయన విచిత్రవీర్యుని జ్యేష్ఠకుమారుఁడు. ఇతఁడు జాత్యంధుఁ డైనను, నితని సోదరుఁడు పాండురాజు దిగ్విజయము చేసి

రాజ్యము నీతనియాజ్ఞకు లోఁబడి పాలించెను. అంధుఁ డగు వాఁడు రాజ్యాధికారమున కనర్హుఁడై యుండినను, పాండురాజు తానే రాజ్యమునుఁ దీసికొనక యన్నయందు గల భక్తికొలఁది ప్రభుత్వమును విడిచియుంచినప్పటికి, నట్టి సోదరునికుమారు లును, ధార్మికులును, నగు పాండవులకు ముం దొప్పి యిచ్చిన యర్థరాజ్యమును దనజ్యేష్ఠపుత్రుఁడగు దుర్యోధనుఁడు కపట ద్యూతముచే హరించుచున్నపుడు, దాని నితఁ డుపేక్షిం చుటయే యీమహాభారతయుద్ధమునకు గారణమైనది. ఇం దుకు నిదర్శనము:—

1. శ్రీకృష్ణులవారు రాయభారమునకు వెళ్లి మరలి వచ్చుతరుణములో ధృతరాష్ట్రుఁడు 'నాయందేవిధమైన తప్పును లే ద'ని వారితోఁ జెప్పఁగా నచట నున్న బాహ్లికభీష్మద్రోణ కృపాచార్యులవైపు చూచి యీక్రిందివిధమున నెత్తి పొడిచి సెల విచ్చిరి—

తే. గీ. "ఇప్పు డీసభఁ బుట్టిన యింతవట్టు
మీకు దెల్లంబ కాదె? యీమేదినీవి
భుండు దా నేమిటికిని ముఖ్యుండగాను
తప్పు తనదెస లే దని చెప్పి విడిచె."

2. పాండవులు వనవాసమున నుంకుతరి నొకబ్రాహ్మ ణుఁడు వారిశ్రమనుఁ జూచి వచ్చి తనతోఁ జెప్పినపు డీ

ధృతరాష్ట్రుఁడే యిదియంతయు దనవలననే కలిగిన దని యొప్పుకొని యీక్రిందివిధమున జింతపడియున్నాఁడు—

క. "నా చేసినకీడునఁ గడు
నీచుం డగు నాతనూజు నేరమి నిమ్మై
నోచెల్లె పార్థులకు బు
ణ్యాచారుల కెందు లేని యాపద వచ్చెఁ."

విదురసంజయులు పాండవులయరణ్యవాసాదిశ్రమకును, భారతయుద్ధమునకును నీవే కారకుఁడ వని పలుమారు లితని తోఁ జెప్పియున్నారు.

భీష్మద్రోణకర్ణశల్యులలో నొక్కొక్కరు హతు లైనపిదప, వారివారిమరణమును విని మొదట జింతించుచు, దుర్యోధనుని మేలుకొరకును బాండవుల నాశముకొరకును నాపైని యేమి చేసి రని యాతురతతో నీధృతరాష్ట్రుఁడు సంజయు నడుగుచు వచ్చెను. దీనివలన నందరును మడియువరకు దనకుమారునికి జయము గలుగునో యనునాస వదల లే దని స్పష్ట మగు చున్నది.

## ౯. గాంధారి.

ఈయమ ధృతరాష్ట్రునిపట్టమహిషి. మహాపతివ్రత. రెం డవమారు జూదమునకయి ధర్మరాజును బిలువనంపుటకు దుర్యో ధనునికి వశుఁ డయి ధృతరాష్ట్రుఁడు ప్రాతి గామి యనువానినిఁ

బంపఁబోవునపుడు, దుష్టుఁడైన యీదుర్యోధనుని విడిచివేయు మనియు, జూదమువలన హాని గలుగు ననియు, స్పష్టముగ ధృతరాష్ట్రునితోఁ జెప్పెను. మఱియు శ్రీకృష్ణరాయభారసమయమున నీయమ తనభర్తతో నీవిధముగఁ జెప్పినది:—

తే. గీ. "అనుఁడు నీపుత్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి
యెఱిఁగి వానివశంబున నేల పోయె ?
దీవు పాండవులకు నేమి యిచ్చితేని
నడ్డ పడ నెవ్వరికి వచ్చు నధిప చెపుమ."

ఈసందర్భమునను, పైని నుదహరించిన సందర్భమునను, దుర్యోధనునితోను, ధృతరాష్ట్రునితోను, నీమె చెప్పినమాటలు సంస్కృతభారతములో ననేకముగ గలవు. ఈ సమయముల యందేకాక యనేకపర్యాయము లీమె ధర్మమును విడువక పలికి యున్నది.

## ౧౦. పాండురాజు.

ఈయన విచిత్రవీర్యుని రెండవకుమారుఁడు. తనయన్న యగు ధృతరాష్ట్రుఁ డంధుఁ డైనను నతనియెడ గలభక్తిచే రాజ్యభారము నతనియందే యుంచి, దిగ్విజయము చేసి, యన్న యాజ్ఞకు లోఁబడి, రాజ్యమును బాలించి, యడవి కేగి, యచట మృతుఁ డయ్యెను.

## ౧౧. కుంతీదేవి.

ఈమె పాండురాజు జ్యేష్ఠమహిషి. వసుదేవుని సహోదరి. కుంతిభోజుఁ డసంతానవంతుఁడై యీమెను బాల్యమునందే తెచ్చుకొని, యభిమానపుత్రికగాఁ బెంచి పాండురాజున కిచ్చి వివాహము చేసెను. ధర్మరాజు, భీముఁడు, నర్జునుఁడు, నను ముగ్గురు నీమెకుమారులు. భర్త మరణానంతరమున దన ముగ్గురుకుమారులయు, సవతికుమారు లిరువురయు, సంరక్షణముకొరకు హస్తినాపురమునకు వచ్చెను.

## ౧౨. మాద్రి.

ఈయమ పాండురాజు రెండవభార్య. శల్యుని చెలియలు. నకులసహదేవు లీమెకుమారులు. భర్త మరణానంతరము సహగమనము చేసెను.

## ౧౩. విదురుఁడు.

ఇతఁడు దాసీపుత్రుఁ డైనను, బాల్యమునుండి రాజకుమారులతోఁ గలిసి విద్యాభ్యాసము చేయుచు, నస్త్రవిద్యనుగూడ నేర్చెను. బాగుగఁ జదివినవాఁడు. ధర్మాధర్మవివేకముగల వాఁడు. ధృతరాష్ట్రునకు మనస్తాపము గలిగినపుడెల్లను నితనినే పిలిచి తనమనోవ్యథనుఁ దెలుపుచు నితనివలన జెప్పఁబడు నీతిమార్గములను వినుచుండెను. కాని యెప్పుడు నీతఁడు చెప్పినప్రకారము లేశమాత్రము దిరుగలేదు.

ఈవిదురుఁ డెవరి కేయేతరుణములలో హితవు చెప్ప వలసి వచ్చునో యప్పు డంతయు భీష్మద్రోణకృపాదులవలె గాక నిష్కాపట్యముతోఁ జెప్పియున్నాఁడు. కౌరవులయొద్ద జీవనోపాధి కలిగినప్పటికి, పాండవులను వారణావతమున లక్క యిండ్లలో బెట్టి చంపుటకుగాను జేసిన దుర్యోధనుని దుష్ప్రయత్నమునుఁ దెలిసికొని, పాండవుల కెఱింగించి, వారి నట్టి యాపదనుండి కాపాడియున్నాఁడు.

శ్రీకృష్ణులవారు రాయభారమునకు వెళ్లినపుడు ధృతరాష్ట్రునిభవనమందే కాక భీష్మాదులగృహములయందు సహభోజనము చేయుట మాని తమకు ప్రియుఁడైన యీవిదురుని యింట భోజనము చేసిరి. ఈసందర్భములో శ్రీకృష్ణులవారు సభయందు దుర్యోధనునితో నిట్లు సెల విచ్చిరి:—

క. "పగవారియింటఁ గుడిచిన
నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ
దగ దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో."

నేను పగతుండనే యంటేని,

క. "అలుగుదు పాండవులకు వా
రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి

ట్టలముగఁ దమప్రాణములకు
నలుగు జనులు పగతు రనుట యనుమానంబె"

ఆ. వె. "కారణంబులేక కౌంతేయులకు బాల్య
మాది గాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులుఁ దోడఁబుట్టువు లాద్యులు
వైర మెత్తఁ దగునె వారితోడ."

మఱియు నీతఁడు శ్రీకృష్ణులవారిమహిమను బూర్తిగ నెఱిఁగినవాఁడు. శూద్రుఁ డైనను విద్యాబుద్ధులు గలవాఁ డగుటచే నింతగౌరవమునకుఁ బాత్రుఁ డయ్యెను.

౧౪. సంజయుఁడు.

ఇతఁడు కౌరవపక్షమున బాండవులయొద్దకు సంధిమాటలలో దూతగ వచ్చినవాఁడు. ఇతనియందు ధృతరాష్ట్రునకు గడునను రాగము గలదు. అతఁడు తనమనోవ్యథను నితనితోను జెప్పుట గలదు. ఆవృద్ధరాజునకు భారతయుద్ధకథ నితఁ డెఱింగించుచు వచ్చినటుల చెప్పఁబడి యున్నది. ఒక్కొక సేనాధిపతి హతుఁ డైనపిదప నతఁడు యుద్ధము చేసినదినముల కథను నాసేనాధిపతి మరణమును నొక్కసారిగఁ జెప్పినటుల నున్నది. ఏనాటియుద్ధకథ నానాఁటిరాత్రి యేల యతనితోఁ జెప్పకపోయెనో తెలియరాదు.

ఈసంజయుఁడు సభలయందును, ఒంటరిగ ధృతరాష్ట్రుని తోను ననేకపర్యాయములు జంకక ధారాళముగను యుక్తి యుక్తముగను జెప్పియున్నాఁడు. ఇట్టివాఁ డగుటవలననేకదా, ధర్మరాజు యుద్ధానంతరము తన రాజ్యకాలములో నితని నొక మంత్రిగ నుంచుకొని యుండెను.

## ౧౫. దుర్యోధనుఁడు.

ఇతఁడు ధృతరాష్ట్రుని జ్యేష్ఠకుమారుఁడు. ఈభారతయుద్ధమున కీతనితండ్రి యెంత ప్రధానుఁడో యితఁడును నంతకు నెక్కుడు ముఖ్యుఁడై యున్నాఁడు. మరియు మత్సరబుద్ధితో ననేకదుష్కార్యములు చేసెను. సంకల్పసూర్యోదయ మనుగ్రంథమున గామక్రోధాదిగుణములను బురుషులనుగా దీసికొనినట్లు భావించినచో నీతఁడు మత్సరస్వరూపుఁ డనియే చెప్పవచ్చును. ఇతనికి బాల్యమునుండి భీమునియందు ద్వేషము హెచ్చుగ గలిగియుండెను. అతనినిఁ జంపుకొరకు నీళ్లలోఁ ద్రోయించెను. విషము బెట్టించెను. ఈవిధముగ బగఁ దీర్చికొనుట బహుదుష్ట బుద్ధి గలవాఁడే కాని తదితరుఁడు చేయఁబూనఁడు. తనతండ్రి ధర్మరాజును యౌవరాజ్యమున నభిషేకించినపిదప నతని యందును దక్కినపాండవులయందును నితనికి నసూయ హెచ్చెను. అదిమొదలు పాండవులను రూపుమాపుటకు నానాజన్మాంతము బ్రయత్నింపుచునె వచ్చెను. ధర్మరాజు యువరా

జయినపిదప దనకంటె నతఁ డధికుఁ డగు నని తలఁచి, తండ్రి తో ననేకమాయోపాయములు చెప్పుకొని యొప్పించి, పాండవులను వారణావతమునకుఁ బంపి యచట వారలను లక్కగృహములో నుంచి కాల్పింపఁ బ్రయత్నించెను. ఆమోసపుగార్యమును విదురుఁడు పాండవులకు రహస్యముగఁ దెలిపినందున వార లటుల కాక తప్పించుకొని బ్రదికిపోయిరి. ధర్మరాజు తనకు యువరాజ్యాభిషేకము జేసిన ధృతరాష్ట్రుఁడు దురాత్ముఁ డగు నీదుర్యోధనుని ప్రార్థనకు లోఁబడి వారణావతమునకుఁ బంపించుటవలన నిట్టియాపద కలుగఁబోయినందున నాయాపదనుండి తప్పించుకొనినపిదప, దమపెదతండ్రి యగు ధృతరాష్ట్రునియొద్దకుం బోవుట సరికా దని తలఁచి, యేకచక్రపురమున కేగి యచట బ్రచ్ఛన్నముగ ద్రౌపదీస్వయంవరము వరకు సోదరులతోను దల్లితోను నుండెను. వారలపోక దెలియక హతులయి రని నమ్మి సంతోషముతో దుర్యోధనాదులు విఱ్ఱవీగుచుండిరి. ఇండ్లలోఁ బెట్టి కాల్చిచంపఁబోవుట, నీటఁద్రోయుట విషాన్నము బెట్టుట వీనికంటె దుష్టతరమైన పనియై యున్నది. ఇట్టిపని నెంతదుర్మార్గుఁ డైనను చేయఁబూనఁడు. ద్రౌపదీవివాహానంతరము ద్రుపదపురమున బాండవు లుండుటను చారులవలనఁ దెలిసికొని సంగతి సందర్భములనుఁబట్టి విధిలేక తనసోదరునికుమారులగు వారినిఁ బిలిపించి ధృతరాష్ట్రుఁ డర్థ

రాజ్య మిచ్చెను. అటులఁ బాండవులకు నీయఁబడినయర్థరాజ్యమునకు మొదటినుండి దుర్యోధనుఁ డసూయ గలవాఁడై పాండవులభాగమును స్వీకరింపఁ గోరి, యనేకమాయోపాయములను యోచించి, చివరకు మాయాద్యూతమున వారలరాజ్యమునుఁ దీసికొనెను. అంతటితో దృప్తినొందక కార్పణ్యమే ప్రధానముగ గల యితఁడు బహిష్ఠ యై యుండినపాండవపత్ని యగు ద్రౌపదిని దుశ్శాసనునివలన బలాత్కారముగ సభకు నీడ్చి తెప్పించి సభాసదులయెదుట వస్త్రవిహీనురాలినిగ జేయింపఁ బూనెను. ఈమహాఘోరకృత్యమువలననే రాజాధిరాజగు నీతనితల తుదను భీమునిచే దన్నఁబడెను. ప్రథమద్యూతానంతరమున ధృతరాష్ట్రునివలనఁ బాండవులకు వారిరాజ్యము తిరుగ నిప్పింపఁబడుటనుఁ జూచి యారాజ్యమునే కపటద్యూతమువలన మరల నెన్నిమారులు గెలిచినను వృద్ధుఁడగు తన తండ్రి లోకమునకు జడిసి యిచ్చివేయుచునే యుండు నని తలఁచి దుర్యోధనుఁడు రెండవసారి కపటద్యూతమునకుఁ బిలిచి యెవ్వరోడిన వారు పండ్రెండుసంవత్సరములు వనవాసము చేయుటకును బదుమూడవసంవత్సరమున నజ్ఞాతవాసము చేయుటకును నట్టియజ్ఞాత వాసములోఁ బయలుపడినయెడల దిరుగ బయి విధమున నరణ్యాజ్ఞాతవాసములు చేయుటకును నొడ్డుగాఁ బెట్టుకొని యాడించెను. అట్లాడిన యాశకునియొక్క కపటద్యూతమున

ధర్మరాజాది యరణ్యాజ్ఞాతవాసములు చేయుటకు ద్రౌపది తోను సోదరులతోను గలిసిపోయెను.

తిరుగ బాండవులు ప్రతినఁ దీర్చికొని వత్తురేమో యను భయముచేత నితఁ డనేకమాయావిద్యలను నేర్చుటయే కాక యుద్ధనైపుణ్యము నభివృద్ధిపరచుచునే వచ్చెను.

పాండవు లరణ్యవాసమునం దుండుతఱి దుర్యోధనుఁడు తనవిభవమును వారలకు గనఁబరచుటకుగాను ఘోషయాత్ర యను నెపమున సేనాబలయుక్తుఁ డయి వెళ్లి పాండవు లుండు ద్వైతవనంబునఁ గంధర్వులను నొకతెగవారి యాజమాన్యము క్రింద నున్న యొకసరస్సు నొద్దున సేనలతోఁ బస చేసెను. తమయనుమతిలేక యటుల విడిసియున్న దుర్యోధనాదులతోఁ గంధర్వులు యుద్ధముచేసి యందరువీరుల నోడించి దుర్యోధనుని భార్యాప్రభృతిస్త్రీలతో బంధించి తమనగరమునకుఁ దీసికొని పోవుచుండిరి. అంత నీదుర్యోధనునిపరిచారకులలోఁ గొందరు దిక్కు తోఁచక సమీపమున నుండు ధర్మరాజుకడ కేగి తమ ప్రభువునకు సంభవించినయాపదనుఁ జెప్పికొనిరి. 'మన మిట్టి దురవస్థలో నుండునపుడు మనకు దనవిభవమునుఁ జూపుటకు వచ్చిన వానికి గాగలపని గంధర్వులే చేసిరి. మన మేల యతనికి సహాయులమై విడిపింపవలె' నని భీమునిచే నివారింపఁబడినను యుధిష్ఠిరుఁ డతిధర్మరాజు గావున విడక తమ్ముల నంపి యాదుర్యో

ధనుని స్త్రీసహితముగ విడిపింపఁజేసెను. పాప మీదురాత్ముఁ డాకృతజ్ఞత యేమియు లేనివాఁ డయియే పిదప సంచరించెను.

పాండవు లజ్ఞాతవాసములో నుండుకాలము పూర్తి యగుటకు ముందు వారిని భగ్నప్రతిజ్ఞులుగ జేయుటకుఁ గోరి భీష్మునిచేఁ జెప్పఁబడిన గురుతులవలన విరటరాజు పురమున బాండవులుండియుండవచ్చునని యూహించి యచటి కేగి దుర్యోధనుఁడు తనసేనను రెండుభాగములుగ విభజించి ముందునాఁ డం దొక భాగమును విరటునిపురమునకు దక్షిణభాగమునం దున్న గోవులను బట్టుటకు నియోగించెను. తన్నివారణముకొరకు విరటరాజు సేనలతో వెళ్లెను. అతనివెంట నర్జునుఁడు తప్ప దక్కిన నలువురుపాండవులును వెళ్లిరి. అట్టిసమయమును జూచి మరునాఁ డుత్తరభాగమున నున్న గోశాలలోనిపశువులను దస్కరించుట కీదుర్యోధనుఁడు భీష్మకర్ణాదివీరులతో వెడలి ముట్టడించెను. అపుడు విరటునికుమారుఁ డగు నుత్తరునితోఁ గలిసి యర్జునుఁడు పోయి సేనపయిఁ దాఁకి గోవులను మరలించుకొని వచ్చెను. అప్పు డాతనియుద్ధాటోపమునుఁ జూచి యర్జునునిగాఁ దెలిసికొని యజ్ఞాతవాసకాలము మించినదిగా దలఁచి లెక్కపెట్టి చూచుకొని యెరిఁగి చిన్నబోయి దుర్యోధనుఁడు హస్తినాపురమునకుఁ బోయెను. ఆ దక్షిణగోగ్రహణమునిమిత్తము వెడలిన సేనాభాగము విరటరాజు మొదలగువారిచే నోడింపఁబడెను.

పాండవు లరణ్యాజ్ఞాతవాసప్రతిజ్ఞలనుఁ దీర్చికొని యుప ప్లావ్యమున విడిది చేసికొని తమరాజ్యభాగమును దమకిప్పింపు మని కౌరవులయొద్దకు దూత నంపిరి. అందుకు దుర్యోధనుఁడు నిరాకరించెను. తుదకు శ్రీకృష్ణులవారే రాయభారమున కేగిరి. దూతగ వచ్చిన యాతనినిఁ దుర్యోధనాదులు పట్టి కట్టుటకు సమకట్టిరి. సర్వవ్యాపియగు నాభగవంతుఁ డిట్టిదుష్టులచే గట్టఁ బడునా? ఏమివింత? సేనానాయకులగు భీష్మద్రోణకర్ణశల్యు లొక్కొక్కరు వరుసగా మడియుటను జూచుచు దుర్యోధనుఁడు రాజ్యకాంక్షనుబట్టి తనమంచిని విచారింపక చివరకు దాను పడువరకు యుద్ధముచేసి పదునొకం డక్షౌహిణులవారిని హతు లగువారినిగాఁ జేసెను. అందరు మడిసిన పైని పారిపోయి యొకమడుగులోఁ జొచ్చి యుండెను. పాండవు లాసంగతిఁ దెలిసి కొని యచటికిఁ బోయిరి. అపుడు ధర్మరాజు తమయైదుగురిలో నెవ్వనినైన నెంచికొని ద్వంద్వయుద్ధము చేసి గెలుపుగొను మని చెప్పఁగా భీముని నెంచికొని యాతనితో గదాయుద్ధము చేసి యతనిచే దొడలు విరుగఁగొట్టఁబడి నేలఁ గూలెను.

పాండవు లైదుగురిలో భీమునినే ద్వంద్వయుద్ధమున కేల యెంచె ననఁగా తనను రణములో జయించి తనతలనుఁ దన్ను టకు శపథముఁ జేసిన యీభీముఁడు బ్రదికియుండినచో నెప్పటి కైనను నాశపథమును నెరవేర్చు ననియు, తక్కిననలుగురు

పాండవులు తనవధకొఱకు శపథమును జేసినవారు కా రనియు లిసినవాఁ డగుటచేతను, తనకు గదాయుద్ధమె యభిమాన విద్య యగుటచేతను, భీముని దప్పక యాయుద్ధములోఁ జంపెద నని నమ్మిక గలిగి యెంచికొని హాతుఁ డాయెను.

ఈ దుర్యోధనుని విషయములోనే కదా తల్లియగు గాంధారియు నాప్తుఁ డగువిదురుఁడు నతిదురాత్ముఁ డగు వీనిని విడిచి కులమును రక్షించికొను మని చెప్పి యుండిరి. అతిపుత్రప్రేమచేత ధృతరాష్ట్రుఁ డితనిని విడిచికొనలేక పోవుటయె కాక యావద్రాజ్యభారమును నితనియందే యుంచి యితనికి వశ్యుఁడై యుండుటచేతనె యింతయుపద్రవము పుట్టినది. రాజద్రోహులను గులనాశకులను నెట్టివారి నైనను ప్రభువులు రాజ్యములోనుండి వెడలఁగొట్టుట రాజనీతి యై యున్నది. ఈనీతి పూర్వకాలమందె కాక యిప్పటికిని జరుగు చున్నది.

## ౧౬. దుశ్శాసనుఁడు.

ఇతఁడు ధృతరాష్ట్రుని రెండవకుమారుఁడు. దుర్యోధను నికిఁ దమ్ముఁడు. "అతనితమ్ముఁడె యితఁడు గాఁడా" యనునట్లు తనయన్నవలె నితఁడును దుష్టుఁ డయియె యుండెను. పాండవులనాశముకొఱకు దుర్యోధనునిచేఁ జేయఁబడిన ప్రతికార్య మునకు ముఖ్యప్రోత్సాహకులలోఁ నితఁ డొకఁడై యున్నాఁడు.

ద్రౌపదీదేవి నేకవస్త్రయై యుండఁగా సభలోని కీడ్చికొని వచ్చినవాఁ డితఁడే. ఆపిదప నామెను వస్త్రవిహీనురాలి నిగ జేయ నుపక్రమించినవాఁడును నితఁడే. ఈదుష్కార్య మును జేసినందుకు భీముఁ డితనిని దుదను రణభూమియందు నుభయసేనలవారు నచ్చెరు వంది చూచుచు నుండఁగా వక్షస్థలమునుఁ జీల్చి గుండెరక్తమును ద్రాగెను అంత హతుఁ డాయెను.

## ౧౭. కర్ణుఁడు.

ఇతఁడు కుంతీదేవికి వివాహముకాకముందు బుట్టినవాఁడు. ఇతఁడు జన్మించుటకు నొకవరము గలదఁట. అటుల జన్మించిన వాని నంతఃపురమునందుంచక బహిర్గతుని జేసెను. ఆశిశు వొకసూతకులజాతునికిఁ దొరకగా నతనివలన బెంపఁబడెను. కావున నితఁడు సూతకులస్థుఁ డాయెను. క్షత్రియయోనిజుఁ డగుటచేత నస్త్రవిద్యాభ్యాసమం దభిరుచిగలవాఁడై మొదట ద్రోణాచార్యునికడ కేగి తన కావిద్యను జెప్పు మనఁగా నా యస్త్రగురుఁడు సూతకులఁజాతుఁ డని నిరాకరించెను. పిదప బ్రాహ్మణవేషము వేసికొని పరశురాముఁ డనువానియొద్ద కేగి యతనివలన నస్త్రవిద్య నభ్యసించెను. చివరకు వేషధారిగా నుంచుట నాగురువు తెలిసికొని కోపించి యావిద్యవలననే యిత నికిఁ గీడు గలుగునని వాక్రుచ్చెను. విద్యలను నేర్చుకొనువారు

తగినగురునివద్ద నేర్చికొనకపోవుటయు, తనస్వరూపస్వభావము లను మరుగుపరచి తగినగురునివద్ద నేర్చికొనుటయు నొక్కటియే. అట్టివిద్యలు వృద్ధికిరావు.

ఈకర్ణుఁడు క్రమముగ దుర్యోధనునియొద్ద బ్రవేశించి యా రాజకుమారునికి పాండవులయందు గలద్వేషమును నభివృద్ధి చేయుచు వారియెడల జేయఁబడు దుష్కార్యములకు బ్రోత్సాహపరచుచు నతిసన్మాని యాయెను. ఇటులనె చాలమంది ప్రభువులయొద్ద సన్మాను లగుచుందురు. అస్త్రవిద్యయందు గల నేర్పునుబట్టి పాండవుల నెదుర్కొనుటకు నితఁ డొక ప్రధాన వీరుఁడుగ నెన్నఁబడి దుర్యోధనునివలన నొక స్వల్పరాజ్యమున కభిషేకింపఁబడెను. అటుపయి యాతనిచర్య యీగ్రంథము యొక్క యుపోద్ఘాతములో వివరించి చెప్పఁబడియున్నది. ఇతఁడు భారతయుద్ధములో రెండుదినములు సేనాధిపతిగా నుండి యర్జునుని చే నంహరింపఁబడెను.

## ౧౮. శకుని.

ఇతఁడు గాంధారదేశపురాజు. గాంధారిదేవికి సోదరుఁడు అందుచే దుర్యోధనదుశ్శాసనులకు మేనమామయై యున్నాఁడు. గొప్ప జూదరి. మిగుల మోసగాఁడు. ఇతనిచే నాడఁబడిన కపట ద్యూతమునందే రెండుసారులు ధర్మరాజోడెను. భారతములోఁ జెప్పఁబడిన దుష్టచతుష్టయములో నితఁ డొకఁడు.

శక్తి నముప్పురు దుర్యోధనదుశ్శాసనకర్ణులై యున్నారు. లోక
ములో మేనమామగుణము లోకనికి సంప్రాప్త మగునపు డా
మేనమామయొక్క మంచిగుణములు రాక చెడుగుణము లబ్బు
టయే తరుచు.

ఇచట దండ్రినిబట్టిచూచినను మేనమామనుబట్టిచూచి
నను దుర్యోధనదుశ్శాసనులు దుష్టాత్ములు కాకపోవుదురా?
మేనల్లుర మేలుకోరి మొదటినుండి యితఁడు తుదవరకు
బాండవులకు గీడు గోరుచు జేయుచు వచ్చెను. తుదను యుద్ధ
మునం దితఁడు సహదేవునిచేఁ జంపఁబడెను.

౧౯. కృతవర్మ.

ఇతఁడు యాదవులలోనివాఁడు. ఒక యక్షౌహిణి సేనతో
వచ్చి కౌరవులకు సాయపడెను. శ్రీకృష్ణులవారు రాయభార
మునకు వెళ్లినపుడు దుర్యోధనాదులు వారినిఁ బట్టుకొన సమ
కట్టగా వారివెంట వెళ్లిన సాత్యకితోపాటుగ నితఁడు కౌరవ
పక్షమునం దుండియు నాస్వామివారికి సహాయపడుటకు సిద్ధ
మయ్యెను.

దుర్యోధనుఁడు పడినపిదప నాఁటిరాత్రి యశ్వత్థామ
చేయఁబోవు ఘోరకృత్యమునుగూర్చి కృపాచార్యునితోపాటు
వల దని యితఁడును జెప్పెను. కాని పాండవులకు ద్రోణుని
వంటి బూాహ్మము గురువగు కృపాచార్యుఁడు పాండవుల

క్షేమముకోఱకుగాని, యితఁడు యాదవులలోనివారగు శ్రీకృష్ణ సాత్యకుల క్షేమముకొఱకుగాని, విదురునివలె ముందు చెప్పి పంపకపోవుటయే కాక యీసమయమున శిబిరమునుండి తప్పించుకొనిపోవువాఁడినిఁ జూపుచుండిరి. విదురుఁ డట్లు చెప్పి పంపియుండబట్టియే కదా పాండవులు లక్క యింఢ్లలో మడియక బ్రదికిరి. యుద్ధానంతరమున గౌరవవీరులలో నిలిచియుండిన ముగ్వురు వీరులలో నీతఁ డొక్కఁడై యున్నాఁడు.

---

శ్రీకృష్ణ.

ఈభాగములోఁ బాండవపక్షవీరులవిషయము

చర్చింపఁబడును.



## ౧. ద్రుపదరాజు.

ఇతఁడు పాంచాలదేశాధిపతి. ద్రౌపదీదేవికి దండ్రి. బాల్యమునందు ద్రోణునితోఁ గలిసి యస్త్రవిద్యను నేర్చికొను నపుడు తనకు రాజ్యాధిపత్యము వచ్చినతరి దనతోఁ గలిసి సమస్తభోగముల ననుభవింపవచ్చునని యతనికిఁ జెప్పియుండెను. ఈద్రుపదుఁడు రా జయినపిదప ద్రోణుఁ డతనియొద్ద కేగి నీబాల్యసఖుఁడ నని చెప్పుకొనఁగా నీవంటిబీదబ్రాహ్మణుని కిని నాకును సఖ్య మెట్లు పొసఁగు నని నిరాకరించెను. ఆ ద్వేషమును ద్రోణుఁడు మనస్సునం దుంచుకొని రాజకుమారు లస్త్రవిద్య నభ్యసించినపిదప నాద్రుపదునిఁ బ్రాణములతోఁ బట్టి తెచ్చి తనముందు పెట్టుటయే గురుదక్షిణగ భావించెద నని వారలను గోరెను. ముందు కురుకుమారు లటుల చేయుటకుఁ బ్రయత్నించి ద్రుపదునిచేఁ బరాజితు లయిరి. అప్పు డర్జునుఁడు భీమనకులసహదేవసహితుఁడై వెడలి ద్రుపదుని

గట్టి తెచ్చి గురున కొప్పగించెను. బాల్యమున దూరదృష్టి లేకపోయినను జేసినప్రతిజ్ఞను లక్ష్యముచేయక తప్పినందున ద్రుపదున కీపరాభవము సంభవించెను. ద్రోణునిచే విడువఁబడి తనపురి కేగి తిరుగఁ బగదీర్చికొనుటకుఁ బ్రయత్నించుచు నుండెను. ద్రోణునిఁ గెలువఁ గోరి తనకుమారుఁ డగు ధృష్టద్యుమ్నునికిఁ బాగుగ నస్త్రవిద్యను నేర్పించెను. అంతటితోఁ దృప్తినొందక గొప్పవీరునిసాహాయ్యమునుఁ గోరి యస్త్రవిద్యను నేర్చినవారికి నెల్ల గష్టతమమైన యొకమత్స్యయంత్రమును నిర్మించి, దాని నెవ్వఁడు కొట్టునో వానికి దన కుమార్తె నిచ్చి వివాహము చేసెద నని ప్రతిజ్ఞ వట్టి చాటించెను. ఎవ్వరికిని గొట్ట శక్యముగాని యామత్స్యయంత్రము నర్జునుఁడు కొట్టి తనతల్లియాజ్ఞవలన జ్యేష్ఠకనిష్ఠసోదరులతోఁ గలిసి యాకన్యను వివాహ మాడెను. భారతయుద్ధమునందు బాండవపక్షమున సేనలతో వచ్చి యుద్ధము చేసి యీద్రుపదుఁడు తుదను ద్రోణునిచే హతుఁ డాయెను.

## ౨. ధృష్టద్యుమ్నుఁడు.

ఇతఁడు ద్రుపదునికుమారుఁడు. భారతయుద్ధమునందు బాండవులకు సేనాధిపతిగా నుండి పదునెనిమిదిదినములు మిగుల నేర్పుతో యుద్ధము చేసి యానాఁటిరాత్రి నిదురసమయమున దుష్టతముఁ డగు నశ్వత్థామచేఁ బలాత్కారముగఁ జంపఁ

బడెను. ద్రోణాచార్యుఁ డలిసి యుద్ధముచేయ లేక ప్రాయోప వేశమునఁ బ్రాణములు విడుచుటకు గూర్చునియుండఁగా నితని కట్టిపని యెందు కనియు, తనతండ్రితలంపు నెరవేర్చుట తనపని యనియు దలఁచి యాద్రోణునితలను నఱికెను.

3. విరటరాజు.

ఇతఁడు మత్స్యదేశపురాజు. మిగుల సత్యకాలపుపెద్ద మనుష్యుఁ డని చెప్పవచ్చును. ఏల యనిన, అజ్ఞాతవాసకాలమున జీవనముకొఱకు బ్రచ్ఛన్నవేషులై యేకదినమున దన యెదుటికి వరుసగ వచ్చిన పంచపాండవులకును ద్రౌపదికిని వీరు పాండవులా యని లేశమాత్రమును సంశయింపక యాకారములనుబట్టి విచారింపక వేషధారులవేషములను నమ్మి జీవనోపాధులను గల్పించెను. ఇతనికడ ధర్మరాజు యతివేషధారిగను, భీముఁడు వంటయింటియజమానుఁడుగను, నర్జునుఁడు రాజకన్యలకు నృత్యవిద్య నేర్పువాఁడుగను, నకులుఁడశ్వరక్షకుఁడుగను, సహదేవుఁడు గోరక్షకుఁడుగను, ద్రౌపది విరటునిభార్యయొద్ద సైరంధ్రి (అనఁగా నలంకారములు చేయునది) గాను నుండి యజ్ఞాతవాసమును గడపిరి. మరియు దక్షిణోత్తరగోగ్రహణానంతరదివసమున బాండవులు ద్రౌపదీసహితముగ మారువేషములను దీసివేసికొని సుస్నాతు లయి విరటుని ... ముందుగ సభామంటపమున కేగిరి. ధర్మరాజు తన

యనుజు లిరుప్రక్కల గొలిచియుండ విరటునిసింహాసనము పయిని ద్రౌపదీయుక్తుఁ డయి కూరుచుండెను. అటుల నున్న వారినిఁ జూచి యీవిరటుఁడు 'పాప' మెంతసత్యకాలపు వాఁడో గాని వారు పాండవు లని తెలిసికొనలేక వారివలననే తెలిసికొని యానందించి యేకాకి యగు తనకుమారునితో యుద్ధమున కేగి కౌరవులను జయించి యతనిని వైరులవలన గాపాడినందున దనకుమార్తెయగు నుత్తరను నర్జుననకు సమర్పించెను. అర్జునుఁ డాయుత్తరకు నృత్యవిద్యను నేర్పినందున తాను స్వీకరింపక తనకుమారునికి జేసికొనియెద నని యావిరటు నొప్పించెను.

ఈ పాండురాజకుమారులు తమయస్త్రవిద్య నభ్యసించుటయే కాక యితరవిద్యలనుగూడ నేర్చికొనియుండినందుననే కదా యజ్ఞాతవాస వత్సరకాలమున బయలుపడక యుండిరి. కావునఁ బ్రతివారు నొకదానికంటె మించినవిద్యలను నేర్చికొని యుండవలెను. అందుఁ బ్రభువులకు గొన్నివిద్యలు వచ్చియున్నను ననేకవిద్యావిషయములను దెలిసికొనియుండుట యవసరము.

ఈవిరటుఁడు భారతయుద్ధమున బాండవులకు సేనలతో సహాయుఁడై తుదను ద్రోణునిచే సంహారింపఁబడెను.

## ౪. యుధిష్ఠిరుఁడు.

ఇతఁడు పాండుమహారాజు జ్యేష్ఠకుమారుఁడు. ధర్మాధర్మ వివేచనమందు మిగుల బట్టుదల గలవాఁడు కావున ధర్మరాజని ప్రసిద్ధి కెక్కెను. ఈ ధర్మాధర్మవిషయములో నితనికి గలపట్టుదల భారతగ్రంథములో బెక్కుచోటుల గనఁబడుచుండినను శాంత్యానుశాసనికపర్వములలోఁ భీష్ముని నితఁడడుగుప్రశ్నలనుబట్టిచూడఁగాఁ జదువరులకు స్పష్టముగ దోఁపక మానదు. మరియు ధర్మమునకు గట్టుబడుటలో నితనిని మించినవాఁడు లేఁడు. ఏల యనిన: భార్యావస్త్రాపహారణకాలమున నితనివలె ధర్మమునకు గట్టుపడియుండినభర్త మరియుండఁడు కదా? అందునుబట్టియు నాకాలమున జూదమునకు బిలువఁబడినప్పుడు నిరాకరించుట కూడదనిపని యనుప్రసిద్ధి ననుసరించి మొదటిద్యూతమునకు వచ్చి కపటముగ నోడింపఁబడి దానిం దెలిసియు రెండవసారి జూదమునకు బిలువఁబడియేగి యోడి యరణ్యాజ్ఞాతవాసములలో శ్రమను బొందెను. దీనివలన నీతని నతిధర్మరా జని చెప్పవచ్చును. (అతి సర్వత్ర వర్జయేత్) ఇతనికి జూదమునం దెంత యాసక్తియో కాని యజ్ఞాతవాససమయమందు యతివేషమును దాల్చియు విరటరాజుతో నెల్లప్పుడు పాచిక లాడుచునే యుండెను. ఎవరికిగాని యెట్టివ్యసనములయుండైనను నావ్యసనములకు దాసులై

యుండఁ దగదు. అందుఁ బ్రభువులగువారు మిగుల జాగ్రత్తగ నుండవలెను.

వారణావతమున లక్కయిండ్లలో గాల్పఁబడక తప్పించుకొనిపోయి తిరుగ దన పెదతండ్రియొద్దకుఁ బోయిననుఁ, బాహాటముగ నొకచోట నివసించియుండిననుఁ దనకును, దనవారికి, నాపదలు కౌరవులవలన సంభవింపక మానవని ముందు యోచనకలిగి యేకచక్రపుర మను నొకబ్రాహ్మణులపల్లెలో నుండి తననుఁ దనవారినిఁ గాపాడుకొనెను.

అర్జునుఁడు మత్స్యయంత్రమునుఁ గొట్టి ద్రౌపదిని వీర్యశుల్కనుగా స్వీకరించినపిదప దల్లియాజ్ఞను మీరలేక ధర్మరాజు తననలుగురుసోదరులతోడ నామెను వివాహ మాడెను. ఇట్లు సోదరు లొకదానిని వివాహమాడుటకు ధర్మశాస్త్ర మొప్పదు. ఇందుకు మాత్రాజ్ఞయే కారణ మని తీసికొందమా యనిన నాకాలమున నట్లు చేయుట బాగుగ నుండిన నుండవచ్చును గాని యీకాలములో దూష్యమై యున్నది. పితరులయాజ్ఞను బ్రతివారును మీరకూడ దని సాధారణనీతి యుండినను నాకార్యము యొక్క మంచిచెడుగులను యోచించి మంచిపనుల యందు నడచుకొనవలెను. అంను స్త్రీలు నియమించువిషయములలో నిందుగ విచారింపవలెను. ద్రౌపదీదేవి యైదుగురు భర్తలు కలది యగుటచేతనేక దా యామెకు వస్త్రాపహారణము

చేయుట తప్పు గాదని కర్ణుఁడు పలికెను. ఆయుద్దేశముతోనే దుర్యోధనుఁ డామెను సభకు రప్పించి యుండును. ఆదుష్టుల దుర్మార్గత చెప్ప నేల? వేశ్యనైనను లేదా ఎట్టిగుడిసేటుదానినైనను సభయందుగాని నలుగు రుండుచోటఁగాని వస్త్రవిహీనురాలినిగ జేయవచ్చునా? మరియుఁ బాండవులకు బావమరది వరుసగల సైంధవుఁడు నరణ్యవాసమం దున్నద్రౌపది నైదుగురుభర్తలుకలది యనియేకదా యీడ్చుకొనిపోయెను. ఆపిదప భీమార్జును లతనినిఁ బట్టి కట్టి తెచ్చుట యాపయిని తల గొరిగి యూర్ధ్వపుండ్రము లుంచి పాండవదాసునిగాఁ బ్రదుకు మని విడుచుట జరిగియున్నది.

ద్రౌపదీవివాహానంతరమున ధృతరాష్ట్రుఁడు పాండవులను బిలిపించి వారియర్ధరాజ్యమును ధర్మరాజున కిచ్చెను. ఇటుల కొంతకాలమైనవెనుక ధర్మరాజు రాజసూయమను నొక గొప్పక్రతువును జేసెను. మొదటినుండియు బాండవులయెడ మత్సరబుద్ధితో నున్న దుర్యోధనుఁ డాక్రతువుయొక్క వైభవమును, రాజులు దెచ్చినకానుకలను, ధర్మరాజునం దితరరాజులకు గలగౌరవమునుఁ, జూచి మరియు మచ్చరించెను. ఆపయిని జరిగినకపటద్యూతాదులవిషయ మిదివరకే చెప్పఁబడియున్నది.

పాండవు లరణ్యవాసమున నుండుతరి దుర్యోధనుఁడు ఘోషయాత్రకుగా వెడలి గంధర్వులచే బట్టువడి విడిపింపఁ

బడెననువిషయ మిదివరకే వ్రాయఁబడి యున్నది. బంధు మిత్రుల కితరులవలన నాపదలు సంభవించినపుడు వారలను గాపాడుట నిస్సందేహముగా ధర్మమే. అయితే ఈదుర్యోధనుఁడు బాల్యమునుండియు బాండవులకుఁ గీడు గోరుచు లక్కయిండ్లలోఁ బెట్టి చంపఁబూనెను. మొదటిసారి కపట ద్యూతమున నర్థరాజ్యమును, భార్యాసహితముగ బాండవులను, గెలుచుకొనెను. రెండవసారి మొదటివిధమున గెలిచికొనినయెడల ముసలివాఁడగు తనతండ్రిచే నర్థరాజ్యము తిరుగ నిప్పింపఁబడుచునేయుండు నని తలఁచి యరణ్యాజ్ఞాతవాసముల నోడినవారు చేయుటకు నిర్ణయించి కపటద్యూతమునఁ బాండవులను గెలిచెను. ఇటుల చేసినచో నజ్ఞాతవాసమున దప్పక బయలు పడుదు రనియు నరణ్యవాసమునందు శ్రమచే శుష్కించి బలహీనులు కాగల రనియు నీపదమూఁడుసంవత్సరములు బంధుమిత్రుల కెడ మగుదు రనియు దలఁచి గెలిచెను. కావున దుష్టబుద్ధితో నిట్లు విరోధి యై యున్న యీదుర్యోధనుని విడిపింపు మని సోదరులను బంపుట యనుచితము. అటుల నీధర్మరాజు చేయుటయే యీభారతయుద్ధమునం దనేకులు మడియుటకుఁ గారణ మైనది.

పాండవులు సంధికొఱకు ద్రుపదపురోహితునిఁ బంపఁగా దుర్యోధనాదులు నదుత్తరము చెప్పిపంపక వెంటనే సంజయుని

దమదూతగా ధర్మరాజునొద్దకుఁ బంపిరి. అపుడు పాండవులు తమకు నొప్పందల ప్రకార మర్ధరాజ్యము నీయనిచో రాజధర్మ మగుయుద్ధమున రాజ్యము నొందుదు మని తీక్ష్ణముగాఁ బ్రత్యుత్తర మిచ్చి సంజయునిఁ బంపిరి. తిరుగ ధర్మరాజు తాను శ్రీకృష్ణులవారిని గౌరవులకడకు సంధికొఱ కనుపునపుడు చివరకు దమయైదుగురికి నైదుపల్లె లిచ్చినను జాలు నని చెప్పి పంపెను. అట్లు కురుగా జైదుపల్లె లిచ్చినచో వీరిపని యేమి యగును? ఇట్టిమహావీరు లైదుపల్లెలే కాదు. కొన్నిగ్రామములు గల యొకచిన్నరాజ్యమును సంపాదించుకొనఁజాలరా? లేదా బంధువులగు ద్రుపదవిరాటులయొద్ద నీపాటి భూస్థితిని బొందలేరా? ఇది యెట్లున్న దనిన:—'రావణుఁడు వచ్చి శరణుజొచ్చినయెడల దనయయోధ్యారాజ్యము నతనికి నిచ్చెద' నని శ్రీరాములవారు విభీషణశరణాగతిసమయమున సెల విచ్చిన ట్లున్నది. అయితే శ్రీరాములవారు సర్వజ్ఞులు. ధర్మరాజట్టివాఁడు గాఁడు. కావున నితఁ డట్లు చేయుట తగినపని కాదు. ఈధర్మరాజు కోరిక లె ట్లుండినను సంజయుఁడు తన యొద్దకు వచ్చినప్పుడు పట్టుదలతో నర్ధరాజ్యము నడుగుటకును శ్రీకృష్ణులవారినిఁ బంపునపుడు ముందువలె గాక యెంతైనను తగ్గించి యడుగుటకును గారణ మే మని విచారింతము. ఎదుటివాఁడు సంధిని గోరినపుడు బింకముగ బలుకుటయు దాను

రాయభారమంపునపుడు గొంత సుళువుగ నడుగుటయుఁ గలదు. అయితే ధర్మరాజైదుపల్లెలైన జివరకు నిమ్మని చెప్పి పంపినందుకు నాదుర్యోధనుఁ డీతని నిందుదీనత నెఱిఁగి సూది మొనమోపినంతస్థలమైన నీయ నని నిరాకరించెను.

ఈధర్మరాజు యుద్ధమధ్యమున భీష్మునియొద్దకు బ్రచ్ఛన్నముగఁ బోయెను. ద్రోణాచార్యునివధకాలమున నన్నృత మాడెనను విషయము లుపోద్ఘాతమున జర్చించి పరిష్కరింపఁబడియున్నవి.

పదునెనిమిదవనాటి యుద్ధమునఁ గౌరవసేనాధిపతియగు శల్యుని నీధర్మరాజు హతునిగఁ జేసెను.

దుర్యోధనుఁడు డాగియున్నచోటి కరిగి యతనిని ద్వంద్వయుద్ధమునకుఁ బిలిచినపుడు తమయైదుగురిలో నొకని నెంచుకొను మనియు, నతని దుర్యోధనుఁడు జయించినచో రాజ్యమును విడుచుకొనియెద ననియు, నొకపందెము వైచెను. పాండవులయదృష్టముకొలఁది నాదుర్యోధనుఁడు భీము నెంచికొనుటయు నతనిచేఁ గూల్పఁబడుటయు జరిగెను. అట్లు పందెము వైచినందుకు శ్రీకృష్ణులవారు తిరుగ జూదమునే తెచ్చిపెట్టితివా యనియు, నిన్నుగాని నీపిన్నతమ్ము లిద్దరిలో నొకనినిగాని కోరినయెడల మీ రేమిచేయగల రనియు, దూలనాడిరి. భీమగదాహతుఁడై క్రిందఁబడియున్న యా

దుర్యోధనునకు ప్రాణములు విడుచునంతవరకు నుపచారములు చేయుటకు భృత్యుల నియమింపక యీధర్మరాజు పోవుట మంచిపని కాదు. అటుల చేయుటచేత నేకదా దుర్యోధనుని యొద్ద కశ్వత్థామాదులు వచ్చుటకు వీలు కలుగుటయు, తమ రాజుయొక్క దురవస్థనుఁ జూచి వార లతికోపోద్దీపితమానసు లగుటయు, నం దశ్వత్థామ పాండవులశిబిరమునఁ జొచ్చి నిద్రించుచున్న వీరుల ననేకులను జంపుటయుఁ గలిగెను.

యుద్ధానంతరమున ధర్మరాజు పట్టాభిషిక్తుఁ డయి యశ్వమేధాదిక్రతువులను జరిగించెను. వృద్ధులగు గాంధారీధృతరాష్ట్రుల నతిగౌరవానురాగములతో నాదరించెను. అభిమన్యునిపుత్రుఁడగు పరీక్షిత్తు పెద్దవాఁ డయినపిదప నాతనిని రాజ్యమున కభిషిక్తునిగఁ జేసి ధర్మరాజు గతించినసూర్యచంద్రవంశపురాజులమార్గము ననుసరించి తమ్ములతోను, ద్రౌపదితోను, నుత్తరాభిముఖుఁడయి యరిగెను. అచట వారలు లోకాంతరగతు లగువరకును గాలమును గడపిరి. అయితే ఒకవిధముగ వారలు లోకాంతరగతు లయి రని భారతము నందుఁ జెప్పఁబడి యున్నది. కాని వా రడవి కేగినపిదప నే విధముగ లోకాంతరగతు లైరో యెవరికి దెలియఁగలదు?

ఈయుధిష్ఠిరుఁడు ధర్మమునం దధికదృష్టి నుంచుటను బట్టి తాఁ ధర్మరాజని పిలువఁబడెను. ధర్మయుక్తముగ బాలింపనివాఁడు

రా జగునా? అయితే రాజులకు మించినధర్మమును గొన్నిసమయములలో గనఁబరచినందున ధర్మరా జనెడుపేరును బొందెను.

## 5. భీముఁడు.

ఇతఁడు పాండుమహారాజు రెండవకుమారుఁడు. ఆకాలపువారిలో నధికతమమైన బలము గలవాఁ డగుటచేఁ బంచభూతములలో మహాబలుఁ డను పేరుగల వాయువునకు బుత్రుఁ డని తలంచిరి. బలవంతుఁ డగుటచేతనే బాల్యమున దుష్టప్రవర్తనలు గల కురుకుమారుల నాటలయందు శ్రమపరచుచునుండెను. అదిమొదలుగ నితనియందు గౌరవులకు ద్వేష మభివృద్ధి నొందుచు వచ్చెను.

లక్కయిండ్లనుండి తప్పించుకొనిపోవునపు డీభీముఁడు జననీసోదరులను నిండుగ గాపాడెను. రాజసూయయాగమునకు ముందు తనయన్న పనుపున నీతఁడు తూర్పుదిక్కునకేగి యాదేశములను జయించెను.

ద్రౌపదీవస్త్రాపహరణసమయమున భీముఁడు వస్త్రము లొలిచినందుకు రణమున దుశ్శాసనునియురమునుజీల్చి హృదయరక్తపానమును జేసెద ననియును, ద్రౌపదిని దనతొడమీఁద గూర్చుండు మని సంజ్ఞ చేసినందుకు దుర్యోధనుని తొడలు విరుగఁ బడవైచెద ననియుఁ, బ్రతిజ్ఞ చేసెను.

దక్షిణగో గ్రహణ సమయమున సుశర్మ విరటరాజును బట్టుకొనిపోవుచుండఁగ నీభీముఁ డరిగి యతనిని విడిపించి సుశర్మను బట్టి కట్టితెచ్చి తనయన్న కొప్పగించెను. ఆధర్మరాజు ఘోషయాత్రయందు దుర్యోధనుని విడిపించినరీతి నీసుశర్మను విడిపించి పంపివేసెను. యుద్ధమునకంటె బూర్వ మప్పుడప్పుడు హిడింబ బక జరాసంధ కిమ్మీర జటాసుర కీచకాది మహావీరుల నీభీముఁడు సంహరించెను.

భారతయుద్ధమునం దీభీముఁడు సైంధవవధనాఁడు ధర్మరాజుపనుపున నర్జునునకు సహాయుఁడుగ నరుగుచు ద్రోణునిచే నడ్డగింపఁబడెను. అప్పు డతనిని లక్ష్యపెట్టక భీముఁడు రథముఁ డిగ్గి ద్రోణునిరథముయొక్క నొగలనుఁ బట్టుకొని తనభుజశక్తిచేఁ ద్రిప్పి పడద్రోసెను. అప్పుడు ద్రోణుఁడు రథమునుండి క్రిందికి దుమికి తప్పించుకొనెను.

కర్ణుని రెండవనాఁటియుద్ధమున భీముఁ డతనిని మూర్ఛితునిగాఁ జేసి గతప్రాణునిగాఁ దలఁచి సభయందు దులువమాటలాడినందుకు నాలుక గోయ సమకట్టఁగా సారథియగు శల్యుఁడిది మూర్ఛకాని చావుకా దనియు, నిపుడు నాలుకఁ గోసిన మొదలఁ జచ్చుననియు, నట్లు నీచేఁ జంపఁబడినచో నీకర్ణుని జంపుదు నని చేసియున్న యర్జునునిప్రతిజ్ఞకు భంగము గలుగునని యుక్తి నేర్పుతో జెప్పఁగాఁ గ్రోధావిష్టమానసుఁడై యుండియు

నాలుక గోయక మరలెను. శల్యుఁడును గర్ణుని నావిధముగఁ గాపాడెను. నాటిదినముననే దుశ్శాసనుని గ్రిందఁ బడవైచి భీముఁ డతనివక్షస్థ్సలమునుఁ జీల్చి హృదయరక్తమునుఁ ద్రాగి ప్రతిజ్ఞ నెరవేర్చుకొనెను.

పదునెనిమిదవనాఁడు దుర్యోధనుని గదాయుద్ధములో దొడలు విరుగగొట్టి రెండవప్రతిజ్ఞను నెరవేర్చుకొనెను. అయితే అట్లు క్రిందఁబడియున్న రారాజుతలను రెండుమారులు తన్నెను. అది సరికా దని భీముని ధర్మరాజు తూలనాడెను. సౌప్తికవధానంతరమున నశ్వత్థామను బట్టుటకు ద్రౌపదిపను పున నేగెను. ఆపయిని జరిగినకథ యశ్వత్థామచరిత్రమున వ్రాయఁబడియున్నది. పాండవులలోనే కాక పాండవసేనలోఁ గూడ నింతధైర్యశాలి యభిమన్యుఁడు తప్ప మరియెవ్వఁడును లేఁడు.

## ౬. అర్జునుఁడు.

ఇతఁడు పాండుమహారాజునకు మూఁడవకుమారుఁడు. శ్రీకృష్ణులవారిసఖుఁడు. ద్రోణాచార్యునియొద్ద నస్త్రవిద్య నభ్యసించినవారిలో నధికుఁడు. కావున నతనికి ముఖ్యశిష్యుఁడు. దేవతలందరిలో నింద్రుఁ డెట్టు లధికుఁడో యటుల నప్పటి కాలపుప్రసిద్ధవీరులలో నితఁ డధికుఁడుగావున నింద్రాంశ సంభూతుఁ డని యెన్నిరి. గురువునాజ్ఞచొప్పున ద్రుపదపురమున

కేగి యితరశిష్యులకు సాధ్యముకానియప్పు డీయర్జునుఁ డా ద్రుపదునిఁ బట్టి తెచ్చి గురువునకు దక్షిణగా సమర్పించెను.

ద్రౌపదీస్వయంవరమునకుఁ బోవునపు డంగారపర్ణుఁ డనుగంధర్వుని యుద్ధమున నోడించెను. ఆపిదప ద్రుపదపుర మునకు జేరి రాజమండలము చూచుచుండఁగా వారి కసాధ్య మయిన మత్స్యయంత్రమునుఁ గొట్టి ద్రౌపదిని వీర్యశుల్కగాఁ బడసెను. అప్పుడు తనపయి యుద్ధమునకు వచ్చిన కర్ణశల్యాది వీరులను భీమసహాయుఁడై జయించెను. ముందా సభలోఁ గూరుచుండునపుడు బ్రాహ్మణవేషధారులగు నీపాండవులను శ్రీకృష్ణులవారు మాత్రము గురుతుపట్టి బలరాములవారికిఁ దెలియఁజేసిరి. తక్కినవారు వీరి నెఱుఁగరు. అటుల దెచ్చిన ద్రౌపదిని దల్లిమాటనుబట్టి నలుగురుసోదరులతో వివాహ మాడెను. ఇట్లు వివాహ మాడి కొంతకాల ముండినపిదప దీర్థ యాత్రలకుగా నర్జునుఁడు బయలుదేరి ముందుగ గంగాద్వార మున కేగి నాగు లనుతెగవారి రాజపుత్రికయగు నులూచిని వివాహ మయ్యెను. అచటనుండి దివ్యనదులలో స్నానము చేయుచుఁ గ్రమముగ బదరీనారాయణము, గయ, శ్రీజగన్నా థము, భీమేశ్వరము, శ్రీశైలము, కావేరీసాగరసంగమము సేవించి మణిపూరపురముఁ జేరెను. ఈపట్టణము మలయాళ దేశములోనిదై యున్నది. అచటి రాజకుమార్తెయగు చిత్రాం

గదనువివాహమయి గోకర్ణప్రభాసతీర్థములను సేవించి యతి వేషమున ద్వారకానగరముఁ జేరి యచట శ్రీకృష్ణులవారి యనుమతిని సుభద్రను బరిగ్రహించి, స్వస్థానమగు నింద్ర ప్రస్థపురముఁ జేరెను. అటుతరువాత ఖాండవదహనపుగథ కలదు. చదువరులు సంగతి సందర్భములను బాగుగ నాలోచించినచో నీకథ కర్ణునిచే నర్జునునిమీఁద వేయఁబడిన సర్ప ముఖశరముయొక్క మహిమకొరకు గల్పింపఁబడిన దని తోఁపక మానదు. సర్వభక్షకుఁ డగు నగ్ని కజీర్ణ మెట్లు కలుగును? అర్జునుఁ డతితీవ్రముగాఁ బాణము వేయఁగలిగియుండినను, నా బాణముల నాధారము లేని యంతరిక్షమున నెట్లు పందిరివలె నిలిపెను? ఇంద్రునకు భూలోకమునం దీవన ముండుటకుఁ బ్రయోజనమేమి? ఇట్టిం క ననేకముగా నసందర్భములు గలవు.

రాజసూయయాగపుసభను మయుఁ డనువాఁడు చిత్ర తరముగ నిర్మించె ననియు, నర్జునుఁడు ముం దెప్పుడో యితనితో సఖ్యము చేసికొనె ననియుఁ గలదు. ఇందుకు నొకగాథయు నద్భుతమైన సభావర్ణనమును గల్పింపఁబడి యున్నది. మరి యేమియై యుండు ననినః— దక్షిణదేశవాసియైన మయునితో నర్జునుఁడు తీర్థయాత్ర కేగినపుడు సఖ్యము చేసియుండవచ్చును. అయితే అతఁడు రాక్షసుఁడుగాఁడు. తంజావూరుసమీపమున నుండుపట్టణమునం దుండువాఁడై యుండును. ఇప్పటికిని నాప్రాం

తము వారు కాకిబంగారము, ముచ్చ రేకు మొదలగువానితో నద్భుతముగ బందిళ్లు వేయుట కలదు. నల్లగా నుండుటను బట్టి యతనిని రాక్షసుఁ డని తలంచిరి.

ధర్మరాజు రాజసూయయాగము చేయుటకుముందీ యర్జు నుఁ డుత్తరదిక్కునకుఁ బోయి జయించి వచ్చెను. రెండవ జూదము ననంతరమున నరణ్యమునకుఁ బోవునపుడు యుద్ధ మున గర్ణాదిదుర్జనులను జంపుదు నని ప్రతిజ్ఞ చేసెను.

అరణ్యవాసమునం దీయర్జునుఁడు శివునికొరకు దపస్సు చేసి యతనితో యుద్ధము చేసి మెప్పించి యతనివలన బాశు పతాస్త్రలాభమును బొందెను. ఆపయి నితరదిక్పాలకుల వలన మఱికొన్ని యస్త్రములనుఁ బడసెను. ఆపిమ్మట నింద్ర లోకమున కేగి యచట నివాతకవచులను సంహరించె ననుగథ గలదు. ఆవిషయ ముపోద్ఘాతమునఁ జర్చించి పరిష్కరింపఁబడి యున్నది.

దక్షిణగోగ్రహణనివారణార్థము విరటరాజుతోఁ దన సోదరులు నలుగురు నేగినపిమ్మట నుత్తరమం దున్నగోవులరక్ష ణముకొరకు నీయర్జునుఁ డుత్తరునకు సారథిగా నుండి యేగి కురుసేనను జూచి జడిసినయుత్తరుని దిట్ట దీర్చి తనకు సారథి గాఁ జేసికొని కౌరవులతో యుద్ధముచేసి గోవులను మరల్చెను. ప్రభువుయొక్కగాని తనయన్నయొక్కగాని యాజ్ఞ లేకుండగనే

యిటుల తనరూపమును బయలుపరచుట జూడఁగా నీయర్జునుఁ డజ్ఞాతవాసకాలపూర్తిని౯ దెలిసికొనియె యిట్లు చేసినట్లు స్పష్ట పడును.

సేనోద్యోగసమయమున నీయర్జునుఁడును దుర్యోధనుఁ డును నించుమించుగ నేకకాలమున ద్వారకకు బోయి శ్రీ కృష్ణులవారిసాయము నిరుపక్షముల వారును గోరిరి. అపుడు శ్రీస్వామివారు నారాయణగోపాలురను పదివేల రథికులను యుద్ధసాహాయ్యముకొరకొకవంతుగను, యుద్ధము చేయక యొకపక్షమున మేలు గోరుచు దా నుండుట యొకవంతుగను నేర్పరచి వంతులను గోరుకొనుటలో జిన్నవాఁడు ముందుగ గోరుకొనుట యాచారము గాన నర్జునుని ముందుగ గోరు కొను మని సెల విచ్చిరి. ఈయర్జునుఁడు శ్రీస్వామివారినే కోరుకొనెను. యుద్ధముచేయని యీస్వామికంటె బదివేవురు రథికులు దనకు దొరికి రని మెచ్చుకొని దుర్యోధనుఁడు సంత సించి వెడలెను. అపుడు శ్రీస్వామివారు యుద్ధముచేయని న న్నేల నీవు కోరికొంటి వని యర్జును నడుగఁగా నతఁ డీక్రింది విధమున మనవిచేసికొనెను:—

క॥ అనుటయు నాతఁడు హరి కి
ట్లను నేను రణంబునకు నహాయత యొల్లక

వినుసుప్రసిద్ధుఁడవు నీ
వని సేసినపేరు నీక యగు నెప్పాటన్.

వ. నీ కెదురై జయంబు గొనరాదు. అట్లగుటం జేసి విజయ
మూలం బగు నీతోడును వలయు, నీవు సహరంబుసేయ
కునికియ ప్రియంబు. కావున నిన్నుం గోరికొంటి నని చెప్పి
మఱియు నిట్లనియె.

క. సారథ్యం బొనరింపు మ
పారకృపాలీల నెల్లభంగుల ననికిన్
గౌరవమున జిరకాలము
గోరిన యది దీని నిమ్ము గుణరత్ననిధీ."

అందుకు శ్రీస్వామివా రిట్లు సెల విచ్చిరి.

క. "అనిన గిరీటికి హరి యి
ట్లను నీదగుకోర్కి దీర్చు టది నాకు వ్రతం
బనఘాతగసారథ్యం
బొనరించెద నీకు ననమయుద్ధక్రీడన్."

ఫలములు కార్యాంతములయందు వారివారిప్రారబ్ధము
కొలఁది దటస్థపడినను విరోధులుగానుండి తనయొద్దకు సా
యముఁ గోరి వచ్చినయర్జునదుర్యోధనుల నీస్వామి సర్వసముఁడు
కావున నే యుభయులను సంతుష్టులగువారినిగఁ జేసి పంపెను.

ఉభయసేనలును గురుక్షేత్రము నందు గూడినపిదప నొకనాఁ డుభయబలములను జూచుకొనుటకు యుద్ధభూమి యందు నిలువఁబడియుండఁగా నర్జునుఁడు కౌరవసేనలోని సోదర సుత మాతులా చార్యాదులగు బంధు శిష్ట జనంబులం జూచి వారలఁ జంపుటకు మన సొప్పక నే నిట్టివారి నెటులఁ జం పుదు నని విషణ్ణుఁడయి శ్రీకృష్ణులవారితో మనవిచేయఁగా నపుడు శ్రీస్వామివారు భగవద్గీతల నుపదేశించిరి. ఈగీతలనుఁ బరమేశ్వరుఁ డొక్కఁ డని యొప్పిన యాస్తికమతస్థులందరును గొనియాడుచున్నారు. అందు మనత్రిమతస్థులు నైకకంఠ్యముగ బరమప్రమాణముగఁ దీసికొనియే యున్నారు. ఈగీతోపదేశము కేవలము యుద్ధారంభమునకు ముందుగ జరిగిన దని చదు వరులు చాలమంది పొరబాటుపడియున్నారు. అట్లు కాదు.

అ ట్లయినచో యుద్ధారంభసమయమున నాయుధముల విడిచి ధర్మరాజు పాదచారియై భీష్మద్రోణాదులకడ కేగి వారి యనుమతి నేల పొందవలెను? ఆదినము యుద్ధదినమే యయి యుండినచో వారియనుమతిలేక యుద్ధమునకు వచ్చినవాఁ డయియే యున్నాఁడు. వ్యూహములు తీర్చి సేనలు నిలువఁ బడియుండినపుడు యుద్ధమున కనుజ్ఞ నిచ్చిన యాభీష్మాదు లొక చోట నుండరుగదా? ఆమహాసేనయందు జెదరియున్న వారి యొద్దకు గౌరవతారతమ్యానుసారముగ బోవుట కెంతకాలము

పట్టును? ఇంతియకాక యిటుల ధర్మరాజు వారివారియనుజ్ఞను బొందివచ్చినపిదప యుద్ధము నారంభింపకముందు దుర్యోధనుఁడు ద్రోణాచార్యునియొద్దకు రథమును దోలించి యతనితో సేనావిషయమైన ప్రస్తావము జేసి యున్నాఁడు. అటుతరువాత నుగూడ నారంభము జరుగలేదు. అపయి నర్జునుఁడు తన రథము నుభయసేనలమధ్యమునకు దీసికొనిపోయి యుంచుమని శ్రీకృష్ణులవారిని గోరుటయు నపు డారథమువిూఁదనుండి ప్రతిపక్షసేనలోని కావలసినవారినిఁ జంపుట కర్జునుఁడు శంకితుఁ డగుటయు, నట్టివానికి శ్రీస్వామివారు భగవద్గీతల నుపదేశించుటయు జరిగెను.

ఇందుల కెంతయోకాలము పట్టియుండవలెను గదా? అదియే యుద్ధప్రారంభదివసమైనయెడల విూఁదవ్రాసిన విషయములు జరుగుట కవకాశ ముండునా? యోచింపుడు. అయితే మరియేమి యనిన యుద్ధారంభమునకు ముందొకనాఁ డుభయపక్షములవారును దమతమసేనలను రణభూమియందు నిలుపుకొని యుద్ధసంబంధమైన యవకాశములను సుళువులను దూరములను జూచుకొన్నట్లు స్పష్టపడుచున్నది.

శ్రీకృష్ణులవారికిని, బాండవసేనకుబ్రభువగు యుధిష్ఠిరునకును గలుగని యీశంక తనవారినిఁ జంపుటకయి యర్జునున కేల గలిగినదో కొంచెము విచారింతము. శ్రీకృష్ణులవారు

సర్వేశ్వరుఁడును, సృష్టికర్తయును, సర్వజ్ఞుఁడును గావున నేయే కార్యములను నీజన్మయందుఁగాని గతజన్మలయందుఁగాని చేసిన వారి కేయేఫలములు గలుగునో యది యెరుగుదురు. అట్టికార్యాకార్యములఫలముల కొకచట్టము నేర్పరచి మనుజునకు స్వాతంత్ర్యము నిచ్చి సృష్టిచేసి యున్నారు. కావున వారి కేశంకయు గలుగుటకుఁ గారణము లేదు. సర్వజ్ఞుఁడు కాబట్టియే భీష్మాదులు చచ్చుటకు సిద్ధముగ నున్నారు నీవు నిమిత్తమాత్ర మని చెప్పి యర్జునునకు మనఃకల్మషమునుఁ బోఁగొట్టిరి. ఇఁక ధర్మరాజువిషయము చూతము. ఇతఁడు ప్రతిజ్ఞను నెరవేర్చి తనరాజ్యభాగమును ధర్మయుక్తముగఁ గోరి యుద్ధము చేయ సమకట్టి యున్నాఁడు. ఇందుకుగా ననేకవీరులను రప్పించి యున్నాఁడు. మరియు నుభయసేనలలో నెవ్వరివలన నెవ్వరు మడియుదురో తనకుఁ దెలియదు. అట్టివాని కీశంక గలుగుటకు గారణము లేదు. అర్జునుఁడు శ్రీస్వామివారివలె సర్వజ్ఞుఁడు గాఁడు. అయినను జ్ఞానము వివేకము గలవాఁడు. ఆకౌరవసేనలోని వీరులను జూచినపుడు భీష్మాదులనుఁ జంపుటకు దనకంటె మరియొకఁడు తమసేనలో లేఁడని యెరుగును. అట్టివారలను జంపుటకుఁ గొంత సందేహించియుండిన నుండును. సమర్థుఁ డయినవాఁడే కార్యప్రారంభమునందు గీడుమేళ్లను గమనించుట సహజమైనపనియై యున్నది కదా?

తనమీఁద నెదిరించి యుద్ధము చేయని భీష్మునితో నత నికి బరమశత్రువగు శిఖండిప్రక్కనుండి యుద్ధము చేసి కురు సేనాధిపతియగు నాభీష్ముని నేలం గూల్చెను. సైంధవవధనాఁడు కురుసేన నొంటరిగ జొచ్చి చాలసేనను జంపి చివరకు సైంధ వుని తలఁ దునిమి ప్రతిజ్ఞను దీర్చికొనెను. పదునేఁడవదినమున నప్పటికురుసేనాధిపతియగు గర్ణునితోఁ ద్వంద్వయుద్ధము చేసి యుభయసేనలవారును మెచ్చుకొనునటు లతనిఁ జంపి శిబిర మునం దున్నధర్మరాజుకడ కేగి యతనిని సంతుష్టాంతరంగుని జేసెను.

యుద్ధానంతరమున నశ్వత్థామ నోడించుటయు నతని శిరోమణినిఁ దెచ్చి ద్రౌపది కిచ్చుటయు నిదివరకే వ్రాయఁబడి యున్నది.

అనంతరము ధర్మరాజుచేఁ జరుపఁబడిన యశ్వమేధయాగ మునకుగా నశ్వము వెంటఁ దిరిగి నలుదిక్కులు జయించివచ్చెను.

ఈ యర్జునుఁడు తనపౌత్రుఁడగు పరీక్షిత్తుయొక్క పట్టాభిషేకానంతరము తనయన్నతోఁ గలిసి యడవి కేగి యచట గాలముఁ గడపుచుఁ బరలోకప్రాప్తి నొందెను.

### ౭. నకులుఁడు.

ఇతఁడు పాండుమహారాజు నాలుగవకుమారుఁడు. అతని రెండవభార్యయగు మాద్రీదేవికిం బొలిపట్టి. ఆదేవి చాల

యందకత్తె గావున నితఁడును నితనితమ్ముఁడగు సహదేవుఁడును మిగుల సౌందర్యముగలవారు. ఈనకులున కశ్వశిక్షయందును రక్షణవిద్యయందును గడునేర్పు గలదు. ఈవిద్యవలననే యజ్ఞాతవాసమున దననుఁ దాచికొనెను. ఈతఁడు యుద్ధమునందు గర్ణునికొడుకులగు, సత్యసేన చిత్రసేన సుశర్మ లనువారినిఁ జంపెను. ధర్మరాజు రాజసూయయాగముఁ జేయునపుడు పశ్చిమదిక్కున కేగి యాదేశపురాజులనుఁ జయించెను. చివరకు ధర్మరాజుతోఁగూడ నడవికిఁ జని క్రమముగ గాలము గడపుచుఁ బరలోకము నొందెను.

## ౮. సహదేవుఁడు.

ఇతఁడు పాండుమహారాజు కనిష్ఠపుత్రుఁడు. నకులునివలె సౌందర్యముగలవాఁడు. నీతిమంతుఁడు. ధర్మాధర్మముల నెఱిఁగినవాఁడు. గోరక్షణవిద్యయందు నేర్పరి. ఆవిద్యవలననే యజ్ఞాతవాసమున గాలమును గడపెను. రాజసూయయాగమునకుముందు దక్షిణదిక్కున కరిగి యాదేశపురాజులను గెలిచి ధనముం గొని తెచ్చెను.

రాజసూయానంతరమున నగ్రపూజ కెవ్వఁ డర్హుఁడో యని చూచుతరి భీష్ముఁడు " స్నాతకుఁడును, ఋత్విజుఁడును, సద్గురుఁడును, ఇష్టుఁడును, భూతలేశుఁడును, సంయతుండును

నను వీరు పూజనీయులు. వీరిలో నెవ్వఁడు సద్గుణము లెక్కుడుగ గలవాఁడో యట్టివానిఁ బూజింపు" మని చెప్పుచు.

సీ. " కోదసీకుహరంబు రుచిరాంశుతతిఁ జేసి
యర్కుఁడు వెలిఁగించు నట్టులమృత
సందోహనిష్యందచంద్రికఁ జేసిశీ
తాంశుఁ డానందించునట్లు సకల
జనులకుఁ దనదైన సదమల ద్యుతిఁ జేసి
తనరంగ తేజంబు తనకుఁ దాన
చేయుచునున్న సత్సేవ్యుండు పుండరీ
కాక్షుండు కృష్ణుఁడనాదిని ధనుఁ
డబ్జనాభుఁడుండ నర్ఘ్యంబునకు నిందు
నర్హు లొరులు గలరె యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు నచ్యుతుఁ బూజింపు
మధిప యదియ చూవె యజ్ఞఫలము."

ఇట్లు లనినపిదప సహదేవునిచే దీసికొని రాఁబడినయర్ఘ్య మును ధర్మరాజు శ్రీస్వామివారికి సమర్పించెను. ఆపయిని శిశుపాలుఁ డనువాఁ డగ్రపూజకు శ్రీస్వామివా రర్హులు కా రని విచ్చలవిడిగ నాక్షేపింపఁగా భీష్ముఁడు శిశుపాలునితో ని ట్లనెను:—

చ.॥ "అవినయబుద్ధివై హరికి నర్ఘ్యమయోగ్యమయంటి వీవు మా
ర్ఖవు శిశుపాల యింకఁ బలుకకవలయున్ సభలోన నున్న యీ
యవనిపు లెల్లనాతని దయం బరిముక్తులు వానిచేత నా
హవజితులుం దదీయశరణార్థులుగా కొరులయ్య చెప్పుమా.

తే. గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నా నుండు నేని
బాలుఁ డయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్రియుఁడు పూజ్యుఁ డమితవిక్రమసమృద్ధి
నుర్విపతులలో నధికుఁడై యుండెనేని.

క. ఈ రెండు కారణముల ము
రారాతియ యర్ఘ్యమునకు నర్హుఁడు జగదా
ధారుండు మాకకాదు స
దారాధ్యుఁడు విష్టపత్రయావాసులకున్.

క. వృద్ధు లొకలక్ష యున్నను
బుద్ధియె యెవ్వరికి వారి బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్.

క. పూజితులు తృప్తు లగుదురు
భూజను లొరు లచ్యుతుండు పూజితుఁ డగుడున్.
దేజమున జగత్త్రితయము
బూజితమయి తృప్తిఁ బొందు బుణ్యసమృద్ధిన్."

అపిదప నీ క్రిందివిధమున సహదేవుఁడు సభవారిం గూర్చి పలికెను :—

శ్లో॥ “ కేశవం కేశిహంతార మప్రమేయపరాక్రమం।
పూజ్యమానంమయాయోవః కృష్ణంనసహతేన్నృపః।
సర్వేషాంబలినాంమూర్ధ్ని మయేదంనిహితంపదం।
ఏవముక్తేమయాసమ్య గుత్తరంప్రబ్రవీతుసః।
మతిమంతశ్చయే కేచిదాచార్యంపితరంగురుం।
అర్చ్యమర్చితమర్ఘ్యార్హ మనుజానంతుతేన్నృపాః॥ ”

అనఁగా అపరిమితపరాక్రమసంపన్నుఁడయిన శ్రీకృష్ణుని ధర్మరాజు ననుమతిచే నేను బూజింపుచుండఁగా మీలో నే రాజు సహింపఁడో యట్టిబలవంతులగు నందరితలలమీఁదను నే నీపాదము మోపుచున్నాను. ఇట్లు నేఁ బలుకుచుండ నట్టియగ్రపూజను సహింపనియారా జుత్తరము చెప్పునుగాత.

ఈసభయందు బుద్ధిమంతులయిన యేరాజులు కలరో వారు ఆచార్యుఁడును, తండ్రియును, గురువును, పూజార్హుఁడును నగు నీ శ్రీకృష్ణులవారిని బూజించుటకొరకంగీకరింతురుగాక ! ”

అప్పు డతనిమీఁద బుష్పవృష్టిఁ గురిసెను. మునులు మెచ్చుకొనిరి.

శ్రీకృష్ణులవారు పూజార్హు లని చెప్పినయుభయులలో భీష్మునిమీఁద బుష్పవృష్టి యేల కురియలేదు? మును లతని నేల మెచ్చలేదో చూతము. వీ రుభయులును శ్రీస్వామివారిని దైవముగాని, మనుష్యమాత్రుఁడుగాఁ డని యెరుగుటలో సములే అయితే యాభగవంతునియందు సాధ్యభక్తిగలవాఁడు భీష్ముఁడు కరణత్రయప్రపత్తియే కాక తాత్కాలికపూర్ణప్రపత్తి గలవాఁడు సహదేవుఁడు. అందువలన నితఁ డధికుఁ డాయెను.

శ్రీకృష్ణులవారు రాయభారమున కరుగునపుడు తననలు గురుసోదరులు చెప్పినపిదప నీసహదేవుఁడు వారితో " ఈధర్మ రాజును దక్కినసోదరులును సంధి పొసఁగునని యాసతోఁ బలికిరి. మీరును మారు చెప్పకయుండుట చిత్రము. అహా? వీరిప్రార్థనాప్రకారము మీరు పోయినను సుయోధనుఁ డేమి? భూమిలో సగపా లిచ్చు టేమి? ఎప్పటికైన జరుగునా? ఇట్టి దైన్యమునకు వీరులగు మావారు లోబడవలయునా? పయి రాజు లీదీనతను మెత్తురా? బంధువులును మిత్రులును నిందిం పరా? ఇది యేమిపని? ధర్మరాజు వేడుకొను టేమి? శ్రీకృష్ణుల వారడుగబోవుట యేమి? బహుబాగుగ నున్నది. ఎప్పటికైనఁ ధృతరాష్ట్రపుత్రులు రాజ్యభాగము నిత్తురా? వీరికోరిన ప్రకారము వా రొప్పినను నాసంధి యెంతకాలము నిలుచును? యుద్ధమే తప్పక జరగవలసినది. నేను వంకమాట లాడ లేను.

యుద్ధము తప్పక జరగునని కౌరవసభలో నేను జెప్పినటుల చెప్పుము" అని పలికెను. కపటద్యూత మాడి తమ్ము నోడించినశకునిని యుద్ధమునందు జంపెను. తుదను దనయన్నలతోఁ గలిసి మహాప్రస్థానము చేసి పరలోకగతుఁ డాయెను.

## ౫. ద్రౌపది.

ఈయమ ద్రుపదమహారాజు ముద్దులపట్టి. కుంతీదేవి వచనమువలన పాండవు లైదుగురికిని భార్య యయ్యెను. కౌరవసభయందు దనవస్త్రాపహరణసమయమున భర్త లుండియు దా ననాథురాలివలె నయినందున ద్వారకలో నుండు శ్రీకృష్ణులవారినిఁ బ్రార్థింపఁగా నాతనిమహిమవలన విప్పఁబడినవస్త్రమునకు బ్రతివస్త్ర మమర్పఁ బడుచు వచ్చెను. ఈ యద్భుతకార్యమునకు సభ్యు లచ్చెరువంది యామెకు మానభంగము కానందుకు సంతసించిరి. అరణ్యవాసమున నీమె పాండవులకును వారిపరివారమునకును భోజనాదికృత్యములు జరుపుటలో నతిజాగ్రత్తగ గనిపెట్టుచుండెను. శ్రీకృష్ణులవారు సత్యభామాసమేతులయి యరణ్యమునందున్న పాండవులను జూచుటకు వచ్చినపుడు సత్యభామకును ద్రౌపదికిని జరిగిన సంవాదము స్త్రీలు ముఖ్యముగ దెలిసికొనవలసినవిషయ మయినందున యథామాతృకముగ నీక్రిందఁ బొందుపరుపఁ [illegible]

సీ. "నీ ప్రియభర్తల నిర్మలవృత్తులఁ
ప్రకటతేజుల లోకపాలనిభులఁ
బార్థుల నీవ్రేకభంగిన వదలక
చెలువ మెబ్బంగి భజింతు దగిలి
యొక్కఁ డొక్కనికంటె నువిదనీకేపురు
ననురక్తు లగుట యత్యద్భుతంబు
నగుమొగంబులకాని నాతి నీదెస నెప్డు
బతులకు గిన్క యొప్పాట లేదు
వ్రతము పెంపొ మంత్రౌషధవైభవంబొ
సరస నేపథ్యకర్మకౌశలమొ చతుర
విభ్రమోల్లాసరేఖయొ వెలది నీవి
శేషసౌభాగ్యహేతువు చెపుమనాకు.

క. ఏనును నీవలన నిజము
గా నిదియంతయును నెఱిఁగి కమలదళాక్షుఁ
బూని వశగతునిఁ జేసి య
నూనస్నేహానుభోగయుక్తిఁ దలిర్తున్.

క. అని యడిగిన మది నించుక
గినుక వొడమ నడచుకొనుచు గృష్ణ మృదుల

సిని యగుచు గృష్ణభామిని
గనుఁగొని యి ట్లనియె నిర్వికారాకృతియై.

క. నను నిట్లు దుష్టవనితా
జనము నటులుగా దలంపఁ జనునే నీకున్
మన సొప్పదు పురుషోత్తము
వనితవుగా దగవు నీవు వనరుహనయనా?

అని మేలంపుఁజందంబున దాని వివేకహీనత యెఱుక
పడ నాడి పాంచాలి మఱియు ని ట్లనియె.

చ. అలయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁ జేసియెంతయున్
వలతురు నాథు లంట మగువా కడు బేలతనంబు దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁ గాని యొకం డనుసిద్ధిఁ బొందద
ప్పొలతులతోడి మన్కియహిఁ బొత్తుగ జూచు విభుం డెఱింగినన్.

చ. మగువయొనర్చు నశ్యవిధి మందులు మాయలు నొందు చందమై
మగనికిఁ దెచ్చు రోగములు మానక మూకజడాదిభావముల్
మొగినొనరించు నద్దురితముల్ తన చేసిన చేతలై తుదిన్
జగమున కెక్కునింద యును సద్గతిహానియు వచ్చు నింతికిన్.

క. కావున నెప్పుడు మగనికి
గావింపం దగదు కపటకర్మంబులు ద

ద్భావ మెఱిఁగి వశవర్తిని
వై వనిత చరింప నదియ యగు నెల్లవియున్.

వ. పాండవులయెడ నే నెట్టిదాన నై యిట్టిసౌభాగ్యంబు నందితి నెఱిఁగించెద నేర్పడ వినుము.

సీ. పతులాత్మ నొండొకపడఁతుల గలిసిన
నలుగ నెయ్యెడల నహంకరింప
మదము ప్రమాదంబు మాని వారికి జిత్త
మేకముఖంబుగ నెల్లప్రొద్దు
భక్తి సేయుదుఁ జూపుఁ బలుకులుఁ గోర్కియుఁ
జెయ్వులు వింతగాఁ జేయ నెపుడు
నమర గంధర్వయక్షాదులం దైనను
బురుషు నన్యునిఁ దృణంబుగ దలంతు
స్నానభోజనశయనాది సంప్రయోగ
మర్థిఁ బతులకు నెందు ము న్నాచరింపఁ
బతులు వచ్చిన నాసనపాద్యవిధుల
భక్తితో నేన కావింతుఁ బనుప నొరుల.

చ. తగియెడు వేళలందు నియతంబుగ మజ్జనభోజనక్రియల్
దగ నొడఁగూర్తు భర్తలకు ధాన్యధనంబులు రిత్తమై వ్యయం
బగుటకు నోర్వ నెప్పుడు గృహస్థలభాండవిశోధనంబు లి
మ్ముగ నొక నాడు నేమఱఁ బ్రమోదము సల్పుదు బంధుకోటికిన్.

క. పలుమాఱుం దలవాకిట
మెలఁగుట యసతీజనైకమిత్రత కలహం
బుల కెలయుట నగుఁబలుకులఁ
బెలుచ నగుట నాకుఁగాని పేరివి మఱువా.

క. పతు లిచ్చు మెయిఁ బ్రవాస
స్థితులైనం బుష్పగంధదీప్తాభరణ
ప్రతతి ధరియింపఁ దద్గత
మతి నగుచుఁ దదాగమంబు మది గాంక్షింతుర్.

ఉ. అత్తకుభక్తిగల్గిమదినాయమసెప్పిననూడిక-జేటికా
వృత్తములాచరింతు గురువిప్రసురాతిథిపూజనంబుల
త్యుత్తమభక్తినేనతగనోపియొనర్తుఁ బ్రియంబు దాల్మియుఁ
మెత్తదనంబు సంతతముమేలుగఁదాల్తుసమస్తభంగులఁ.

క. కడుమృదువు లనుచుఁ దేకువ
సెడి యెపుడుఁ జరింప భరతసింహులు కోపం
బడరిన నాశీవిషముల
వడువునఁ గ్రూరులని వెఱపు వదలక కొలుతుర్.

అజ్ఞాతవాసమున నీమె సైరంధ్రీవేషమున గాలము గడ
పెను. తన్ను మోహించి పాతివ్రత్యభంగమును జేయఁ దలఁ
చిన విరటునిమఱదియగు సింహబలునివిషయము భీమునకెఱిం
గించి యతనిచే నతనిఁ జంపించెను.

శ్రీకృష్ణులవారు రాయభారమున కరుగునపుడు వారితోఁ బాండవులు వారువారు చెప్పవలసినవి చెప్పినపిదప నదివరకు ధర్మరాజు చెప్పినమాటలు తనకు హృదయతాపము గలిగింప గోపముతో నిట్లు పలికెను.

"మాకు ననేకము లగుకీడులు చేసి యడవికిఁ బోద్రోలి యిప్పుడు మాయందు ప్రేమ మున్నటుల సంజయునిఁ బంపఁగా నంతమాత్రమున కీధర్మరా జుప్పొంగెను. ఈపొంగు జూచి యన్నదమ్ములయందుఁ బ్రీతి గలిగి సుయోధనుఁ డైదూళ్లనైన నియ్యకపోవునా యని పాపము ధర్మరాజు నమ్మియున్నాఁడు. పూర్వము తనపడినపాటులను దలఁపక యీధర్మరాజు దుర్యోధనుని భ్రాతృవాత్సల్యముతోఁ జూచును గాఁబోలు? అది బాగా? రాజ్యభాగమునుఁ దీసికొననియెడల లోకులు నిందింపరా? చేతగానివారని యనరా? తమయాధిక్యమును బోఁ గొట్టుకొని యీవిధముగ లోఁబడి తక్కువమాట లేల యాడవలెను? నిజముగ నీసంధివలన గౌరవులకే మేలు. సోదరులని కనికరింతు రేమో కాని యుద్ధమునందు వారినిఁ జయించుట కింత కావలెనా? తప్పుచేసినపుడు మన్నించుటకు వారు బ్రాహ్మణులా? దుర్యోధనునకు సంకోచ మేమియు లేదు. నీవు చెప్పు తీపుమాటలకు దుర్యోధనునకు దురభిమానమే హెచ్చును. వారు యుద్ధముచేయుదు మన్నపు డీపాండవులు

నిలువఁబడి యుద్ధము చేయుదురో లేక యడవికిఁ బోయెదరో యేమి చెప్పఁగలను. నే నిటు లంటినని మీ రేమియు నను కొనవలదు. నీకును బాండవులకును గౌరవము చెడకుండ సంధికార్య మెటుల జరుగునో యటులఁ జేయుఁడు." అటు మీఁద దనవస్త్రాపహరణవిషయమునుఁ జెప్పకొనెను.

యుద్ధానంతరమున నశ్వత్థామ నిద్రాసమయమున దన యైదుగురుకుమారులను సోదరులను దక్కినపాండవవీరులతో పాటుగ గొంతులుగోసి చంపినందున నీమె శోకావేశముగలది యై యాఘాతుకునిమీఁదికి భీముని బంపుట మొదలగు విషయము లశ్వత్థామార్జునచరిత్రములలో వ్రాయఁబడి యున్నవి. తుద కీమె భర్తలతోఁ గలిసి యడవి కేగి స్వర్గస్థురా లయ్యెను.

## ౧౦. అభిమన్యుఁడు.

ఇతఁడు సుభద్రార్జునుల కుమారుఁడు. తనతండ్రివలన నస్త్రవిద్య నేర్చికొని యతనివలెఁ బ్రసిద్ధిలోనికి వచ్చుచుండెను. ఈతని యుద్ధపునేర్పునుఁ జూచి భీష్మాదులును మెచ్చుకొని యున్నారు. మరియు నితఁడు పాండవులందరకు బ్రియతముఁ డగు నందనుఁడు. విరటరాజుకూతురగు నుత్తరను వివాహ మయ్యెను. ఆమెయందు బరీక్షిన్మహారాజును గనెను. పదు మూడవనాఁటియుద్ధమున దనతండ్రియగు నర్జునుఁడు సంశప్త

కులతో ఘోరయుద్ధము జేయుచుండఁగా గౌరవులచే బన్నఁబడిన పద్మవ్యూహముఁ జొచ్చుటకు ధర్మరాజాదివీరుల కశక్యమయ్యెను. అప్పుడు ధర్మరాజుచే బ్రేరితుఁడై పదునాఱేండ్ల వయస్సున నొంటరిగా నావ్యూహమునుఁ జొచ్చి మధ్యభాగమున కరిగెను. అంతట నితఁ డర్జునునివంటివీరుఁడైనందుననే ద్రోణాదు లనేకులు చుట్టువారుకొని యధర్మయుద్ధమున విరథునిఁ జేసి ఖడ్గము తప్ప తదితరాయుధముల నెక్కొ-క్క-రు కొట్టి పారవైచిరి. అప్పు డితఁడు ఖడ్గహస్తుఁడై దుశ్శాసనునికుమారుఁడగు లక్ష్మణునితో శరీరమున బ్రాణములుండువరకు ద్వంద్వయుద్ధమునుఁ జేసెను. ఆపిదప నుభయవీరులు నేకకాలమున సమసిరి.

## ౧౧. సాత్యకి.

ఇతఁడు సత్యకుఁడను యాదవునికుమారుఁడు. శ్రీకృష్ణులవారికి జ్ఞాతివరుసను దమ్ముఁడు. అర్జునునియొద్ద ధనుర్విద్య నేర్చి యతనితో సముఁ డనిపించుకొనెను. యుద్ధమునందు పాండవుల పక్షమున నుండెను. శ్రీకృష్ణులవారు రాయభారమున కేగినపుడు దుర్యోధనాదులు వారినిఁ బంధింప బ్రయత్నింపఁగా సభలో నున్నవారలకు నేను జాలుదు నని యీసాత్యకి నిలువఁబడి యుండెను. పయినుండి వచ్చువారల నడ్డపరచుటకు గృతవర్మ యుండెను. యుద్ధమునం దితఁడు భూరిశ్రవుఁడు, సోమదత్తుడు, జలసంధుఁడు మొదలగురాజులనుఁ జంపెను.

~~[illegible]~~

~~[illegible]~~

## ౧౩. శ్రీకృష్ణులవారు.

పరమేశ్వరుఁడగు నారాయణుఁడు భూలోకమున దుష్టుల శిక్షించి తద్ద్వారా సజ్జనులను రక్షించుకొరకు మథురానగరమునఁ దేవకీవసుదేవులకుఁ గుమారుఁడయి జన్మించెను. దేవకీదేవి మథురానగరపురాజగు నుగ్రసేనుని తమ్మునికుమార్తె. ఆ యుగ్రసేనునికుమారుఁడగు కంసుఁడు మిగుల దుష్టప్రవర్తన గలవాఁడు. ఇతఁడు తండ్రిని బందీకృతునిగా జేసి రాజ్యమును స్వీకరించెను. తనపినతండ్రి కుమార్తెయగు దేవకిని నామె భర్తయగు వసుదేవునితోఁగూడ బందీకృతురాలినిగఁ జేసెను. అట్టిస్థితిలో శ్రీకృష్ణులవారు దేవకీదేవిగర్భమునఁ జన్మించిరి. సర్వశక్తిగల యాబాలుని యనుమతిప్రకారము తండ్రియగు వసుదేవుఁడాబిడ్డ నర్థరాత్రమునందు వ్రేపల్లెకుఁ దీసికొనిపోయి యందు నందునిభార్యయగు యశోదాదేవియొక్క ప్రక్కను రహస్యముగ నుంచి యామెప్రక్కలో నున్న యాఁడుబిడ్డ నెత్తుకొని వచ్చి తనభార్యప్రక్క నుంచెను. ఆమెకుఁ బుట్టిన మగశిశువులనందరినిఁ జంపుటకు నిశ్చయించుకొనియున్న కంసుఁడీపిల్లరోదనమునుఁ దెలిసికొనివచ్చి యాఁడుబిడ్డయైనను జంపుటకుఁ బ్రయత్నించెను. ఆబిడ్డ శక్తియంశము గలది యగుటచే

వధకు దొరకక తప్పించుకొనిపోయెను. అచట వ్రేపల్లెయందు యశోదాదేవి ప్రక్కలో నున్న శిశువును దనబిడ్డగానే భావించి పెంచుచుండెను. ఆ వ్రేపల్లెలో రోహిణీదేవికి బలరాముఁడు వీరికి ముందే జన్మించియుండెను. ఇట్లు వీరిరువురు బాలక్రీడలు సలుపుచు వ్రేపల్లెలో నుండుతరి గొన్ని దుర్నిమిత్తములు నాప దలు గలుగుచు వచ్చినందున నందాదు లాస్థలమును విడిచి కుటుంబపరివార సహితముగా బృందావనమునఁ బ్రవేశించిరి. అచ్చట రామకృష్ణులు గోవత్సములనుఁ దీసికొని గోపబాలుర తోఁ గలిసి వెళ్లిమేపుచు వచ్చుచుండిరి. అట్టిసమయములలో శ్రీకృష్ణులవారు వత్సాసుర బకాసుర అఘాసుర శంఖచూడ వృషభాసుర కేశి వ్యోమాసురు లనురాక్షసులనుఁ జంపిరి. బల భద్రుఁడును ధేనుకాసురుని ప్రలంబాసురుని సంహరించెను. పూతనా కాళియమర్దన గోపీవస్త్రాపహరణ రాసక్రీడాది విష యము లీక్రిందఁ బొందుపరుపఁబడిన శ్రీకృష్ణవిషయోపన్యాసము నందు జర్చించి పరిష్కరింపఁబడి యున్నవి.

బ్రహ్మదేవుఁడు భూలోకమునకు వచ్చి శ్రీస్వామివారి మహిమను దెలిసికొనుటకు గోవత్సములను దాచిన ట్లొకకథ గలదు. త్రిమూర్తులలో నొకఁడైనట్టియు శ్రీమన్నారాయణుని వలన సృజింపఁబడినట్టియు నీబ్రహ్మకు స్వామివారిమహిమను దెలిసికొనవలసినప్రసక్తి లేదు. కావున నీకథను గల్పితగాథగా

దీనికొనవలెను. అయితే గోవర్ధనోద్ధారణకథను నమ్మినను నమ్మవచ్చును. ఏల యనిన దిక్పాలకులలో నొకఁడగు నింద్రుఁడు తనకు బ్రజలు చేయుపూజ నాటంకపరచిన మనుజరూపముతో నున్న యీస్వామివారి నిజస్థితిని సాధారణముగ దెలియక కోపించి శిలావృష్టిని గురిపించియుండిన నుండవచ్చును. అప్పు డాసర్వశక్తి గోవర్ధనగిరి యెత్తి గోవులను గోపకులను రక్షించుట యాశ్చర్యమా?

ఇట్లు శ్రీరామకృష్ణులు బృందావనమున విహరింపుచు బాలురయ్యును దుష్టులను సంహరించుచుండుటను విని కంసుఁ డక్రూరుని బృందావనమునకుఁ బంపెను. అతనిపనుపున రామకృష్ణులు మధురానగరమునకుఁ బోవుచుండునపుడు శ్రీకృష్ణమూర్తి యక్రూరునకు నిజరూపమును జూపించెను. ఆ పిదప నన్నదమ్ములిద్దరును మధురానగరమున బ్రవేశించి కంసుని సభకు బోవుటకు ముందు కంసుని చాకలివానినిఁ జంపి వస్త్రంబులు గొనిరఁట. మరియు విల్లువిరిచి యాయుధశాల కావలివారిని జంపిరఁట. ఏమివింత? పీతాంబరధారి దుష్టుఁడగు కంసుఁడు కట్టెడివస్త్రములను గట్ట గోరునా? అందుకుగాను, పాపము చాకలవానినిఁ జంపునా? ఇపుడు స్వామివారు కంస సభలో నుచితాసనమునఁ గూర్చుండుటకు బోవుట లేదు. మల్ల యుద్ధము చేయువానికి విలువగలవస్త్రములతో బని యేమి?

మరియు నాయుధశాల కావలివారి నేల చంపవలెను? మల్ల యుద్ధమునం దాయుధములతో బని యేమి? కావున నీ రెండును గల్పితకథలు.

ఇట్లు కంససభకు బోయిన శ్రీకృష్ణులవారు తనమీఁదికి వచ్చిన కువలయాపీడమను మదగజమును జంపిరి. చాణూర ముష్టికులను మల్లురను శ్రీకృష్ణబలరాములు మల్లయుద్ధమున జంపిరి. అటుమీఁద శ్రీకృష్ణమూర్తివారు కంసుని, బలరామ స్వామివారు కంసునితమ్ములను వధించిరి. చెరలో నున్న తల్లి దండ్రులగు దేవకీవసుదేవులను నుగ్రసేనుని విడిపించి యతనికి బట్టముఁ గట్టిరి.

అచటనుండి బలరామకృష్ణులు కాశీపట్టణమున కేగి యచట సాందీపునియొద్ద విద్యల నభ్యసించి మధురానగరము జేరిరి. కొంతకాల మచట నుండఁగా గంసుని మామయగు జరాసంధుఁడు మధురాపురిని ముట్టడించి శ్రీరామకృష్ణులతోఁ బోరాడి యందు బలరామునిచే బట్టువడి శ్రీకృష్ణులవారిచేత పున విడువఁబడెను. అటుపిమ్మట నాజరాసంధుఁ డనేకపర్యాయములు మధురానగరమును ముట్టడించుటయు, శ్రీకృష్ణాదులా పట్టణమును విడిచి ద్వారకకు బోవుటయు సంభవించెను. జరాసంధునిబాధల కోర్వక తరువాత శ్రీబలరామకృష్ణులు మధురను విడిచి ద్వారకానగరమును స్వస్థానముగ జేసికొనిరి.

శిశుపాలున కిచ్చుటకు నిశ్చయింపఁబడిన భీష్మకమహారాజు పుత్రికయగు రుక్మిణీదేవి తనప్రేమను శ్రీకృష్ణులవారి కెఱింగింపఁగా నాస్వామివారు కుండినపట్టణమున కేగి శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని రాక్షసవివాహమునఁ గొనిపోయి ద్వారకానగరమున యథావిధిగ వివాహ మాడిరి. అటుమీఁద మరికొందరిని వివాహ మాడి రని యున్నది. ఆ విషయ మిందుతో జతపరుపఁబడిన శ్రీకృష్ణోపన్యాసమునందు గొంత చెప్పఁబడి యున్నది. ఆమీఁద శ్రీస్వామివారు మురాసురుని నరకాసురుని వధించిరి. అందు నరకాసురునియొద్దనున్న పదియారువేలమందికన్యలకు శ్రీకృష్ణులవారు భర్తయైనట్లు చెప్పఁబడి యున్నది. ఆవిషయ మిందుతో జతపరుపఁబడియున్న శ్రీకృష్ణవిషయోపన్యాసమున బరిష్కరింపఁబడి యున్నది. శ్రీకృష్ణులవారు బాణాసురుఁడను వాని నొకయుద్ధమునందు జయించిరి. అపుడు బాణునికి సహాయముగా వచ్చిన శివునితో శ్రీస్వామివారు యుద్ధము చేసి యతనిని జయించి యతనివలన బాణుని గాపాడుటకయి స్తుతి చేయఁబడినట్లు చెప్పఁబడియున్నది. భారతగ్రంథకర్త యెట్లు కౌరవపక్షపాతియో అట్లు భాగవతగ్రంథకర్త విష్ణుపక్షపాతియైనట్లు కానవచ్చును. కాని నిజముగ శ్రీకృష్ణులవారియాధిక్యమునే చెప్పువాఁడు గాఁడు. ఈవిషయము ముందు విచారింతము. అంతియ కాని

శివకేశవులు యుద్ధము చేయుదురా? అందు నొకరక్కసుని కొరకు యుద్ధము చేసి రఁట, ఏమిదింత? చదువరులే యీ విషయము విచారింపుఁడు.

పిమ్మట పౌండ్రక వాసుదేవుని శ్రీకృష్ణులవారు చంపిరి.

ఈమీఁద వ్రాసినకథయంతయు భాగవతదశమస్కంధములోనిదై యున్నది.

ఇంద్రప్రస్థపురంబున ధర్మరాజు రాజసూయయాగము జేయఁబూని శ్రీకృష్ణులవారిని రావించెను. అపుడు దిగ్విజయమునకు ముందు జరాసంధునిఁ జంపవలయు ననియు, నతఁ డితరరాజులతోఁ గలిసినయెడల నజేయుఁడై యుండు ననియు శ్రీస్వామివారు ధర్మరాజుతోఁ జెప్పఁగా నతఁడు శ్రీకృష్ణభీమార్జునులను జరాసంధవిజయముకొరకు బంపెను. వారిలో భీముఁడు ద్వంద్వయుద్ధమున నతని సంహరించెను. అపయిని ధర్మరాజు రాజసూయయాగము చేయునవసరమున నగ్రపూజను శ్రీకృష్ణులవారు గయికొని నోటికివచ్చినట్లు తమ్మును దిట్టిన శిశుపాలుని వధించి ద్వారకానగరమును జేరిరి. అపిదప సర్వజ్ఞులగు శ్రీకృష్ణులవారు కుదరనిరాయభారముకొరకు ధర్మరాజు పనుపున గౌరవులయొద్ద కేల యరిగిరో యోచింతము.

శ్రీస్వామివారు రాయభారమునకు బోవుచుం దర్జునునితో నిట్లు పలికిరి:—

శ్లో॥ “అహంహితత్కరిష్యామి పరంపురుషకారతః।
దైవంతునమయాశక్యం కర్మకర్తుంకథంచన॥”

అనఁగా పౌరుషమువలన మీకు జేయఁదగినహితమును జేయుదును. దైవము చేయుకర్మను నే నెట్లు చేయఁగలను? అని,

మరియు శ్రీస్వామివారు విదురునిచే నడుగఁబడి తమ రాకనుగూర్చి యిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:—

క. “ఎలుఁగుదు నేను సుయోధను
కొలఁగామియు నతనితోడఁ గూడినన్నృపులం
దలఁ బగ మనమున నిడికొని
యలుముటయును సంధి పొసఁగదనియు మహాత్మా.

ఆ. వె. పుడమియెల్ల నొడ్డగెడవయి గజవాజి
యుతముగా నడంగి యుగ్రమృత్యు
ముఖము సొరఁగ దివురుమూర్ఖత మాన్చుట
యధికమైనపుణ్య మనఘచరిత.

వ. మాన్చుపవచ్చునే యంటివేని.

క. దొరకొని పుణ్యముఁ బాపము
నరుఁ డర్థిం జేయుచుండ నడుమ నొకంటన్
వెర వెడలి తప్పినను ద
త్పరిణతి ఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్.

వ. అట్లుంగాక.

తే. గీ. చుట్టములలోన నెప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోఁడఁ బోరాడియైన
భూని యుడుపంగఁ జోరకున్న వానిఁ గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు.

వ. కావున నీరెండుదెఱంగులవారికి శాంతిఁ గావింపం బ్రయత్నంబు సేసెద. ధర్మార్థసంగతంబులైనమాటలు మంత్రిజనసహితుండైనసుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితంబయినవిధంబు వంచనలేక చెప్పెడు నన్నుఁ బాండవులవాఁడని శంకించి యతండు నామాట వినం డయ్యేనేనియు మేల కాకఁ యిట్లు సొచ్చి చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా యని యజ్ఞులైనజను లాడుదు రెల్లభంగులఁ గార్యం బొక్క లియ్యకోనం జెప్పుదు. ధార్తరాష్ట్రులుం దమకుఁ బ్రదుకుఁ దెరువైన నాపలుకులు వట్టుదురు. పట్టక నీతలంచినచందంబునం దులువలై కలంగఁబారిన వారు నాముందర నిలువంజాలు దురే" యని పలికి విదురుని సమ్మతింపం జేసిరి.

అర్జునునకు విదురునకు శ్రీస్వామివా రొసంగినయుత్తరములనుబట్టి విమర్శింపఁగా దైవ మె ట్లుండినను బౌరుషము

ముఖ్యమైనట్లును నాపురుషప్రయత్నము మంచిదైనపుడు జన్మ యందు గార్యకారి కాకపోయినను ముందుజన్మమున నైన నందలిఫలమును గలిగింపకపోదనియు గ్రహింపవలెను. అట్టిపౌరుషమును సర్వేశ్వరుఁడే చేయఁబూనినపుడు మనుజమాత్రుల కది యావశ్యకము గాకపోవునా? కొంద రవివేకులు దైవమే ప్రధానమని పౌరుషమును జేయక యాజన్మను వ్యర్థము జేయుట యేకాక చెడుదురు. ముక్తికిని పౌరుషమే క్రమక్రమముగా నభివృద్ధియగుసాధనమయి యుండఁగా దైవమే ప్రధానమనుట యెంతపిచ్చితనము?

ఇట్లు సంధివాక్యములను శ్రీస్వామివారు సభలోఁ గౌరవులకుఁ జెప్పి బోధపరుచుచుండఁగా నపుడు శ్రీస్వామివారినిఁ బట్టి కట్టుటకు దుర్యోధనాదిదుష్టచతుష్టయము యత్నించుట దెలిసికొని వారు తమవిశ్వరూపమును జూపించిన ట్లున్నది. ఈ విషయమును ముందు చర్చింతుము. అచ్చటినుండి వచ్చి శ్రీ స్వామివారు ధర్మరాజుతో సంధి పొసఁగలే దనియు యుద్ధము చేయక తప్ప దనియు సెల విచ్చిరి.

యుద్ధభూమియందు బితృపితామహాచార్య భ్రాతృపుత్ర మిత్రాదులను జూచి వారినిఁ జంపుటకు శంకితుఁడై యున్న యర్జునునకు శ్రీస్వామివారు భగవద్గీతలను బోధించిరి. అందుల సంగ్రహము :—

ఓయర్జునా! నీ విపుడు జ్ఞానులు చెప్పుమాటలను జెప్పుచు దుఃఖింపఁదగనివారిని గూర్చి దుఃఖించుచున్నావు. జ్ఞానులగు వారు చచ్చినవారినిగూర్చిగాని జీవించియున్నవారినిగూర్చి గాని విచారింపరు.

నేనును నీవును నిచ్చట గనిపించుచున్న యీరాజులును బూర్వము లేనివారము కాము. శరీరములు పోయినను నాత్మలు నిత్యమైనందున ముందుగూడ నుందువారమే.

ప్రతివారికిని దమశరీరములయందు బాల్యము, యౌవనము, వార్ధకము, నను నవస్థ లెట్లు మారుచున్నవో యటులనే యీశరీరము పోయినపిమ్మట గ్రొత్తశరీరములు గలుగుచున్నవి. కావున దెలిసినవారీశరీరము పోవునని దుఃఖంపరు.

ఇంద్రియములు తమతమవిషయములయందుఁ బ్రవర్తించునప్పు డావిషయభేదములనుబట్టి సుఖదుఃఖములు గలుగుచుండును గాని స్వతస్సిద్ధముగ నాత్మకు లేవు. అవి యొకప్పుడు వచ్చు, నొకప్పుడు పోవును. కావున నాసుఖదుఃఖములు శాశ్వతములు కావు. వానిని సహింపుము.

ఓపురుషశ్రేష్ఠుఁడా! సుఖదుఃఖములయందు సమబుద్ధిగల యేవివేకిని విషయేంద్రియసంయోగములు బాధింపలేవో యతఁడే మోక్షమున కర్హుఁ డగుచున్నాఁడు.

అశాశ్వతమైనవస్తు వెప్పటికిని లేనిదే యగును. శాశ్వత మైనవస్తువున కెన్నఁడును నాశ ముండదు. తెలివిగలవా రీ రెండువస్తువులయాధార్థ్యము నిట్లు తెలిసికొనుచున్నారు.

ఏయాత్మవస్తు వీసర్వప్రాణులయందును వ్యాపించినదో యట్టియాత్మవస్తువును నాశము లేనిదానినిగా దెలిసికొనుము. వృద్ధిక్షయములు లేని యీయాత్మస్వరూపము నెవ్వఁడును నశింపజేయఁజాలఁడు.

ఓయర్జునా! పెరుగుట తరుగుట మొదలగు వికారములు లేనట్టియు దేహాద్యుపాధులు నశించినను దాను నశింపనట్టియు నింద్రియగోచరుఁడు కానట్టియు నీజీవాత్మ నిత్యుఁడు. ఉపాధు లయిన యీశరీరములు నాశము పొందుచుండును. కావున యుద్ధము చేయుము.

ఆత్మ చంపు ననియు జంపఁబడు ననియు నను కొను వారు తెలివిలేనివారు. ఈయాత్మ యెవనిని జంపువాఁడు కాఁడు. ఎవ్వనిచేతను జంపఁబడువాఁడును గాఁడు.

ఈయాత్మ యెప్పుడును బుట్టువాఁడుగాఁడు. ఎప్పుడునుజచ్చు వాఁడుగాఁడు. మొదటినుండియు లేకుండి క్రొత్తఁగా గలుగువాఁ డును గాఁడు. కొంతకాల ముండి మరల లేకుండువాఁడును గాఁడు. మరి యేమి యనిన జన్మ లేనివాఁడును, నాశము లేని వాఁడును, వృద్ధిక్షయములు లేక యెప్పుడు నొక్కరీతిగ నుండు

వాఁడును, మొదలు లేనివాఁడును, దనకుపాధియైన శరీరము మరలమరల మారుచుండినను దా నెన్నటికిని మారనివాఁడు.

ఓయర్జునా! ఎవ్వ డీయాత్మను బుట్టువు లేనివానిగాను, శాశ్వతునిగాను, నాశరహితునిగాను, మారుపు లేనివాని గాను దెలిసికొనుచున్నాఁడో యాపురుషుఁడు తా నొకని జంపింతు ననియుఁ జంపుదు ననియు నెట్లుతలంచును?

నరుఁడు శిథిలవస్త్రములను విడిచి క్రొత్తవస్త్రముల నెట్లు ధరించుచున్నాఁడో యటులనే దేహాభిమానము గలయాత్మ శిథిలము లగుచున్నశరీరములను విడిచి నూతనశరీరములను ధరించుచున్నాఁడు.

ఈయాత్మ నాయుధములు భేదింపఁజాలవు. అగ్ని కాల్పఁ జాలదు. ఉదకములు తడుప లేవు. గాలి యెండింపను జాలదు.

ఈయాత్మ భేదింపఁదగనివాఁడు. దహింపఁదగనివాఁడు. తడుపఁదగనివాఁడు. ఎండింపఁదగనివాఁడు. ఎల్లప్పుడు నొక్క-రీతిగా నుండువాఁడు. సర్వప్రాణులయందు వ్యాపించియుండు వాఁడు. స్థిరుఁడు. చలనములేనివాఁడు. మొదలు లేనివాఁడు.

ఈయాత్మ కన్నులు మొదలయిన బహిరింద్రియములచే గ్రహింపఁబడువాఁడు గాఁడు. అంతరింద్రియమైన మనస్సుచే సాధారణముగఁ దెలియఁబడఁదగినవాఁడు గాఁడు. పెరుగుట తరుగుట మొదలగువికారములను బొందింపఁబడదగినవాఁడు

కాఁడు. కావున నీప్రకారముగా నాత్మను దెలిసికొని నీవు దుఃఖించుటకు దగవు.

దీర్ఘములగు బాహువులుగల యోయర్జునుఁడా! నీ వొకప్పు డీయాత్మను నెల్లపుడు బుట్టుచున్నవానిగాను' నెప్పుడును జచ్చుచున్నవానిగాను దలంతువేమో అట్లయినను నీయాత్మను గూర్చి దుఃఖించుటకు దగవు.

పుట్టినవానికి జావును జచ్చినవానికి మరల బుట్టుటయును నిశ్చితమై యుండఁగాఁ దప్పింప శక్యముగాని యీజనన మరణములవిషయమున నీవు విచారింపఁ దగదు.

ఓయర్జునా! మనుష్యాది శరీరములు ప్రకృతినుండి కలుగుచు బుట్టినవెనుక గొంతకాలమువరకు నహంకార మమకారముల కాధారములై కనుపించుచు. మరణానంతరమున దిరుగ నాప్రకృతిలోఁ జేరుచున్నవి. అట్టియీశరీరములవిషయమున దుఃఖ మేమి?

ఒక్కఁ డీయాత్మ నద్భుతవస్తువువలె జూచుచున్నాఁడు. మరియొకఁ డద్భుతవస్తువునువలె జెప్పుచున్నాఁడు. ఇతరుఁ డద్భుతవస్తువును వినునట్లు లీయాత్మను వినుచున్నాఁడు. అట్లు వినియు జూచియు జెప్పియును సాధారణముగ నెవ్వఁడును నీయాత్మయొక్క యాథార్థ్యము నెరుంగలేఁడు.

సర్వశరీరములయందును వ్యాపించియున్న యీయాత్మ యెప్పుడును జంపఁబడఁదగనివాఁడే. అందువలన నీవు (భీష్మాది) సమస్తజనులనుఁగూర్చియు దుఃఖింపఁ దగవు.

ఇంతియగాదు. క్షత్రియుఁడవగు నీయొక్క వర్ణధర్మము నాలోచించినను నీవు చలింపఁ దగవు. క్షత్రియునకు ధర్మయుద్ధమునకంటె నితరమైనమేలు లేదుకదా?

ఓయర్జునా! కోరకయే సంభవించినట్టియు, దెరువఁబడిన స్వర్గద్వారమైనట్టియు యుద్ధము నేరాజులు పొందుచున్నారో వారిహాపరసుఖములు గలవా రగుచున్నారు.

నీవు ధర్మయుక్తమైన యీయుద్ధమును జేయవేని నందువలన వర్ణధర్మమును, గొప్పధనుర్ధరుఁడవనుగీర్తిని, జెడగొట్టుకొని వర్ణధర్మమును విడుచుటవలన గలిగినపాపమును బొందుదువు.

ఇంతియకాక నీయపకీర్తిని జనులు శాశ్వతముగఁ జెప్పుకొందురు. గౌరవము గలవాని కపకీర్తి వచ్చిన నది మరణమునకంటెను గొప్పది యగుచున్నది.

ఓపార్థుఁడా! నీవిదివరలో నెవ్వరిచే గొప్ప వీరుఁడవని కొనియాడబడుచుంటివో యట్టి మహారథులయిన రాజులు నిన్నిపుడు భయమువలన యుద్ధమునుండి మరలినవానిగా దలంతురు. అందువల్ల నిన్ను గౌరవించిన వారే చులకగ జూతురు.

శత్రువులు నీశక్తిని నిందించుచు ననేకములైన యాడ రానిమాటల నాడుదురు. అంతకంటె నధికమైనదుఃఖమును గలిగించునది మరి యేది గలదు?

ఓ కుంతీపుత్రుఁడవైనయర్జునా! నీవు యుద్ధమునందు జంపఁబడినయెడల స్వర్గమును బొందుదువు. శత్రువులను జయించితివేని రాజ్యము ననుభవింతువు, కావున యుద్ధము చేయ నిశ్చయము గలవాఁడవు కమ్ము.

సుఖదుఃఖములను లాభాలాభములను జయాపజయములను సమానములనుగాఁ దలంచి పిమ్మట యుద్ధముకొరకు దలపడుము. ఇట్లు గీతోపదేశము జేసినపిదప నర్జునునకు విశ్వరూపమును జూపించినట్లు చెప్పఁబడి యున్నది. దీనితో శ్రీస్వామివారు కనబరచినవి రెండువిశ్వరూపములై యున్నవి. ఇందుకు వ్రాయఁబడు నీక్రిందివిషయమును జదువరులు ముఖ్యముగా గమనింపవలెను.

విశ్వరూపము లేదా విరాడ్రూపము శ్రీస్వామివారు కనబరచియుండినయెడల నది యేకవిధముగనే యుండవలెను. 1. కౌరవసభలో గనఁబరుపఁబడినదనిన విశ్వరూపములో నా స్వామిని బాండవాదులు పరివేష్టించియున్నట్లు చెప్పఁబడి యున్నది. 2. అర్జునునకు గనఁబరచిన విశ్వరూపములో శ్రీస్వామియొక్క విస్తృతాకారముఖములలోనికి జావబోవు కౌరవ

వీరులందరును ప్రవేశించునట్లు చెప్పఁబడి యున్నది. రెండు మారులు రెండువిధములుగ వర్ణింపఁబడినందున నిది విశ్వ రూపము కాదని స్పష్టపడును. లేదా స్వరూపవిమర్శముతో మనకు బని యేమి? ఏకారణమున విశ్వరూప మను రూప మును గనఁబరచిరో విచారింతము. కౌరవసభయందు విశ్వ రూపమును గనఁబరచుటవలన గౌరవులు యుద్ధమును మాన లేదు. తాత్కాలికదివ్యదృష్టిచే దర్శించినట్లు చెప్పఁబడినధృత రాష్ట్రుఁడుకూడ దనకుమారునకు యుద్ధమును మానుమని హితము చెప్ప లేదు. అర్జునునకు విశ్వరూపమును జూపుటచే మాత్రము విముఖుఁ డయిన యర్జునుఁడు యుద్ధమున కభి ముఖుఁ డయ్యెను. కావున నర్జునునకు శ్రీస్వామివారు తమ స్వరూపమును జూపి యుందురు. కాని యద్వైతియగు భారత గ్రంథకర్త వర్ణించినరూపము కానే కాదు. ఆ యద్వైతి పంచదేవతారాధనపరుఁడు గావున శక్తికిని స్వామికిని నభేదముగా భావించి యాముఖములో జావబోవువారు చొచ్చుచున్నట్లు వర్ణించెను. పరమభక్తుఁడును సఖుఁడును నగు నర్జునునకు గనఁబరచినరూప మితరులకు దెలిసికొన నలవి యగునా? కావున నర్జునునకు శ్రీస్వామివారు స్వస్వరూప మును జూపియుండిన నుండవచ్చును. ఈయంశమాత్ర విని యున్న కౌరవపక్షపాతి యగు నీగ్రంథకర్త యీయర్జునునకే

గాను. రాయభారమున కేగినపుడు కౌరవసభలోఁగూడ గొందరికి తత్రాపి అంధుఁడగు ధృతరాష్ట్రున కిదివరకే యొక విశ్వరూపమును జూపించెనను నతిశయోక్తికయి యచ్చట విశ్వ రూపమును గల్పించి తనకు దోఁచినట్లు వర్ణించెను. మరియొక చోట నుతంకుఁడను నొకఋషికి విశ్వరూపమును గనఁబరచిన ట్లున్నది. అపుడు పూర్వ మర్జునునకు జూపిన విశ్వరూపము నే చూపె నని చెప్పుచు విరాట్స్వరూపమును వర్ణించెను. గాని చావబోవుకౌరవులు శక్తిముఖమున జొచ్చునట్లు లేదు. అర్జును నకు నుతంకునకును గనఁబరచినరూప మేకవిధ మని చెప్పుచు గ్రంథకర్త భిన్నముగ వర్ణించెను. కావున నుతంకునికథ బ్రా హ్మణప్రభావముకొరకు నొకయతివలనఁ గల్పింపఁబడియుండును.

అర్జునునకు సారథ్యము జేయుచు నొకనాఁడు ముని కోలను మరియొకనాఁడు చక్రమును బట్టుకొని శ్రీస్వామి వారు భీష్మునిఁ జంపుటకు బోయినటులను నర్జునునివలన బ్రార్థితు లై తిరుగ నొగ లెక్కినటులను జెప్పఁబడి యున్నది. భారతగ్రంథకర్త కౌరవపక్షపాతి యని యుపోద్ఘాతమునఁ జెప్పఁ బడియే యున్నది. అయావిషయము లన్నియు నచ్చటనే చర్చించి పరిష్కరింపఁబడి యున్నవి.

[illegible]తిపక్షమువారగు పాండవులపక్షమున నున్న యీ శ్రీకృష్ణమూర్తిని నీగ్రంథ[illegible]ర్త తూలనాడక యుండునా?

సర్వేశ్వరుఁ డయినవాఁడు యుద్ధము చేయనని ప్రతిజ్ఞచేసి భీష్మునిమీఁదికి మునికోలను జక్రమును బట్టికొని వెళ్లునా? చదువరులే యోచింపుఁడు?

పదియేడవనాఁటియుద్ధమున ధర్మరాజు యుద్ధమునం దలసి శిబిరమున కేగెను. అ ట్లేగిన యన్నయొక్క క్షేమమును దెలిసికొనుటకు నర్జునుఁడు కోరఁగా 'ఇతఁడు కొంత యల యిక దీర్చికొనుట కిదియె సమయ' మని తలఁచి శ్రీస్వామి వారు రథమును బాండవశిబిరమునకు బోనిచ్చిరి. అప్పు డీ కృష్ణార్జును లిద్దరును గర్ణునిఁ జంపి యావార్త తనకు దెలుపుట కయి వచ్చి రని తలఁచి ధర్మరా జుప్పొంగెను. పిదప నిజమైన కారణము దెలిసికొని 'కర్ణుని జంపక యుద్ధభూమినుండి వచ్చితివా' యని యతికోపముతో నర్జునుని దూలనాడుచు 'నీచేత గాకపోయినయెడల నీధనుస్సగుగాండివమును శ్రీకృష్ణులవారి చేతి కి' మ్మని కోపముతోఁ బలికెను. ఈయర్జునుఁడు తనగాండీవము నితరుల కిమ్మని యెవ్వఁడు చెప్పునో వానితలఁ దునుముటకు మానసికశపథముఁ జేసికొని యున్నాఁడు. అందునుబట్టి ధర్మరాజుతలఁ దునుముటకు యత్నించెను. అపుడు శ్రీస్వామివా రట్లు గాకుండజేసి యందుకు బ్రతిగా ధర్మరాజును దూలనాఁడు మని సమాధానపరచిరి. అ ట్లన్నను దూలనాడి యందుకు గాను దనవధకు బ్రయత్నింపఁగా నట్లు జరుగకుండ శ్రీస్వామివా

గాటంకపరచి యాత్మవధకు మారుగా నాత్మస్తుతినిఁ జేసికొమ్మని బోధపరచిరి. అంతట నట్లు తూలనాడఁబడి ధర్మరా జరణ్యమునకుఁ బోవ సమకట్టఁగా శ్రీకృష్ణులవారు కొన్ని హితవాక్యములనుఁ జెప్పి మరలించిరి. అప్పుడు ధర్మరా జిట్లు పలికెను :—

క. "ఇది యట్టిద మోసంబున
బదిలుఁడగా కేను మున్ను పదిరినకతనన్
హృదయము గలఁగిన నా కె
య్యదియును దోసమి వికారి నైతి మహాత్మా.

ఆ. ఇట్టి నన్ను ననునయించి బోధించితి
కరుణ పేర్మిజేసి గౌరవమున
నజ్జులైన మమ్ము నాపత్పయోనిధి
మునుఁగకుండఁ గాచి తనఘమూర్తి."

ఆపయిని కృష్ణార్జును లుభయులును ధర్మరాజునొద్ద సెలవును బొంది కర్ణునిఁ జంపుటకు యుద్ధభూమికి మరలఁ జేరిరి.

ఈపయికథలో గ్రహింపవలసిన విషయములు మూడు కలవు :—

౧. ఎవఁడుగాని మనస్సునందు శపథము చేయఁగూడదు. అది రహస్యమైనది యైనంజున గురుపితృభ్రాతృమిత్రాదులకు సహా బాధ కలుగును. అట్లనే యీయర్జునునిప్రతిజ్ఞవలన

ధర్మరాజునకు ప్రాణోపద్రవము సంభవింపబోయెను. అయితే శ్రీస్వామివారి యనుగ్రహమువలన నట్లు కాక తప్పిపోయెను.

౨. జ్యేష్ఠభ్రాతను దూలనాడుట యతనిని వధించుటతో సమమని శ్రీస్వామివారు సెల విచ్చిరి. పూజ్యులగువారిని నిందించు నలవాటు అందలిదోషమును దెలియక జనులకు వాడుక గాగలదు. సాధారణముగ నితరులనుగూడ నిందించుట తప్పు. అది మర్యాద కాదు.

3. ఆత్మస్తవ మాత్మహత్యవంటిదే యని శ్రీస్వామివారు సెల విచ్చిరి. ఆత్మ స్తుతి యనఁగా దనవిషయము తెలియనివారియెదుట దాను నేర్చినవిద్యను జెప్పుకొనుట కాదు. ఒకఁడు తాను చేసినదానిని నీతిబోధకముగాఁ జెప్పుకొనుటయు గాదు. అట్లు గాక విద్యయందుగాని బుద్ధియందుగాని దేహబలమునందుగాని శౌర్యమునందుగాని, ధనము, దానము, తపస్సు, కీర్తి, నేర్పు మొదలగువానియందుగాని తనకంటె నధికులు లేరని గొప్పకొరకు జెప్పుకొనుట యాత్మస్తుతి.

శ్రీస్వామివారిచే జేయఁబడిన సంజ్ఞవలన భీముఁడు దుర్యోధనునితొడలు విరుగఁగొట్టె నని చెప్పఁబడి యున్నది. దుర్యోధనునితొడలు విరుగఁగొట్టుదు నని కౌరవసభలోఁ బ్రతిజ్ఞ చేసియుండిన భీమున కొకరు సంజ్ఞ చేయవలెనా? దుశ్శాసనునిఁ జంపినరోజున సహా రెండవప్రతిజ్ఞయగు దీని నెరవేర్ప

వలసియున్నదని భీముఁడు చెప్పియే యున్నాఁడు. బలరాముల వారికి శ్రీస్వామివా రిచ్చినయుత్తరములో సమయ మెఱిఁగి ప్రతిజ్ఞ నెరవేర్చుకొనె నని యున్నది. కావునఁ బాండవపక్షమున నున్న సర్వేశ్వరునకు మచ్చ దెచ్చుట కీవిషయమును గ్రంథకర్త కల్పించి యుండును.

నాటిరాత్రి పాండవులను శిబిరమున నుండనీయక యోఘవతీనదీతీరమునకు రథములతోఁగూడ శ్రీస్వామివారు పిలుచుకొనిపోయి రనియు, అందుచే బాండవు లశ్వత్థామచేఁ జంపఁబడక తప్పిపోయి రనియు నున్నది. అశ్వత్థామ చేయఁబోవు ఘోరకృత్యము నదీతీరమునకు జేరుటకుముందు శ్రీస్వామివారికిఁ దెలిసియున్నయెడల బాండవసేననంతను రక్షించి యుందురు. సర్వజ్ఞునకు దెలియదా యని యంటిరేని, అశ్వత్థామ రాత్రి మించినపైని దుర్యోధనునియొద్ద కేగి యతని దురవస్థను జూచి యర్థరాత్రా నంతరమున నీదుష్కార్యమును జేసెను. కావున బాండవు లానదీతీరమునకు బోవకముం దీవిషయము శ్రీస్వామివారికిఁ దెలియవచ్చుటకుఁ బ్రసక్తిలేదు. అశ్వత్థామ యీదుష్కార్యమును జేయఁ బూనినప్పుడెకదా హస్తినాపురమున ధృతరాష్ట్రునియొద్దనున్న శ్రీస్వామి కావిషయము హృదయగోచర మైనది? మరి యేమి యనిన: యుద్ధము సమాప్త మైనపిదప బాడుపడిన యాస్థలమునందు నాటిరాత్రి

యుండఁగూడదని నిర్మలమైన నదీతీరమునకు బాండవులను దీసి కొనిపోయి యుందురు. ఆపిదప యుద్ధానంతరకథ యశ్వత్థామాదులచరిత్రములలో వ్రాయఁబడి యున్నది.

పిమ్మట శ్రీస్వామివారు ధర్మరాజునకు స్వయముగ రాజ్యాభిషేకమును జేసిరి. ఇట్లు పట్టాభిషిక్తుఁడయ్యును ననేకులగు తనవారు యుద్ధమునందు మృతు లయినందుకు వగచుచున్నందున శ్రీస్వామివారు సోదరయుక్తముగ నతనిని భీష్మునిపాలికిం బిలుచుకొనిపోయి యాకురువృద్ధునివలన ననేకధర్మములను జెప్పించి మనఃకల్మషమును బోవునట్లు చేసిరి. అయితే సర్వము దెలిసిన శ్రీస్వామివారు తాము స్వయముగ ధర్మోపదేశము జేయక భీష్మునిచే ధర్మరాజునకు ధర్మాధర్మముల నేల చెప్పించిరో విచారింపవలసి యున్నది.

శ్రీస్వామివారే వానిని వివరింపవలసివచ్చినయెడల నాయావిషయములయొక్క నిజస్వరూపములను జెప్పవలసి వచ్చును. అప్పుడు ధర్మరాజతనిస్వభావమునుబట్టి రాజ్యమును విడుచుకొని తపస్సు జేయుటకు బోవును. వ్యాసాదిఋషులచేఁ జెప్పించినను నించుమించుగ నిది యేఫల మగును. కావున నీధర్మరాజు ముందు ప్రజలను శిష్టాచారముచొప్పున వర్ణాశ్రమమత విషయములకు లోబడి పరిపాలనము జేయవలసినవాఁడయి యున్నాఁడు. మరియు జ్ఞానులుగాని ప్రజ లనేకమతసంబంధపు

నీతివిషయకగాథలను నిజములగు వానిగ నిర్మించియున్నవారు. కావున భీష్ముం డక్కాలపువారిలో వాడుకలో నుండు ననేక ధర్మములను నీతులను గాథలను మతసంప్రదాయములు మొదలగువానినిఁ జక్కఁగ నెఱింగినవాఁ డగుటచేత నతనివలననే ధర్మరాజుయొక్క మనఃకల్మషమును శ్రీస్వామి వారు తీర్పించిరి. ఆపిదప గొన్నిదినములవరకు హస్తినాపురముననుండి మరల ద్వారకకేగి ధర్మరాజు చేయునశ్వమేథయాగమునకు గుటుంబసహితముగ వచ్చి యాగానంతరమున దిరుగ ద్వారకకు దయచేసిరి. శ్రీస్వామివారు ద్వారకలో ననేకసంవత్సరములు విజయముచేసి తమవలన నీలోకమునకు గావలసినపనులను నెరవేర్చి తుద నుద్ధవునకు బరమార్థోపదేశము జేసి బలరామసహితులయి వైకుంఠలోకమునకు దయచేసిరి.

ఈస్వామివారి యనుమతిని బురస్కరించుకొని వ్యాసులవా రప్పటికి ఖిలమై సంకీర్ణములయి యున్న వేదములను వేరుపరచి రనియు బ్రహ్మసూత్రములను జేసి రనియు నిప్పటిగ్రంథకర్తలు కొందరు చెప్పుచున్నారు.

వ్యాసుఁడు శ్రీకృష్ణులవారికాలమునాటివాఁడే కదా? శ్రీస్వామివా రవతరించుటకు దుష్టనిగ్రహమే గాక యిట్టికార్యములు చేయుపనియుఁగూడఁ గలదు. వారు క్షత్రియులు గావున బ్రాహ్మణుఁడును ఋషియు నగు నీవ్యాసునిచే నిట్లు చేయించి

రనుదానిని మనము నమ్ముటకు సందియ మేమి? అందునుండియే కదా? 'వ్యాసోనారాయణోహరిః' అని వ్యాసులవారికిఁ బ్రసిద్ధి కలదు.

ఈభాగవతగ్రంథకర్తయగు మొదటివాఁడు విష్ణుభక్తుఁడును నతనిబరాత్పరుఁ డని నమ్మినవాఁడును నయి యున్నాఁడు. అచ్చులేనికాలములో నిట్టిగ్రంథములు తాటియాకుపుస్తకములలో వ్రాయఁబడియుండుటనుబట్టి మతాభిమానులు వారి మతమును బుష్టిచేయుకొఱకు గొన్ని గాథలను, మతాంతరులు మనమతసంప్రదాయములయందును మనచే నమ్మఁబడినత్రిమూర్తులయందును లోపములను వ్యంగ్యముగ వ్యక్తపరచు దురుద్దేశముతో గొన్నికొన్ని కథలను గల్పించిరి. అందు నీభాగవతమున బోపదేవుఁడను బౌద్ధమతాభిమాని ప్రచ్ఛన్నముగ మన మతస్థులతోఁ గలిసి, మన మెవ్వని బరాత్పరునిగ నమ్ముచున్నామో యట్టిశ్రీకృష్ణునియం దయుక్తప్రవర్తనను గనబరచు దురుద్దేశముతో జలక్రీడ, రాసక్రీడ, షోడశసహస్రకన్యాపరిగ్రహము మొదలగుగాథలను నేర్పుతోఁ గల్పించి చేర్చెను. ఆగాథల నసందర్భము లని యోచింపక యసందర్భములకు మరికొన్ని యసందర్భములను గల్పించెడి స్వభావము గల మనపండితులు శరీరిశరీరన్యాయమును దెచ్చిపెట్టికొని పైగాథలవిషయమున సమాధానపడి యితరులకు బోధపరచు

చున్నారు. ఇట్లు విమర్శనములేని మనపండితులవలన మనయా ర్యమత మన్యమతస్థుల కాక్షేపణీయ మగుచున్నది. ఈబోప దేవుఁడను వానికాలమునాటికి శ్రీకృష్ణులవారే పరాత్పరులని నమ్మినవారు హెచ్చుమంది యుండి యుందురు. ఆది బౌద్ధమత మునందు యుక్తప్రవర్తనవలననే ముక్తి కలదు గాని జపతపో హోమార్చనాదులవలన ముక్తి లేదనుసిద్ధాంత మగుటచే నెవ్వని నప్పటిప్రజలు పరాత్పరునిగ నమ్మియున్నారో యట్టి వానిప్రవర్తనము మంచిదికా దని చెప్పి బోధపరచుటచేత శ్రీ కృష్ణులవారియందు బరాత్పరుఁడనునమ్మకము కొందరికి బోయి బౌద్ధమతములో సులభముగ జేరియుండి యుందురు. ఇకా్ర లపువివేకముగల కొందరుపండితులు రాసక్రీడాదిగాథల గ్రంథ శైలినిబట్టి యోచింపఁగా దదితర భాగముల శైలి ననుసరించి యుండ లేదని చెప్పుచున్నారు.

ఇటులనే కేవలమతగ్రంథములయందు శంకరరామానుజ మధ్వాచార్యులశిష్యపరంపరవారు వారివారి మతములపుష్టి కయి కొన్నికొన్ని గాథలను గల్పించియున్నారు.

---

## శ్రీకృష్ణులవారిని గురించి మనముపడియెడి దురభిప్రాయములు.



శ్రీకృష్ణులవారిని గురించి మనము సాధారణముగ నభిప్రాయపడి యుండునట్టియు నసత్యములైనట్టియు వారివారికి దోచినటుల వాడుకొనబడుచున్న విషయములను గనబరుపబోవుచున్నాఁడను. ముఖ్యముగా నార్యుల మగు మనమే కాక ప్రతిమతములవారును నందు విశేషించి నిష్పక్షపాతబుద్ధిగలవా రేది ధర్మవిరుద్ధముగను యుక్తిబాధితముగను నుండునో దానిని సుతరాము విడిచిపెట్టవలయును. ఇది ప్రతిమనుష్యుఁడు ముఖ్యముగ మనస్సునందు నుంచికొనవలసిననీతి యయి యున్నది.

శ్రీకృష్ణులవారికాల మిది యని యేశాస్త్రజ్ఞులవలన నిదివరకు నిస్సందేహముగ నిశ్చయింపఁబడియుండలేదు. కొందరు యూరోపుదేశపువిద్వాంసులు క్రీస్తుశకమునకు ముందు 14-వ శతాబ్ద మా శ్రీకృష్ణులవారి కాలమని యేకాభిప్రాయు లైరి. మరికొందరు క్రీస్తుశకమునకు ముందు 13 లేక 12-వ శతాబ్దము లని చెప్పిరి. ఇప్పటికాలపు కలకత్తాలోనుండిన ‘ధీరేంద్రనాద్ పాల్’ గారు శ్రీకృష్ణులవారికాలము క్రీస్తుశకమునకు ముందు

15—16 శతాబ్దముల మధ్యకాలమై యుండు నని సమర్థించిరి. అతఁడు రచించిన 'శ్రీకృష్ణులవారు, వారిజీవితకాలము, వారి బోధనలు' ననుపుస్తకమును ప్రారంభముమొదలంతము వరకుఁ జదువుటకు మిమ్మును ముఖ్యముగ వేఁడుచున్నాఁడను.

శ్రీకృష్ణులవారికాలము ద్వాపరముయొక్క యంతమందు గాని కలియుగముయొక్క యాదియందుగాని అనఁగా 5006 సంవత్సరములక్రిందట యని మనయార్యులు సాధారణముగ నమ్మియున్నారు. ఎటులనైన ననేకసహస్రసంవత్సరములై యుం డును గదా? మరియు మనపురాణములన్నియు నేకకాలమందు గాని, యొకపురుషునివలనగాని వ్రాయఁబడినవి కావు. ఈ పురాణములలో మన మనుకొనుచుండు సృష్టికాలముమొద లతిసాహసముతో ముందు రాబోవు ననఁగా నీయుగాం తమువరకును సంగతులు వ్రాయఁబడి యున్నవి. అందుల విషయములనుబట్టి మన కవకాశ మగు నన్నివిధముల యో చించి చూచెదము. మహాభారతము భారతయుద్ధము జరిగిన పిదప ననేకశతసంవత్సరములు గతించిన పైని వ్రాయఁబడిన ట్లున్నది. ఇది యర్జునునికి ప్రపౌత్రుఁడగు జనమేజయమహా రాజునకును భాగవత మర్జునునికి పౌత్రుఁడగు పరీక్షిన్మహారాజు నకును నప్పటిఋషులవలనఁ గథారూపముగఁ జెప్పఁబడినట్లు ప్రారంభింపఁబడి యున్నది. ఆకథలు శ్లోకరూపముగ మరి

యెంతో కాలమునాఁడు చేయఁబడి యుండవచ్చును. ఆకాలమందును నటుతరువాతను ననేకభాగములు కలుపబడియుండినటులఁ గనఁబడుచున్నది.

అన్ని పురాణములలోను భాగవతము, విష్ణుపురాణము, మహాభారతము, హరివంశము శ్రీకృష్ణులవారినిగురించి చెప్పఁబడియున్న ముఖ్యములైన గ్రంథములై యున్నవి. అందు భాగవతము సాధారణముగ విష్ణుచారిత్రమునుగురించి 12 స్కంధములుగఁ బుట్టియున్నది. అందు బదియవదానియందు నీశ్రీకృష్ణులవారిచరిత్ర వ్రాయఁబడి యున్నది. అదియు శ్రీకృష్ణులవారిపిదప ననేకశతసంవత్సరములక్రిందట వ్రాయఁబడియుండినందున నందులో మనుష్యస్వభావశక్తికి మించిన యనేకములైన యూహాలతో జేరినకథలు గలవు.

మహాభారత మనునది పాండవులతో సంబంధించిన శ్రీకృష్ణులవారిచారిత్రమునే చెప్పుచున్నయది కాని వారినిమిత్తమయి పుట్టినది కాదు. తక్కిన రెండుగ్రంథములయందును శ్రీకృష్ణచారిత్రమె ప్రధానముగ వ్రాయఁబడియున్నది. గనుక భాగవతముకంటె నీమూఁడుగ్రంథములయందును మనము హెచ్చు ప్రామాణ్యబుద్ధి నుంచవలయును. ఈమూఁడింటిలో మహాభారతము పాండవులతో సంబంధించినప్పుడు మాత్రమె శ్రీకృష్ణులవారికథను జెప్పుచున్నది. కాన నిప్పుడు పాతతరమైన

గ్రంథ మని యెంచవచ్చును. ఈగ్రంథములు శ్రీకృష్ణులవారి కాలముపిదప ననేకశతసంవత్సరములతరువాత వ్రాయఁబడిన వని నందుకు రుజువుగా నే నొకటి రెండు దృష్టాంతములను జూపించుచున్నాను. వానినిఁబట్టి యీపురాణములలోఁ గల పరస్పరభేదములును, అందునుబట్టి మనమనస్సుల నాటియున్న యసత్యపుభావనలును దెలియును.

(౧) శ్రీకృష్ణులవారు బాల్యమునందు, బూతనవలనఁ జంపఁబడక విడువఁబడి రని యున్నది గదా? భాగవతములోఁ బూతన ఖేచరిగా శ్రీకృష్ణులవారినిఁ జంపుటకు వచ్చె నని చెప్పఁబడి యున్నది. హరివంశములో నాపూతన కంసునిదాది యని చెప్పఁబడి యున్నది. భాగవతములో మరియు నది భయంకర మైనరాక్షసీ యని యెన్నఁబడి యున్నది. అయితే విష్ణుపురాణములో బిల్లలను జంపునది యని మాత్రము చెప్పఁబడి యున్నది. శిశుఘాతిని యనునామమునకుఁ బదులుగా గంసునిదాది యని హరివంశములోను భీతికర మైనరాక్షసియని భాగవతములోను జెప్పఁబడి యుండును. ఇట్లుండగా, 'ధీరేంద్రనాద్ పాల్' గారు పూతన యనునది యొకవిధ మైన భయంకర మైన శిశువ్యాధి యని చెప్పుచు వైద్యవిషయమునఁ బ్రశస్తములగు గ్రంథములలో నొకటి యగు శుశ్రుత మను దానిలో నిది యొక వ్యాధి యైనటులఁ జెప్పఁబడిన దని గొప్పయాధారమును

గనఁబరచిరి. మరియు బూతన యనుశబ్దము స్త్రీలింగము. ఆహేతువుచేత భాగవత, హరివంశకర్త లిది రాక్షసి యని, కంసునిదాది యని బహుశః వ్యవహరించియుందురు. విష్ణు పురాణములో శిశుఘాతిని యని మాత్రము చెప్పఁబడి యున్నది గాన నాగ్రంథకర్త లావ్యాధిని రాక్షసిగాను, దాది గాను నేవిధముగ భ్రాంతి నొందిరో చూడుఁడు. తమభ్రాంతిని స్థాపించుటకుగా ననందర్భపుకథను పూతననుగురించి కల్పించిరి. ఈ పైయుదాహరణనుబట్టి శ్రీకృష్ణులవారినిగురించి వ్రాయఁబడినచరిత్ర లనేకసంవత్సరములపిదప వ్రాయఁబడిన వనునదియు, నాగ్రంథకర్త లొకవిధముగ జరిగినవానిని బారపాటున మరియొకవిధముగ దీసికొనినదియు, వా రట్టివిరుద్ధాభిప్రాయములను స్థాపించుట కెట్టికథలను జేర్చినదియు మీ కిప్పుడు విదితమే గదా!

(౨) మరియు పైఁ జెప్పఁబడిన యన్నిగ్రంథములయందును శ్రీకృష్ణులవారు కాళియనామము గల నాగాధిపతి యగు నొక గొప్పసర్పముతో యుద్ధముజేసి నాగస్త్రీల యొక్క ప్రార్థనపైని బ్రాణములతో నానాగాధిపతిని విడిచిపెట్టిరని చెప్పఁబడి యున్నది. నాగ యనుశబ్దము సర్పమునకు వర్తించును. అందునుండి యాగ్రంథకర్త లాకాళియునిసర్పము క్రింద భ్రమసి తీసికొనుచు నాస్త్రీలను వర్ణించుటలో వారు

మాటలాడు శక్తిగలవారనియు విలువగల కర్ణహస్తపాదాభరణ ములను ధరించియుండి రనియు వర్ణించిరి. పాము లైనచో వానికి గర్ణములు హస్తములు పాదములు నుండునా! అవి యట్టియాభరణముల నెటులధరించెను. అయినతే వా రెవ రనిన యమునానదీతీరపుటడవులలో నివసించు నాగులను పేరు గల యొకజాతిప్రజ లై యున్నారు. అందునుండియొకదా శ్రీకృష్ణులవారు కాళియు, నాయడవి విడిచిపోవలసిన దని యాజ్ఞాపించినటులను నాయుత్తరువుప్రకార మాతఁడట్లు విడిచి పోయె ననియు జెప్పఁబడి యున్నది. ఈవిధముగనే యీగ్రంథ కర్త లనేకసంవత్సరములపిదప వ్రాసియుండుటంబట్టి యొక దానికి మరియొకటిగ భ్రమసియున్నారు. మరియొక చిన్న దృష్టాంతమును జెప్పుచున్నాను. కొందరుగ్రంథకర్తలు చెప్పు టలో శ్రీకృష్ణులవారు జన్మించినపుడు గాఢాంధకార మనియు, నపుడు విశేషవర్షము గురియుచుండిన దనియును, మరికొందరు చెప్పుటలో నారాత్రి యతిస్వచ్ఛమైనదియై యుండిన దనియుం జెప్పిరి. ఈవిధముగ పైవిషయములయందు గ్రంథకర్తలు భిన్నాభిప్రాయులై యుండుటచేత జదువరుల కేవిధమైన చెరు పును సంభవింపకపోయినను మనయార్యమతస్థులందరి దుర దృష్టముకొలఁది నాగ్రంథకర్తలు విశేషపాతిత్యకరములగు నట్టియు వచించుటకు లజ్జాకరములగు కేవలాసత్యదోషములకు

ఛాత్రులై యున్నారు. బహుశః ఈగ్రంథకర్తలు యుక్తాయుక్త విచారసమర్థత లేనివారుగ గానవచ్చుచున్నారు.

ఈసంస్కృతపురాణములను దెనుఁగు, అరవము మొదలగు దేశీయభాషలలోనికి మార్చినకవీశ్వరులు, మరియు నవివేకులుగ గనిపించుచున్నారు. వీ రనేకవిషయములలో శ్రీకృష్ణుల వారి చారిత్రములోని యొకభాగమును, ఇది యెట్టిసంగతి సందర్భములలో నెటుల జరిగినదో ముందు వెనుకల జూచి దానింగనిపెట్టుట కేవిధమైనశ్రమను బొందక క్రొత్తక్రొత్తప్రబంధములనే కల్పించిరి. ఆకథలన్నియు నసత్యపుకథ లగుటయే కాక వారివారికిగల యభిరుచిని యుద్దేశమును శక్తినిబట్టి కేవలము స్త్రీలోలత్వమును జెప్పుకథలై యున్నవి. వారివారి మనోభిప్రాయముల ననుసరించి చెప్పఁబడినట్టియు, నసత్యములైనట్టియు, శ్రీకృష్ణులవారివిషయమై మనము దురదృష్టము కొలఁది జేయుచున్న విరుద్ధభావన లెవ్వియో యీక్రిందఁ జెప్పుచున్నాఁడను:—

(౧) శ్రీకృష్ణులవా రొకనాఁటివెన్నెలకాలమందు రాసక్రీడలయం దాసక్తులయి యుండినటులను, అందు దామును యౌవనవతులగు స్త్రీలును గలిసి విహరించునటులను, నాయువతులు శ్రీకృష్ణులవారియందు మోహపరవశలైనటులను జెప్పఁబడియున్నది. ఈరాసక్రీడవృత్తాంతము భాగవతమునందు

విపులముగను, హరివంశవిష్ణుపురాణములయందు స్వల్పముగను గలదు. ఇట్టివి మరి రెండంశములు భాగవతమునందుఁ జెప్పఁబడి యున్నవి.

(2) శ్రీకృష్ణులవారొకసరస్సునందు వస్త్రవిహీనలై జలక్రీడ లాడుచుండుయువతుల వస్త్రముల నపహరించినటులను;

(3) కొందరు బ్రాహ్మణస్త్రీలు శ్రీకృష్ణులవారిం జూచి మోహించినటులను గలదు.

ఇట్టి గ్రంథకర్తలయొక్కయసందర్భపు టూహలతో నిండి యున్న యీకథలను గొంచెమైన దెలివి గలిగి యుక్తాయుక్త వివేచనముం జేయువారి కెవ్వరికిని నమ్ముటకు వీ లుండునా? ఒకవేళ నాకథలు గ్రంథకర్తలయొక్క కేవలామాయికములైన పొరబాటులై బహుశః ఉండియుండవచ్చును. ఈ పైమూడు విషయములు జరుగునప్పటికి శ్రీకృష్ణులవారికి 11 సంవత్సరముల వయస్సు గలిగి యుండెను. అట్టిబాల్యావస్థలో నుండు వారికి సంభోగవాంఛ గలిగియుండునా! అయితే వారు సాధారణమైనబాలురు కా రనియు విష్ణు, లేక, మూలవిరాట్టు యొక్కయవతార మని కొందరు చెప్పవచ్చును. గాని యీవిధమైనయుత్తర మాకథలకు బలహీనతనే కలుగఁజేయుచున్న యది. మూలవిరాట్టునియవతారమునుధరించినవారును, మనకు సృష్టికర్తయు, రక్షకుఁడును, సన్మార్గప్రదర్శకుండును, నింద్రియా

శీతుండును, దోషశూన్యుండును, అనవధికాతిశయకల్యాణ గుణగణుండును, సర్వజ్ఞుండును, జితేంద్రియుండు నని ప్రసిద్ధిని వహించిన శ్రీకృష్ణులవారు పాపకరమైనట్టియు, మోహావ్రేకమును గలిగించునట్టియు నిట్టికార్యములను జరిగించియుందురా? విచారింపుడు! అది నిజము కాదు. మరి యే మనిన నప్పటికాలములోను, నరుమగ నిప్పుడును, పర్వతవనవాసులలో స్త్రీపురుషులు కలిసి యాడుట, పాడుట, మనదేశమందు మామూలయియే యున్నది. ఇంతియెకాక నాగరికతగల యూరోపుదేశస్థులకు సహా యటుల నాడుట మామూలు మర్యాదయయి యున్నది. ఈగ్రంథకర్త లట్టిప్రజలయొక్క మామూలుమర్యాదలను దెలియనివారై యూరాసక్రీడకు విపరీతార్థమును దీసికొనిరి.

ఇక స్త్రీలయొక్క వస్త్రముల నపహరించినవిషయము శ్రీకృష్ణులవారు బాల్యావస్థ ననుసరించి వినోదార్థముగ జరిగించి యుండవచ్చును. లేదా స్త్రీలు వస్త్రవిహీనలై సరస్సులందును, నదులందును, స్నానములు చేయఁగూడదని యుపదేశము జేయుకొరకు బహుశః అటుల జేసియుండవచ్చును.

ఈవిధమగు నభిప్రాయముచేతనే బ్రాహ్మణస్త్రీలుకూడ నా గోపబాలురలో నాహ్లాదకరమగు, సౌకుమార్యముగల యూ

పిల్లవానినిఁ జూచి యతిప్రేమ గలవారై యుండవచ్చును. మగవారికంటె స్త్రీలు పిల్లలను జూచునపుడు హెచ్చుగ ప్రేమించుట స్వభావగుణమైయున్నది. ఇంక నాభగవంతుని విషయమున జెప్పనేల!

అవతారములవిషయమై అనిబిసెంటుదొరసాని యిచ్చిన యుపన్యాసములలో శ్రీకృష్ణులవారివిషయమై యాయువతులకు గల నిష్కల్మషమైనట్టియు, భక్తియుక్తమైనట్టియు, ప్రేమను వ్యక్తపరచుట కింతకంటె జెప్పుట కెక్కువమాటలు లేవని చెప్పుచు నీవిషయములలో విశేషపరిశీలన జేసినచో సంభోగ వాంఛతో గలిసినయుద్దేశ మేమియు లేనటుల స్పష్టపడగల దని చెప్పెను.

పై మూడువిషయములు, 'ధీరేంద్రనాద్' గారు కూడ నిరుత్తరమగువిధమున నాక్షేపించిరి. వారు చెప్పిన దే మనిన ఈయంశములలో నేమాత్రము నిజ ముండినను మహాభారత మునందు సభాపర్వమున శిశుపాలుఁడు శ్రీకృష్ణులవారిని నోటికి వచ్చినటులఁ దూషించునపుడు వారియొక్క యిట్టివ్యభిచార ములనుగురించి దూషింపక యుండునా యని నుడివెను. మరియు నాగ్రంథమునం దెచ్చటను శ్రీకృష్ణులవారు స్త్రీలోలు లని చెప్పఁబడియుండలే దనియు, అంతకు నవీనగ్రంథమగు

విష్ణుపురాణములోఁగూడ నాప్రశంస యేమియు లే దనియుఁ జెప్పెను.

మరియు రాధవిషయమున మిగులనవమానకరమగు నొక గొప్పతప్పభిప్రాయము గలదు చూడుఁడు. రాధ యను నామము భారత, భాగవత, హరివంశ, విష్ణుపురాణములయం దెచ్చటను గానరాకపోయినను బ్రహ్మవైవర్తపురాణమునందు రాధ యనునాపెతో శ్రీకృష్ణులవారి కొకసంబంధము గల దని గొప్పతప్పకథ వ్రాయఁబడెను. ఈక్రొత్తపురాణ మసం దర్భములగు మనుష్యులయొక్క యూహలకు మించినవ్యవస్థ లతో నిండియున్నది. ఆయమ శ్రీకృష్ణులవారికి మేనమామ భార్య యనియును శ్రీకృష్ణులవారియందు విశేషమోహపరవశ యై యుండెననియును జెప్పఁబడియున్నది. ఆమెవిషయమై 'ధీరేంద్రనాద్ పాల్'గారు కవులయొక్కకల్పనావ్యక్తిదప్ప మరి, యొకటి కా దని చెప్పుచున్నారు. అయితే ఆమెవిషయము కవులయొక్క పెద్దతప్పయియే యుండవలెను. గాని యామె కేవల కవికల్పిత కా దని నాయభిప్రాయము. ఏలనంటే ఆమెవిగ్రహము శ్రీకృష్ణవిగ్రహమునకు ప్రక్క నుంపఁబడి యిండియాదేశమునందంతట నారాధింపఁబడుచున్నయది. కవి కల్పిత మైనచో నటుల నారాధింపఁబడునా! నే నామెను శ్రీకృష్ణులవారియొక్క ముఖ్యభార్యయగు రుక్మిణియే యని

దృఢముగను, నిస్సంశయముగను జెప్పఁగలను. మరికొన్ని దేవాలయముల యం దిరుపార్శ్వములయందును రుక్మిణీసత్యభామలు గల శ్రీకృష్ణులవా రారాధింపఁబడుచున్నారు. గాని నాకు దెలియవచ్చినస్థలములలో నెచ్చటను రుక్మిణీదేవిమాత్రము గల శ్రీకృష్ణులవా రారాధింపఁబడలేదు. రుక్మిణి యనఁగా లక్ష్మీదేవియొక్క యవతారమే యని మనకందరికిం దెలిసినదియేకదా? అట్టిలక్ష్మితో మాత్రము వారి నారాధించుటకుఁగా నీరెండువిగ్రహములు గల యాలయములం గట్టించి ప్రజలు పూజింపఁగోరి యుండవచ్చును. ఈవిధముగ స్త్రీపురుషద్వంద్వనామములనుచ్చరించునపుడు స్త్రీనామమును ముందుగాను బురుషనామమును వెనుకగాను నుంచి చెప్పుట కలదు. అనఁగా సీతారామ, లక్ష్మీనారాయణ, పార్వతీపరమేశ్వర, అనువిధములు గలవు. అట్టిద్వంద్వనామములు చెప్పునపుడతిసులభముగఁ నుచ్చరింపఁబడుచున్నవి. అయితే రుక్మిణి యను నామము శ్రీకృష్ణనామముతోఁ బయినామములవలె సులభముగఁ బలుకఁబడదు. మరియు బూర్వనిపాతశాస్త్రవిరోధ మనియుం జెప్పుదురు.

లక్ష్మీ సహస్రనామములలో రాధ యనుపేరు లక్ష్మికిం గలదు. ఆసహస్రనామములలో శ్రీకృష్ణనామముతో రాధయను పేరుతప్ప దదితరనామము లంతసులభముగ గలిపి పలుకఁబడవు.

గనుక మనకు బూర్ణమైనసంతుష్టి గలుగునటుల నారాధా కృష్ణులు లక్ష్మీనారాయణులయవతారము లని పూజింపఁబడు చున్నారు. ఈవిధముగ నాదిని రుక్మిణియు శ్రీకృష్ణులవారును బ్రజలచేఁ బూజింపఁబడుచుండిరి. భాగవతాదిగ్రంథముల యందు శ్రీకృష్ణులవారు రుక్మిణీయుక్తముగనో లేక యష్టభార్య లనువారితోఁ గలిసియో, లేక మరియేవిధముగ బూజింపఁబడ వలెనో చెప్పఁబడి యుండలేదు. ఆగ్రంథములు పుట్టిన యనేక శతసంవత్సరములపిదపనే కాక రాధాకృష్ణులవారిప్రతిష్ఠకు బిదప మరికొన్ని వందలసంవత్సరములకు బ్రహ్మవైవర్తపురాణ కర్త కా నాలుగుపుస్తకములలో రాధ యనుపేరు కానరా నందున దనబుద్ధికోలఁది నీరాధ యెవ రని యోచించుటకు స్వల్పబుద్ధితోఁ బ్రయత్నించి యుండవచ్చును. అటుల నతఁడు పరిశీలించునపుడు ప్రారబ్ధముకోలఁది శ్రీకృష్ణులవారిమేనమామ యగు 'రాయన' యను నతని భార్యకు రాధ యనుపేరు గలిగి యుండినట్లు కనిపెట్టఁబడెను. అప్పటికి భాగవతములోఁ జెప్పఁబడిన రాసక్రీడ మొదలగువ్యభిచారకార్యముల నొప్పిం చుటకుఁ దగినట్టియు నసత్యములైనట్టియు వారివారికిఁ దోఁచి నట్టికథలతో నతనిమనస్సు నిండియుండవచ్చును. అందు నుండి యతఁడు రాయన యనువానిభార్యయగు రాధను శ్రీకృష్ణులవారితోఁ గలిసి పూజింపఁబడుచుండిన లక్ష్మికిమారుగ

బొరపాటుపడి యుండవచ్చును. తనన మ్మకమును దృఢపరచు టకుగా నై నాలుగు పురాణములయందుఁ జెప్పఁబడిన రుక్మిణీ శ్రీకృష్ణులకంటె రాధాగోపాలకృష్ణు లధికులని చెప్పునంతవరకు గథను బోనిచ్చెను. రుక్మిణీదేవియే రాధయని చెప్పుటకు మీా కేమి యాధారము గల దని సభ్యులగు మీారు న న్నడుగ వచ్చును. అనేకశతసంవత్సరములు గడచినపిదప నిప్పటివలె ప్రజలయొక్కయు, దేశముయొక్కయు, చారిత్రము లుంపఁబడ కుండినకాలములో ననేకసంగతులు సుతరాము మరచిపోవు టయు జాలవరకు మరచినవిషయములలో నందుకుబదులు క్రొత్తసంగతులు చేర్పఁబడుటయు వాడుకలోఁ గలదు. ఇందుకు దృష్టాంత మే మనిన: మనలోఁ గొంతమంది తప్ప శ్రీజగన్నాథ మనఁగ నేమియు దెలియనివారు కలరు. ఆక్షేత్రమునందు శ్రీ జగన్నాథుఁడు, సుభద్ర, బలరాముఁడు నను మూఁడువిగ్రహ ములు గలవు. మథురలోఁ బుట్టిపెరిగిన శ్రీకృష్ణబలరామ సుభద్రలయొక్కవిగ్రహములే యివి యని సాధారణముగ నవి వేకపునమ్మకము గలదు. ఇచ్చట మధురలో సుభద్ర, శ్రీకృష్ణ బలరాములకు జెలియలై యున్నది. జగన్నాథునికి నామె భార్యయై యున్నది. ఇంక మూర్ఖపునమ్మక మే మనిన శ్రీ కృష్ణులవారు చెలియలినే జగన్నాధములోఁ భార్యగాఁ బొంది యున్నది. ఈకథ మేనమామభార్యయగు రాధకథకంటె

మిక్కిలి యసంగతము గదా! అయితే నటుల కాదు. శ్రీకృష్ణులవారు జన్మించుటకు బూర్వమే యీజగన్నాథక్షేత్రము గలదు. ఇప్పుడు జగన్నాథములోఁ బూజింపఁబడుచుండినవిగ్రహములనే బలరాముఁడు, నర్దనుడుఁను దీర్ఘయాత్రలకు వెళ్లి నప్పు డచ్చోటునకుం బోయి పూజించి రనుసంగతి మన మిప్పుడు చదివి తెలిసికొనఁగలము. అయితే, ఈపొరపా టెటుల సంభవించినదో విచారింతము. తమసంతానములో బిల్లవానికి బురుషదైవనామమును, నాడుపిల్లకు స్త్రీదేవతా నామము నుంచుట మనలో నాచారమై యున్నది. ఇందుకు నిదర్శన మే మనిన: శ్రీసీతారామనామములలో నొకని కుమారునికి రామనామమును, కుమార్తెకు సీతానామము నుంచుట గలదు గదా! ఆ మొదటిసీతారాములు భార్యాభర్తలై యుండినను వారిపేళ్లను ధరించిన యీబిడ్డలిద్దరు సోదరీసోదరులయి యున్నారు. ఈవిథముగనె వారిజననీజనకులు తమబిడ్డలకు జగన్నాథములోఁ బూజింపఁబడుచుండు శ్రీకృష్ణబలరామ సుభద్రలయొక్క నామముల నుంచియుందురు. శ్రీకృష్ణులవారు తనచెలియలను భార్యనుగాఁ జేసికొని ననునమ్మక మెంత లజ్జాకరమైనటువంటియు, బాపహేతువైనటువంటి తప్పై యున్నదో మీకే విదిత మగును. ఈవిథముగనె బ్రహ్మావైవర్తపురాణకర్త రాథ యనునామము గల మరియొక స్త్రీని లక్ష్మీ యనురాథకు

బదులుగ దురదృష్టముకొలఁది బొరపాటుపడి మన మిప్పు డా గ్రంథములోఁ జూచురీతి నసత్యమైనట్టియు, దుష్టమైనట్టి యభిప్రాయమును బొందుటకుఁ గారణమైనది.

శ్రీకృష్ణులవారినిగురించి మరియొకస్వల్పాంశమును మీకు జెప్పవలసి యున్నది. వా రెనమంద్రు స్త్రీలను వివాహ మాడిన ట్లున్నది. ఇందుకు నే నాక్షేపింపను గాని రుక్మిణీసత్య భామాజాంబవతులకు వినాగా మరికొందరు భార్య లుండి నటుల మహాభారతమునందుఁ జెప్పఁబడి యుండలేదు. రుక్మిణీ దేవికంటె నొకరిద్దరు స్త్రీలను వారు వివాహ మాడియుండి నను నెనమంద్రుభార్య లుండినటులఁ దగినయుపపత్తి లేదు. అయినప్పటికి నొకభార్యకంటె నెక్కుడుమందిని వివాహ మాడినటుల మన మొప్పక తప్పదు. కాన నేల నటుల జేసి కొనిరో చూచెదము. ఆకాలములో నిరాకరింపఁబడదగని కొండాచారములు గలవు.

(౧) ప్రతిరాజును వివాహమైనవాఁడు గాని, కానివాఁడు గాని, యొకరిచేఁ గోరఁబడినపుడు స్వయంవరమునకు దప్పక బోవలసిన దనియు, స్వయంవరమం దాచిన్నదానిచే వరింపఁ బడినచో నామెను దప్పక వివాహ మాడవలసిన దనియు నాచారము గలదు.

(౨) ఒకరాజు తనను జయించినరాజునకు దనకుమా ర్తెనుగాని, చెలియలనుగాని వివాహముకొరకు సమర్పిం చుట గలదు. అటుల సమర్పించుట, జయింపఁబడినవాని కిష్టము మీఁద నున్నదిగాని, జయించినవానికి మాత్ర మాచిన్న దానిని సంగతిసందర్భములనుబట్టి తనకుగాని తనకుమారునికి గాని వివాహము జేసికొనుట విధివిహితమైన యాచారమై యున్నది.

ఇట్టి యాచార సందర్భములవలన నొక భార్యకంటె నెక్కుడుమందిని వివాహ మాడి యుండవచ్చును. గాని స్త్రీలోలత్వముచేత గాదు. లేదా, మీఁద గనఁబరుపఁబడిన విషయములలోవలె గ్రంథకర్తల పొరబాటులుగ నైన నుండ వచ్చును.

మరియొకచిన్న గాథ కలదు. శ్రీకృష్ణులవారు గొప్ప రాజగు నరకాసురుని సంహరించి యాతనియధీనమై యుండు యువతుల నందరిని వివాహ మాడిన ట్లున్నయది. ఈసంఖ్య బహుశః అతిశయోక్తికొరకు గ్రంథకర్తలచే బదియారువేలు మొదలు పదియారువేల నూటివరకు జెప్పఁబడి యున్నది. ఈపొరపా టెటుల జరిగినదో చూచెదము. ఆస్త్రీలందరికి నానరకాసురుఁడు పతి లేక పోషకుఁడై యుండెను. అతఁడు సంహరింపఁబడగానే స్వభావముచేతనే శ్రీకృష్ణులవారియం

దాపోషకత్వము వ్యాపించినది. సంస్కృతమునందు బతిశబ్ద మునకు 'ప్రభువు' 'పోషకుఁడు' 'భర్త' యనునర్థములు గలవు. 'భూపతి' 'గృహపతి' 'జనపతి' ఇత్యాదులు. గనుక మితిలేని శృంగారకథలతో నిండియుండిన మనస్సులు గల గ్రంథకర్త లాపతిశబ్దమునకు బోషకుఁడను నర్థముం జేయక భర్తయను నర్థముం జేసియుందురు.

ఇంక పశ్చిమదేశపువిద్వాంసు లగు 'మాక్సుముల్లరు' మొదలగువారిచే నెవరియొక్క యుపదేశము లైకకంఠ్యముగ మెచ్చుకొనఁబడి యుండినవో యట్టి శ్రీకృష్ణులవారివిషయమై మన కిదివరలో గలిగియున్నట్టియు, లజ్జాకరములైనట్టియు, వారివారికిఁ దోచినటులఁ జెప్పఁబడినట్టియు, వారివారియిష్టము కొలఁది విరివి జేయఁబడినట్టి విపరీతభావనలను మీకు సాధ్య మైనంతవరకు బోధపడునటులుగ వ్యక్తపరిచితి నని తలంచు చున్నాఁడను. అట్టి యసత్యపునమ్మకమునుబట్టియేకదా మన వారిలో ననేకులు అనఁగా గతవర్తమానకాలములయం దుండు వారు. పాపభూయిష్ఠములైనట్టియు బైని చెప్పఁబడినట్టియు, నసత్యములైనట్టియు ననేకములగుతప్పులను జేసియుండునటుల గనిపెట్టుట మిగుల లజ్జాకరమై యున్నది.

ఓస్నేహితులారా! పైఁ జెప్పఁబడినయుక్తులను బ్రమా ణములను మనస్సునం దుంచి మన కిదివరకు శ్రీకృష్ణులవారి

విషయమై గలిగియున్న యట్టివిపరీతభావనల నొకవైపు త్రోసి వేసి సత్యమైనట్టియు బూజ్యమైనట్టియు నడవడిని మనమందర మవలంబింపవలసినవారమై యున్నారము.



శ్రీకృష్ణ.

రెండవభాగము.

# శ్రీమద్రామాయణము

## ఉపోద్ఘాతము.

ఘు



దీనిని వాల్మీకియనుఋషి చెప్పినటుల నున్నది. అయితే నాఋషి దీనినంతను జెప్పియుండునా. లేక సూక్ష్మముగఁ జెప్పి యుండునా విచారింపవలెను. శ్రీరాములవారిసన్నిధిని గుశల వులవలన నాఋషి పాడించినటుల నున్నది. ఈయిరువదినాలుగు వేల గ్రంథమును బ్రభువులకుఁ బాడించి వినుటకు వీ లుండదు. కావున సూక్ష్మరూపముగనె పాడించి యుండవలెను. మరియు నీక్రిందఁ గనబరుపఁబోవు ననేకాసందర్భములతో నిండియుండిన దానిని శ్రీస్వామివారు విని యెటుల నంగీకరించి యుందురు? అందువలన నిది యిటీవలఁ జెప్పఁబడియుండవలెను. శ్రీమద్రామాయణమునకు ముందు ఛందోయుక్తముగ నేదియు లేదనియు ముందుగాఁ దనకు స్ఫురించిన, "మానిషాదప్రతి ష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః । యత్క్రౌంచమిథునాదేక మవధీఃకామమోహితం" అను నీశ్లోకమునుబట్టి వాల్మీకి ఛందో

యుక్తముగ నున్నదానిఁ జూచి యచ్చెరువొందె నని యున్నది. అంతకుముందు ఛందోయుక్తముగ నేదియు లేకపోయినయెడల ఛందోయుక్తముగ నుండినటుల నతని కెట్లు దెలిసెను. కవిత్వ మును జెప్పనేరని మనకు ఛందోలక్షణములు దెలియునా? అయితే మరి యెందు కటులఁ జెప్పఁబడిన దనఁగా నాగ్రంథ మన్నిగ్రంథములకంటె ముందుగఁ బుట్టిన దని జనులను నమ్మించుట కటులఁ జెప్పఁబడియుండును. ఉపనిషత్తులు కొన్ని ఛందోయుక్తముగ నున్నవి. అవియుఁగూడ నీగ్రంథమునకుఁ దరువాతఁ బుట్టిన వని నమ్మవలసివచ్చును. మరియు మనగ్రంథ ములవరుసనుబట్టి చూడఁగా ముందు వేదములు అనఁగా శ్రుతిస్మృతులు, నావిదపఁ బురాణములు, తరువాత గావ్య ములు పుట్టియుండుటనుబట్టియేకదా ప్రభు సుహృ త్కాంతా సమ్మితము లని నిర్ణయింపఁబడి యున్నవి. ఇంతియకాక యిది శ్రీరాములవారి కాలానంతరమునందును జాలకాలమునకు బుట్టి యుండును. ఏల యనిన వనములయందు సంచరింపుచుండు జనులగువానరులను గోతులుగను నేకశిరస్సుగలరావణుని దశ శిరస్సులుగలవానిగనుఁ దీసికొనిఁ యానమ్మకమునకుఁ దగినటుల నాయాచేష్టలను వర్ణనలను ననేకస్థలములఁ జేసెను. వానరు లనువారు నరులే గాని మర్కటములు గా రని సుగ్రీవుని కథాంతమందును రావణుని కొకశిరస్సే గల దని యాతని

చరిత్రయంమును విపులముగఁ జర్చించి వ్రాయఁబడి యున్నది. కావునఁ జదువరు లిచ్చటఁ దత్తరపడక యాయాకథలను జదువఁ గోరుచున్నాను. ఇందు వానరవిషయము వాచస్పత్య ములో వానరశబ్దమువద్దను, బ్రౌన్ దొరగారివలన సమకూర్పఁ బడిన తెనుఁగు ఇంగ్లీషు డిక్షనరీయందు వానరహనుమచ్ఛబ్దముల వివరణమందును వీరు మనుష్యులే యని చెప్పఁబడి యున్నది.

యూరోపు దేశపుబండితులు కొందరీగ్రంథశైలినిబట్టి శ్రీరాములవారికాలమె భారతకాలమునకుఁ దరిమిలా దనిచెప్పి యున్నారు. దాని నొప్పుటకు వీలులేదు. ఏమనిన పురాణ ములయందును శ్రీకృష్ణచారిత్రముగల భారతభాగవతము లందును శ్రీరామకథ చెప్పఁబడియున్నది. శ్రీకృష్ణులకాలపు వాఁడగు యుధిష్ఠిరుఁ డొకఋషివలన శ్రీరామకథను విని యున్నాఁడు. కావున శ్రీరాములవారికాలము భారతకాలము కంటె ముందె యయి యుండవలె ననుటలో సందేహ మేమియు లేదు.

శ్రీరాములవారిసన్నిధిలో వాల్మీకి కుశలవులచేతఁ బాడించి నది సూక్ష్మరూపముగ నుండును. ఈగ్రంథమంతయు జాల కాలము పిదప నాఋషిపేరుతో నొకవిష్ణుభక్తుఁడు చెప్పియుం డును. బ్రహ్మసూత్రములు చేసినవ్యాసులవారి పేరుతో నన్ని పురాణములు చెప్పఁబడియుండినటుల నిది వాల్మీకిపేరుతోనే

యాధిక్యముకొఱకుఁ జెప్పఁబడినది. మఱియు నీగ్రంథకర్త శ్రీరాములవారినిఁ బరాత్పరుని యవతార మని యొప్పుచుఁ గొన్ని యసందర్భములం జెప్పెను. శ్రీభగవంతుఁ డీలోకములో నవతరించుట దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమును దమప్రవర్తనను జూచిన వినిన వారందరు దమవలె యుక్తప్రవర్తన గలిగియుండుటకు నై యున్నది. తనభార్య నొకఁడు హరించినపు డామె స్థితిగతులం దెలిసికొని హరించినవానిని శిక్షించుట నీతియే. ఆదుఃఖమునకు దాళలేక యడవిలో శ్రీరాములవారు సాధారణమనుష్యునివలె విలపించిరఁట. అరణ్యములో నిర్జనమైనచోట దమ్ముండును దానును నేల విలపింపవలెను. బాణమును ధరించిన శ్రీరాములవారికిఁ జడిసి సముద్రుఁడు ప్రత్యక్షమైనటుల నీగ్రంథకర్త చెప్పుచు రావణవధకొఱకు నసమర్థునికివలె నగస్త్యుఁడు శ్రీస్వామివారిని సూర్యుని నారాధింపుమనినట్లును, మాతలి బ్రహ్మాస్త్రమును బ్రయోగింపుమని చెప్పినట్లును రచించెను. ఏమివింత? తొమ్మిదిసారులు తలను గొట్టినపిదప రావణునితో నొకనాఁడు రాత్రింబగళ్లు శ్రీస్వామివారు యుద్ధమును జేసిరఁట. ఆపైని బ్రహ్మాస్త్ర మేయు మని మాతలి చెప్పినట్లున్నది. తలగొట్టిన దల మొలచుచున్నవానిని శీఘ్రముగ సంహరించుటకుఁ బ్రయత్నింపక యంతకాలమువరకు శ్రీస్వామివా రేల సాధారణముగ యుద్ధమును జేసియుందురు? గ్రంథకర్త

చెప్పినటులఁ దీసికొనినను నంతకాలమువరకు మాతలి బ్రహ్మాస్త్ర మేయు మని యేల చెప్పలేదు? ఈగ్రంథమునందు గాయత్రీమంత్రమునందుగల యిరువదినాలుగక్షరములకు నక్షర మొకవేయిశ్లోకములతో నింపఁబడి యిరువదినాలుగువేలశ్లోకములు గలిగి యనేకేతరనిబంధనలు తక్కినగ్రంథములకంటె నెక్కుడుగ గలిగినందున నిది యాగ్రంథములకంటె నవీన మని చెప్పఁదగి యున్నది. అయితే కావ్యములలో నాది కావ్య మని యొప్పవచ్చును. అందుచేతనే దీని నాదికావ్య మని వాడెదరు. తక్కినగ్రంథకర్తలతోఁబాటుగ నీతఁడును నీగ్రంథమున కాధిక్యముకొరకును ననాదిగ్రంథ మనిపించుటకును జెప్పినవిషయములను మనము గమనింపవలసినదే కాని గ్రంథకర్తయందు దోష మేమియు లేదు. మరియు శ్లోకము చదువఁగానె యర్థ మిచ్చునటులఁ బహుమృదువుగాఁ జెప్పఁబడినది. ఈగ్రంథమునకు గావ్య మని పే రుండినను నితరకావ్యములతోఁబాటుగ వ్యంగ్యార్థమునె బోధపరుపక పురాణేతిహాసములతోఁబాటు సకలనీతులను బోధపరచుచు శ్రీభగవంతుని యవతారమగు శ్రీరాములవారికథను గలిగియున్నందున నీ కావ్యము భాగవతవిష్ణుపురాణములతోఁబాటుగ నతిపవిత్రమైనదియుఁ బూజార్హమైనదియు నిత్యపారాయణకు ముఖ్యమైనదియు నై యున్నది.

శ్రీకృష్ణ.

# శ్రీమద్రామాయణ విమర్శము.

---

## ౧. దశరథమహారాజు.

ఈయన సూర్యవంశజుఁడు. అజమహారాజునకుఁ బుత్రుఁడు. రఘుమహారాజునకుఁ బౌత్రుఁడు. ఈయన యరువదివేలసంవత్సరములు రాజ్యపాలనము చేసినపిదప నప్పటికిని బుత్రలాభము లేనందున బుత్రకామేష్టి యను నొకక్రతువును జేసి తనయులను బడసినట్లు చెప్పఁబడి యున్నది. ఈయన యరువదివేలసంవత్సరము లేకారణముచేతనైనను జీవించి యున్నట్లు మన మొప్పినను నతనిభార్యలు, బంధువులు, మిత్రులు మొదలయినవా రతనితోఁబాటుగ నెట్లు జీవించి యుండియుందురో వింతగ నున్నది. మరియు నిక్కాలపు వారి కంటె నక్కాలపువారి కాయుర్దాయము హెచ్చుగ నుండినను సంతానకాలము మించినపిదపఁ బుత్రలాభముకొరకుఁ బ్రయత్నింపక యరువదివేలసంవత్సరములవరకు నిదానించి సంతానార్థము ప్రయత్నించుట మరియు వింతగ నున్నది. పాయస మహిమవలన భార్యలు బిడ్డలను గనియుండకూడదా యని యంటిమా? వివాహకాలములోగా బరిణయమైనభార్యలకు

(అంతకాలము జీవించియున్నట్లు మన మొప్పికొనినను) గర్భోత్పత్తికాలము మించినపిదపఁ బాయసమహిమవలన నైనను గర్భము లెట్లు గలిగినవియో మిగుల నసంభవముగ నున్నది. కావున నరువదివేలసంవత్సరములకాలము నొప్పుటకు వీలు లేదు. మన గ్రంథములలో ననేకస్థలములయందు గాలపరిమితినిఁ జెప్పవలసిన సమయములలో సహస్ర మనుశబ్దము వాడుకజేయఁబడి యున్నది. ఆసహస్రశబ్దమునకు శతస్థానమునకు మీదిది యగు సహస్రసంఖ్య యని మన మెప్పుడును దీసికొనఁగూడదు. ఆసహస్రశబ్దమున కనేక మని యర్థముఁ గలదు. కావున వర్షసహస్రము లనఁగా ననేకవర్షము లనియు ననఁగా సంఖ్యచే నరువది యనియు గ్రహింపవలెను. ఈవిషయము దశరథుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పినట్లుమాత్రము కనిపించుచున్నది. మరి యెచ్చటను గానరాదు.

పండితసాధారణముగా నెల్లరు నరువదివేలసంవత్సరములని యభిప్రాయపడుచున్నందున నీవిషయ మింతచర్చతో వ్రాయుట యైనది. కావున నాదశరథుఁ డరువదిసంవత్సరములే ప్రభుత్వము జేసియుండును లేదా జీవించియుండును. అప్పటికాలపువారు మనకంటె దృఢమైనశరీరబలముగలవారగుటచే నాదశరథుఁ డరువదిసంవత్సరములవరకు సిదానించి పుత్రలాభముకొరకుఁ బ్రయత్నపడియుండును.

ఈదశరథమహారాజునకు జ్యేష్ఠభార్యయగు కౌసల్యయందు శ్రీరాములవారును, ద్వితీయభార్యయగు సుమిత్రయందు లక్ష్మణ శత్రుఘ్నులును, తృతీయభార్యయగు కైకేయియందు భరతుఁడు ననునలువురుకుమారులు జన్మించిరి. ఈకుమారులు దిన దినప్రవర్ధమానులయి విద్యల నభ్యసించుచు వచ్చిరి. అంతట విశ్వామిత్రుఁ డనుమహర్షి దశరథునికడకు వచ్చి శ్రీరాముల వారిని తనయజ్ఞరక్షణముకొరకుఁ బంపు మని కోరెను. బాలుఁడగు తనతనయుని నట్లు పంపుటకు వెరచుచున్నయా రాజును వశిష్ఠమహర్షి భయములే దనియు, నాఋషివెంటఁ బంపినయెడల మేలు గలుగు ననియు సమాధానపరచెను. అపు డారాజు శ్రీరాములవారిని వారితో నత్యంతమైత్రిగల లక్ష్మణుని నాతనివెంటఁ బంపెను. ఈరామలక్ష్మణులు విశ్వామిత్రునిపనుపున నాతనికార్యములనుఁ దీర్చి యాముని వలనఁ దివ్యాస్త్రలాభమునుఁ బొంది వివాహితు లయి యయోధ్యకు వచ్చినపిదప వృద్ధుఁడగు నద్దశరథుఁడు జ్యేష్ఠుఁడగు శ్రీరామునకుఁ బట్టాభిషేకము జేయుటకు సిద్ధపడియుండఁగాఁ దనభర్త తనకు బూర్వ మిచ్చెదనన్నవరములను మంధర యను దానిదుర్బోధవలన కైకేయి యడిగెను.

ఆవరములు :—పదునాలుగుసంవత్సరములు శ్రీరాముల వారి నరణ్యవాసమునకుఁ బంపుటయు, భరతునకు రాజ్యాభి

షేకము చేయుటయు నై యున్నవి. ఇవి యాయమకు మనస్సునందుఁ బుట్టినకోర్కెలే యయియున్నయెడల వివాహ కాలమునందు రాజ్యశుల్కముగాఁ దనతండ్రికిఁ బ్రతిజ్ఞచేసి యుండుటనుబట్టి యామె మూఁడువరము లడిగియుండవలెను. అట్లుగాక దానిని గలిపి మరియొకవరము నడిగెను. ఆయడు గుటలోనును బదునాలుగు సంవత్సరముల కాలపరిమితికి మాత్రము తనకుమారునకు రాజ్యము గావలె ననునర్థ మిచ్చునట్లుగ నడిగియుండును. అట్లు గానియెడల దశరథుఁ డామెతో శ్రీరాములవారి 'నడవికిఁ బంపువరమును మా త్రమువిడుచుకొనుము. నీకుమారునకే రాజ్య మిచ్చెద' నని యేల యడిగికొనును. వరమునందు గాలపరిమితియే లేక పోయినయెడల నొకసారి కాలనియమము లేక యిచ్చినదానినే తిరుగ నిచ్చుటలో నామెకు లాభమేమి? మరియు శ్రీరాముల వారు భరతునితో 'మనతండ్రి నన్ను బదునాలుగువత్సరము లడవిఁ బొమ్మనియు నిన్ను రాజ్య మేలు మనియు నియమించి యున్నాఁడు' అని యున్నారు. కాలనియమము లేక భరతు నకుఁ దమతండ్రివలన రాజ్య మీయఁబడియుండినయెడలఁ దమయరణ్యవాసానంతరము రాజ్యమును స్వీకరింతురా? చదు వరులే యోచించునది.

స్వలాభకరమైన కార్యమైనను యుక్తాయుక్తవిమర్శనము లేక తొందరపడి ప్రయత్నించినపుడు కైకేయికివలె గావలసి నంతలాభము గలుగదు.

వరములనిర్దేశమును దెలిసికొనక యొక రడిగినవరము నిచ్చెద నని ప్రతిజ్ఞ చేయుటయం దవివేకమువలన నీవరముల నిచ్చిన యీదశరథుఁడు పట్టాభిషిక్తుఁ డగుటకు సిద్ధముగనున్న జ్యేష్ఠకుమారుని నడవికిఁ బంపుకొనెను. నలుగురుపుత్రు లుండియు నొక్కఁడైన దగ్గిర లేనిసమయమున మృతినొందెను. ఇట్లు మృతినొందుట కొకశాపకథ కల్పింపఁబడినది. అది కల్పిత కథయైనను నందువలన మనము గ్రహింపవలసిననీతి యేమి యనిన:—రాజులకు వేట స్వధర్మమైనను మిగులఁ జాగ్రత్తతో వేఁటాడకపోయినయెడలఁ బ్రమాదము సంభవించునని. ఇట్లు శ్రీరాము నరణ్యావాసమునకుఁ బంపి దశరథుఁడు వా రడవి కేగిన యారవనాఁటిరాత్రి పరలోకప్రాప్తుఁ డయ్యెను.

## 2. వశిష్ఠుఁడు.

ఈయన మనయార్యమతస్థులచే నిత్యు లని నమ్మఁబడు సప్తమహర్షులలో నొకఁడు. ఇక్ష్వాకువంశజులందరకును గ్రమముగఁ బురోహితుఁడుగ నుండెను. ఇట్టివానిచే నుంపఁబడిన పట్టాభిషేకముహూర్తము సహా కార్యకారి కాకపోవుటయే గాక శ్రీరాములవారి కరణ్యావాసకష్టమును గలుగఁజేసెను.

కావున ముహూర్త మనునది పదిమంది చేరుటకును నాపనికి గావలసినసంభారములు జాగ్రత్తపడుటకును వీలగు కాలసదు పాయమును గలిగించునే కాని వారివారి యదృష్టములను మార్పఁజాలదు.

### 3. సుమంత్రుఁడు.

ఇతఁడు దశరథమహారాజుయొక్క యష్టమంత్రులలో నొకఁడు. ఇతఁడును నిక్ష్వాకునివద్దనుండి క్రమముగ నా రాజుల కొకమంత్రిగ నున్నట్లు చెప్పఁబడి యున్నది. మహర్షి యగు వసిష్ఠునితో బాటుగ నితఁ డంతకాలము జీవించుటకుఁ గారణము గానరాదు. ఇతఁడు చేయుపని యేమి యనిన: అంతఃపుర స్త్రీలయొద్దకును, బుత్రాది బంధువులయొద్దకును వార్తలు నడుపుట. వారివారిసౌఖ్యములకు భంగము లేకుండు నట్లు కనిపెట్టుట. అంతఃపురస్త్రీలు బయటికి వెడలునపుడు వారి రథసారథ్యము చేయుట మొదలగుపనులుగాఁ గనఁబడు చున్నవి. అంతఃపురసంచారమునకు వృద్ధుఁడగువాఁడే కాని యితరుఁడు పనికిరాఁడు గదా? ఆవృద్ధత్వములోను వార్ధకము వలనఁ గలిగిన బుద్ధిలోపము లేనివాఁడుగ నుండవలెను. అట్టి వానిని సుమంత్రుఁడు అనఁగా (యోగ్యమైన యాలోచనగల వాఁడు) అనువానిగా నేల చెప్పఁగూడదు? కావున నాపనిలో నుండగ నేర్పఱుపఁబడిన ప్రతిమంత్రికిని సుమంత్రుఁ డని

యుద్యోగనామము గలిగియుండును. అందువలన నిక్ష్వాకుని నాటినుండియును నున్నట్లు చెప్పఁబడిన యుద్యోగనామముఁడే యితఁడు. వృద్ధుఁ డగుటచే నప్పటినుండి యుండినవాఁ డని గ్రంథకర్త పొరపాటుపడి యుండును. ఇట్లనే కాలాంతరమునం దేకనామమును ధరించినరాజులను సహా ఒక్కరుగానే మన గ్రంథకర్తలు తీసికొనుచున్నారు. ఇప్పటి మనచక్రవర్తిగారికి ఎడ్వర్డు అనునామము గలదు. ఈపేరు వారివంశజులలో లోగడ నార్గురికిఁ గలదు. కావున నీతఁ డేడవయెడ్వర్డు అని పిలువఁబడు చున్నాఁడు. మొదటి యెడ్వర్డు అనురాజు మొదలు ఒకటవ యెడ్వర్డు అను మొదలగు సంఖ్యానిర్దేశములతో వాడఁబడుచు వచ్చినందున మనము పూర్వులవలె నొక్కఁడే యని భ్రమయుటకుఁ బ్రసక్తి లేదు.

## ౪. హనుమంతుఁడు.

ఇతఁడు సుగ్రీవునకు మంత్రి. అరణ్యవాసమున శ్రీరాముల వారికిని సుగ్రీవునకును ఋశ్యమూకపర్వతమునందు సఖ్యము చేసెను. ఇతఁడు మిగుల బుద్ధిమంతుఁడు. వ్యాకరణశాస్త్రప్రవీణుఁడు. సమర్థుఁడు. సీతాన్వేషణముకొరకు శ్రీరాములవారిపనుపున సుగ్రీవుఁడు వానరులను బంపునపుడు దక్షిణదిక్కున కేగు వారితో నీహనుమంతునిఁ బంపెను. ఆదక్షిణదిక్కున సీతాదేవి యెచ్చటను గానరానందున రామేశ్వరమునందున్న మహేంద్ర

పర్వతముసమీపమునఁ జేరి వానరులు పరితపించుచు ప్రాయోప వేశమునకు సమకట్టియుండఁగా సంపాతి యనువానివలన సీతా దేవిని రావణుఁడు లంకకుఁ గొనిపోయెనని తెలిసికొని వారు సముద్రలంఘనముకొరకుఁ బ్రయత్నించిరి. అపుడు వారిలో హనుమంతుఁడు సముద్రలంఘనము చేయఁగలనని చెప్పి యట్లు చేసి లంకకుఁ బోయి ప్రచ్ఛన్నముగ నర్ధరాత్రమందు సీతా దేవికిఁ గనబడి యామె నోదార్చి శ్రీరాములవారిచే నాన వాలుగ నీయఁబడిన ముద్రికను సమర్పించి యామెకు గల సందేహములను మాన్పి ప్రతియానవాలుగ శిరోమణినిఁ దీసి కొనెను.

ఆపయి నింతదూరము వచ్చిన తనను శ్రీరాములవారు రావణునిసంగతిసందర్భముల నడుగుదురని యెంచుకొని రావ ణునిఁ జూచుతలంపు గలిగి యతనియుద్యానమగు నశోక వనముఁ జెరుపుచుండెను. అపు డతనిమీఁదికి యుద్ధమునకుఁ బంపఁబడినరాక్షసులను గొందరినిఁ జంపి తుదను రావణుని కుమారుఁడగు నింద్రజిత్తుచేత నతఁడు పట్టువడియెను. ఆ యింద్రజిత్తు హనుమంతుని రావణునియెదుటికిఁ దీసికొని పోయెను. అప్పు డారాక్షసరాజుతో దననిజస్థితినిఁ దెలుపుచు బుద్ధులు చెప్పఁగా నతఁడు కోపించి ముందు చంపఁ బ్రయ త్నించి విభీషణునిచే వారింపఁబడి తుదకు దోకకు జమురులో

ముంచిన గుడ్డలు చుట్టి కాల్చుట యను శిక్షతో హనుమంతుని విడిచిపెట్టెను. అంతట నతఁడామండుచుండెడుతోకతో నూరంతయుం దగులబెట్టి తనక్షేమమును సీతకుఁ దెలిపి యామె కుశలమును విచారించి సముద్రమును దాఁటి తన నిమిత్తము కాచికొనియుండినకపులతోఁ గలిసియందరి కానందమును గలిగించెను. సీతను జూచుటకుగా వచ్చి లంకాపురము నంతయు నితఁడు గాల్చినందున (చూచిరమ్మనిన కాల్చివచ్చినావా ?) అనుసామెత యప్పటినుండియు గలిగెను. ఇట్లు వానరులందరు గలిసి శ్రీరాములవారివద్దకుం బోయినపయిని హనుమంతుఁడు శ్రీస్వామివారికిఁ జరిగినవృత్తాంతమును జెప్పి సీతాదేవియొక్క-శిరోమణిని సమర్పించి యతనిహృదయతాపమును బోఁగొట్టెను. యుద్ధమునం దితఁడు జంబుమాలి, ధూమ్రాక్ష, అకంపన, దేవాంతక, త్రిశిరస్క-, నికుంభ, కాలనేమి, మాల్యవంతు లను రాక్షసవీరులనుఁ జంపెను. యుద్ధానంతరమున నయోధ్యకు మరలివచ్చునపుడు శ్రీస్వామివారిపనుపున భరద్వాజాశ్రమమునుండి యీకపిశ్రేష్ఠుఁడు భరతునివద్దకు వెళ్లి శ్రీరాములవారిరాక నెఱింగించి సంతోషమును గలిగించెను. శ్రీరామపట్టాభిషేకసమయమున సీతాదేవి శ్రీస్వామివారిపనుపున నీహనుమంతునకు నమూల్యమైనముక్తాహారము బహుమతి నిచ్చెను. ఇతఁడు శ్రీరామనిర్యాణానంతరము కుశలవుల

యొద్ద మంత్రిగ నుండినట్టు లయోధ్యలోని శ్రీహనుమంతుని దేవాలయమువద్ద గొందరు చెప్పియుండిరి.

౫. వాలి.

ఇతఁడు కిష్కింధాదేశపురాజు. మాయావి యనువానితో దీర్ఘకాలము యుద్ధముచేసి మరలిరానందున నతని తమ్ముఁడు సుగ్రీవుఁ డన్న చచ్చియుండు నని భావించి రాజ్యమును స్వీకరించెను. అప్పటి యాదేశపుప్రజల యాచారము ప్రకారము దనయన్నభార్యయగు తారనుఁ బరిగ్రహించెను. ఇట్లు కొంతకాలము జరిగినపిదప వాలి యాదనుజుని సంహరించి కిష్కింధకు వచ్చి తమ్ముఁడగు సుగ్రీవునిపయిని గోపించి యతనిని బయికి వెడలఁగొట్టి రాజ్యమును భార్యను మరియు నతనిభార్యను స్వీకరించెను. శ్రీరామసుగ్రీవసఖ్యానంతరమున శ్రీరాములవారిచే నీవాలి చంపఁబడెను.

౬. సుగ్రీవుఁడు.

ఇతఁడు తనయన్నయగు వాలి యనంతరమునఁ గిష్కింధ నేలినప్రభు వయి యున్నాఁడు. శ్రీరాములవారిపనుపున నలుదిక్కులకు వానరవీరులను సీతాన్వేషణముకొరకుఁ బంపెను. ఆసహాయులయిన శ్రీరామలక్ష్మణులకు దనయావత్సేనతో సహాయుఁడై లంకకుఁ బోయి రామరావణయుద్ధమునఁ బోరాడి ప్రఘసుఁడు, కుంభుఁడు, మహోదరుఁడు మొదలగురాక్షస

వీరులనుఁ జంపెను. యుద్ధానంతరము శ్రీరాములవారితో వానరవీరులతోఁగూడ నయోధ్యకు వచ్చి శ్రీరామపట్టాభిషేక మయినపిదప వారివద్ద సెలవును బొంది కిష్కింధకుఁ బోయి రాజ్యము నేలుచుండెను.

౭. అంగదుఁడు.

ఇతఁడు వాలికుమారుఁడు. సేతువు దాఁటినపిదప శ్రీరాములవారిపనుపున రావణునియొద్దకు రాయభారముకొరకేగి యనేకనీతివాక్యములను నతనితోఁ జెప్పెను. యుద్ధమున వజ్రదంష్ట్రుఁడు, నరాంతకుఁడు, కంపనుఁడు, ప్రజంఘుఁడు, మత్తుఁడు మొదలగురాక్షసవీరులనుఁ జంపెను. యుద్ధానంతరము శ్రీరాములవారివెంట నయోధ్యకు వచ్చి మరలఁ గిష్కింధకుఁ బోయెను. ఈవానరవీరులలోఁ జాంబవంతుఁడు వృద్ధు. నీలుఁడు సేనాధిపతి. నలుఁడు సేతువు గట్టినవాఁడు. సుషేణుఁడు వైద్యుఁడు.

ఇటుపైని రావణాదిరాక్షసులవిషయమై వ్రాయవలసి యున్నది. గనుక యీవానరు లనువా రెవ్వరో కొంత చర్చించి వ్రాయుట సముచితము. వీరలను సాధారణముగ మనమందరము గ్రంథకర్తతోపాటుగఁ గోతు లని నమ్ముచున్నాము. కోతులే యయియుండినయెడల వారిస్త్రీలకు హస్తపాదాద్యాభరణములను ధరించుట కెట్లు వీ లగును?

కోఁతినిఁ బరీక్షించి చూచినవాఁడు దీనిని నమ్మఁడు. తార మొదలగుస్త్రీలవర్ణనమునుబట్టి యోచింపఁగా వారినిఁ గోతులని యెవ్వరును నమ్మరు. స్త్రీపురుషులు తోకలను మూసి యా మూయకయా వస్త్రములను ధరించిరి? గృహములయం దెట్లు నివసించిరి? వేదశాస్త్రముల నభ్యసించుట ద్విజులు చేయుసంధ్యావందనాదికర్మలను జేయుట కోఁతులేయాధారము పయినిఁ జరిపెను. కావున నట్టివారిని మృగములలోఁ జేరిన కోఁతు లని చెప్పుటకు వీలుపడదు. మరి యేమి యనిన: ఆదిసృష్టిలోఁ దామస, రాజస, సాత్వికు లని ప్రజలలో మూఁడు విభాగము లుండినటుల మనగ్రంథములన్నియు నైకకంఠ్యముగ నొప్పుకొనుచున్నవి. ఈభేద మనునది కేవలము వారివారిదేహవర్ణమునుబట్టి యేరుపడెను. తామసు లనఁగా నల్లనివారు, లేదా? నిండుగ నవివేకులు. రాజసు లనఁగా నెఱ్ఱనివారు లేదా ఒకరితో నొకరు కలహించువారు. సాత్వికు లనఁగా దెల్లనివారు, లేదా నెమ్మదియు నణకువయు గలవారు. పయి మూఁడుతెగలవారు కొంతకాలమువరకు బరస్పరవివాహములు చేసికొనిరి. అప్పుడు శరీరవర్ణమునుబట్టి యుండినభేదము మారిపోయెను. కావున మరియొకమార్పు వారిలోఁ జరగవలసివచ్చి విద్యాధరులు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు, గుహ్యకులు, సిద్ధులు, భూతములు, పిశాచులు, కిన్నరులు




నరులు, వానరులు మొదలగువిభాగము జరిగినది. మఱికొంత కాలముపిదప నేయేదేశములఁ బ్రజలు నివసించుచువచ్చిరో యాదేశములపేరులతోఁ బిలువఁబడుచుండిరి. అనఁగా రాజపుత్రులు, భంగాళీలు, మలయాళీలు మొదలగువారు. రెండవవిభాగమందుఁ జెప్పఁబడిన వివిధనామములకు నర్థములన్నిటిని నిచ్చట విచారించుట యేల? ఇటీవల రెండవవిభాగమునఁ జెప్పఁబడినవిభాగములలోఁ గనుపడనివారిని స్వర్గాదిలోకములలోనివారై యుండినట్లు మనగ్రంథకర్తలు తీసికొనిరి. తదితరులలోఁ గొందరిని నరులుగను, వానరులుగను, రాక్షసులుగను, దయ్యములని మనము సాధారణముగ నమ్ముచున్న భూతపిశాచములుగను దీసికొనిరి. వానరు లనఁగా నడవియందు నివసించుజను లని వాచస్పతినిఘంటువువలనను బ్రౌనుదొరవారి డిక్షనరీవలనను దేఁటపడుచున్నది. కోఁతులును వనమం దుండెడివి. కావున వానికిని వానరశబ్దముఁ గలదు. గనుక గ్రంథకర్త వారినిఁ గోఁతు లని భ్రమసియుండును. కావున నతఁడు వానరులను గోఁతు లని నమ్మియుండుటనుబట్టి కోఁతిరూపమును జేష్టలను బ్రతిచోటను వర్ణించుచుఁ బోయెను. కపిశవర్ణముగలవా రగుటచేత వీరినిఁ గపు లనియెదరు. కపిశవర్ణ మనఁగా నలుపు నెరుపు కలిసినరంగుకు పేరు. దీనినిఁబట్టి యోచింపఁగా నీవానరవీరులు ప్రథమవిభాగమగు తామస

రాజసులమధ్య జన్మించినవారై యుండియుందురు. కేవలము నల్లనివారును నవయవసౌష్ఠవము తక్కువగలవారును రాక్షసులై యుందురు. అయితే ఈవానరులను గోఁతు లని నమ్మని వారు హనుమంతుఁడు సముద్రలంఘనము నెట్లు చేసె ననియు, తనతోఁకకు జుట్టఁబడిన చమురుగుడ్డలమంటతో లంకాదహన మెట్లు చేసె ననియు నిప్పటికిని విష్ణుదేవాలయములలోఁ దోక గల హనుమంతునిఁ నెటుల పూజించుచున్నా రనియు నాక్షేపింపక మానరు. దీనికి సమాధానము :—ప్రతిమతమునందును గొన్ని మతసంబంధమయిన నమ్మకములు గలవు. ఆనమ్మకములను విడుచుకొన్నయెడల నేమతమును నిలువఁజాలదు. అందు మనయార్యమతమున నవి హెచ్చుగ నున్నవి. కావున నట్టివాని నీకాలపువారును నమ్మవలసినదే? ఆమతసంబంధములగునమ్మకములలో నీమీఁదిచర్చకు సంబంధించిననమ్మకములను దీసికొనియెదము. అరుదుగఁ గొందరుమహానుభావులకు గామరూపములను ధరించుశక్తి గలిగియుండును. అటులనే హనుమంతునికిఁ గామరూపశక్తి కలిగియుండును. లంఘనమునకు యోగ్యమైన కోఁతిరూపమును ధరించి మహేంద్రగిరి నుండి సముద్రమును దాఁటియుండును. కోఁతిరూపముతో నుండినందున దోకకు జమురుగుడ్డలు చుట్టి రాక్షసులు కాల్చియుందురు. ఈహనుమంతుఁడు కోఁతిరూపముతోనె శ్రీరామ

దూతకృత్యమగు సీతాన్వేషణాదికమును జరిపియుండినందున నాహూపముతోనే మన మిప్పటికిని దేవాలయములలో నారాధించుచున్నాము. ఇందుకు తప్పుగాని యసందర్భముగాని యేమియు లేదని చదువరులకుఁ బోధపడఁగలదు.

## ౮. విభీషణుఁడు.

ఇతఁడు రావణుని రెండవతమ్ముఁడు. సీతాదేవిని లంకకుఁ దెచ్చినపిదప ననేకపర్యాయములు రావణునితో వల దని హితోపదేశమును జేసెను. చివరకు దనయన్న యెంత మాత్రము తనమాటను వినఁ డనియుఁ, జెడు ననియుఁ దృఢముగఁ దెలిసికొని యతనివలన నవమానమును బొంది నలువురుమంత్రులతో సముద్రమును దాఁటివచ్చి శ్రీరాములవారి సన్నిధిని శరణాగతి చేసెను. ఈశరణాగతివిషయము విష్ణుమతస్థులందరికి నిండా ముఖ్యము. ఇదియే షడంగప్రపత్తి యని చెప్పుదురు. షడంగప్రపత్తికి మోక్షమే ఫల మై యుండవలెను. అట్లు లేదు. అయితే ఇచట లంకారాజ్యలాభమే ఫలముగ గ్రహింపవలసియున్నది. ఆపిదప శ్రీస్వామివారిసన్నిధిని జేరి రాక్షససేనల స్థితిగతులనన్నిటిని మనవిచేసెను. యుద్ధసమయమునందును రావణునికోటలోఁ జరుగుప్రతివిశేషమును మనవి చేయుచువచ్చినందున బ్రతీకారము వెంట వెంటనె చేయఁ

బడుచుండెను. అంతటినుండియే 'యింటిగుట్టు లంకకుచేటే' ను సామెత వాడుకలోనికి వచ్చెను. పూర్వ మాపత్కాలముల యందుఁ గనిష్ఠులగు సోదరులు సహా నీతులు చెప్పు మంచి యాచారము గలదు.

యుద్ధానంతరము శ్రీరాములవారివలన లంకారాజ్యమున కభిషేకింపఁబడి యావిభీషణుఁ డాస్వామివెంట నయోధ్యకు వచ్చి సన్మానమును బొంది తిరుగ లంకకుఁ బోయి రాజ్య మేలుచుండెను.

## ౯. కుంభకర్ణుఁడు.

ఇతఁడు రావణాదిసోదరులు ముగ్గురిలో రెండవవాఁడు. విశేషౌన్నత్యము బలము గలవాఁడు. కాని తిండిపోతు. అతినిద్ర గలవాఁడు. ఇనను యుద్ధమధ్యమున దనయన్నకు రాజ నీతిని విస్తారముగఁ జెప్పెను. రావణునిపనుపున యుద్ధమున కేగి శ్రీరాములవారిచే సంహరింపఁబడెను. శారీరశాస్త్రము నెరుగని యాగ్రంథకర్త కుంభకర్ణునిచే మ్రింగఁబడినవారు కర్ణ నాసికారంధ్రములనుండి బయటికివచ్చుచుండి రని చిత్రముగ వర్ణించెను. ముక్కునకును నోటికిని రంధ్రము గలదు గాని చెవికిలోపల రంధ్రమే లేదు గదా? మ్రింగఁబడినవా రాదారి నెటుల రాఁగలరు?

## ౧౦. రావణుఁడు.

ఇతఁడు లంకారాజ్యమునకు బ్రభువు. బహుపరాక్రమవంతుఁడు. మనదేశమునకు వచ్చి యనేకులగు రాజులను జయించియుండును. దిక్పాలకులను సహా జయించె నని యీగ్రంథకర్త చెప్పెను.

ఇట్టిపరాక్రమము గలవాఁడైనను బరస్త్రీలోలుఁ డయి చాలమంది సుందరులగుస్త్రీలను దెచ్చిపెట్టుకొనెను ఇట్లు కొంతకాలము జరిగినపిదప దనచెలియలగు శూర్పణఖవలన నరణ్యావాసమునం దున్న సీతాదేవియొక్క సౌందర్యమునుఁ దెలిసికొని యచటి కేగి ప్రచ్ఛన్నవేషమును దాల్చి శ్రీరామలక్ష్మణులు లేనిసమయమున సీతాదేవియొద్దకు భిక్షుకునిరూపమున నేగి యామె నెత్తుకొని లంకకుఁ బోయెను. అచ్చట నాదేవి యతనికి వశ్యురాలు కానందున నామె నశోకవనమున నుంచి స్వాధీన మగుటకొరకు రాక్షసస్త్రీలచే శ్రమపరచుచు వచ్చెను. ఇట్లు సుమారు పదిమాసములకాలము జరిగినపిదప శ్రీరాములవారు వానరసేనతో వచ్చి లంకాపట్టణమును ముట్టడించిరి. అప్పుడు రావణుఁడు శ్రీరాములవారిచే రాయభారమునకయి పంపఁబడిన యంగదుని నిరాకరించి సేనలను విభజించి నాలుగుదినములవరకు ననేకరాక్షసవీరులను యుద్ధమునకుఁ బంపెను. వారందరు హతు లైనపిదప నైదవనాఁడు

రాక్షససేనాధిపతియగు ప్రహస్తుఁడు యుద్ధమునకు వచ్చెను. అతఁడును వానరసేనాధిపతియగు నీలునిచేఁ జంపఁబడెను. అందుకు రావణుఁడు కడు దుఃఖితుఁ డయి మూలబలమును దీసికొని తానే యుద్ధమునకు వచ్చి శ్రీరాములవారితో యుద్ధము చేసెను. అపుడు శ్రీరాముని బాణముల దెబ్బకు జడిసి యూరకయుండఁగా నట్టివానినిఁ జంపుట తగ దని శ్రీరాముల వారు తలఁచి యతనిని శ్రమ దీర్చికొని మరుచటినాఁడు రమ్మని చెప్పి పుచ్చిరి. ఏడవనాఁటియుద్ధమున రావణుఁడు తన తమ్ముఁడగు కుంభకర్ణుని యుద్ధమునకుఁ బంపెను. అతఁ డనేక వీరులతో యుద్ధముచేసి తుదను శ్రీస్వామి వారిచే సంహరింపఁ బడెను. ఎనిమిదవనాఁటియుద్ధమున లక్ష్మణస్వామి యతికా యునిఁ జంపెను. ఈయతికాయుఁడు రావణునికుమారుఁడు. నీతిమంతుఁడు. రావణునిమంత్రులలో నొకఁడు.

తొమ్మిదవనాఁ డింద్రజిత్తు మూడవసారి యుద్ధమునకు వచ్చెను. ఇతఁడు రావణుని పట్టమహిషియగు మండోదరికి జన్మించినవాఁడు కావున యువరాజు అప్పు డనేకులగువీరు లతో నేర్పుతోను వేగముతోను యుద్ధముచేసి తుదను లక్ష్మణ స్వామిచేఁ జంపఁబడెను.

రావణుఁ డింద్రజిత్తుచావునకు దుఃఖించి పదియవనాఁ డతికోపముతో రెండవసారి యుద్ధమునకు వచ్చెను. ఇట్లు

వచ్చి లక్ష్మణస్వామిని మూర్ఛితునిఁ జేసెను. అపుడు శ్రీరాములవారు కోపించి తీవ్రశరములను రావణునిమీఁద వేయఁగా నతఁడు వానికి సహింపలేక యుద్ధభూమినుండి మరలిపోయెను.

పదునేకండవనాఁడు రావణుఁడు శత్రువిజయముకొరకు పాతాళహోమమను నొకదానినిఁ జేసినట్లును, నాహోమమునకు విఘ్నముచేయుటకయి వానరులేగిరనియు నామీఁద రావణుఁడు మూడవసారి యుద్ధమునకు వచ్చెననియుఁ జెప్పఁబడి యున్నది. నాఁడు రామరావణయుద్ధము కడుభయంకరముగఁ జరిగెను. తుదను శ్రీస్వామివారిచే వేయఁబడినబ్రహ్మాస్త్రముచే రావణుఁడు హతుఁడాయెను.

ఈరావణునకు దశకంఠుఁడనియు వింశతిభుజుఁడనియు వాడుక కలదు. అట్టి యాకారముతోనే యిప్పటికిని నీశ్వరునికి వాహనముగ వేంచేయింపు జరుగుచున్నది. ఒక్కశరీరమునకు బదితలలును నిరువదిచేతులును నెట్లుండును. అట్లుండిన శరీరికి సౌఖ్యమును సదుపాయము నెట్లుకలుగును. కావున నీయసంభావిత మెట్లు కలిగినదో విచారింపవలసి యున్నది. హనుమంతుఁడు లంకలో వెదకునపుడు స్త్రీలమధ్యమున రావణుఁడు రెండుబాహువులును, నొక్కతలయును గలవాఁడయి నిద్రించుచున్నట్లు చెప్పఁబడి యున్నది.

రామాయణసుందరకాండ పదియవసర్గము 21-22.

శ్లో॥ దదర్శ సకపిస్తస్య బాహూశయనసంస్థితౌ।
మందరస్యాంతరేసుప్తౌ మహాహీరుషితావివ॥
తాభ్యాంసపరిపూర్ణాభ్యాం భుజాభ్యాంరాక్షసేశ్వరః।
శుశుభేఽచలసంకాశః శృంగాభ్యామివమందరః॥

24-25. తస్యరాక్షససింహస్య నిశ్చక్రామమహాముఖాత్।
శయానస్యవినిశ్వాసః పూరయన్నివతద్గృహమ్॥
ముక్తామణివిచిత్రేణ కాంచనేనవిరాజితమ్।
మకుటేనాపవృత్తేన కుండలోజ్జ్వలితాననమ్॥

ఇచట వ్యాఖ్యానకర్తలు రావణుఁడు కామరూపి కావున నేకశిరస్సును ద్విబాహువులును గలిగియుండుట స్త్రీలవినోదముకొరకని నవరించిరి. సదుపాయముకొరకే కశిరస్సుండుట బాగే, అనేక స్త్రీలతో విహరించువాని కనేకములగుచేతు లుండుట, వారితో వినోదము లాడుట కుపయోగమే కదా? కావున నాసవరణను మన మొప్పఁగూడదు.

ఇందునుబట్టి రావణునకు నేకశిరస్సును ద్విబాహువులును గలవని స్పష్టపడుచున్నది. రావణునితల కొట్టఁబడినపిదప మొలచినతలను వరుసగ గొట్టినట్లు స్పష్టముగ రామాయణమున నున్నది.

ఈ గ్రంథకర్త రావణునికి బదితలలు గలిగియున్నవని నమ్మియున్నందున నాపదితలలును బదిపర్యాయములు కొట్టి నట్లు అనఁగా నొకనూరుతలలు కొట్టఁబడినట్లు వ్రాసియుండెను. కాని హస్తములవిషయ మేమియు నెత్తుకొనలేదు. పదితలలు గలవానికి నిరువదిచేతు లుండవా? యని తలఁచి రావణుఁడు వింశతిభుజుఁ డని గ్రంథములో నచ్చటచ్చట వ్రాసెను. ఒక్కటే శిరస్సు కల దని నమ్మియుండినయెడల దానినిఁ బది పర్యాయములే కొట్టె నని నిజముగ జరిగినది జరిగినట్టే వ్రాసి యుండవలసివచ్చును. కాని యితనికి దశకంఠుఁ డని పౌరుష నామ మేల కలిగినదో చూతము. రావణునివధనాఁడు శ్రీ స్వామివారిచే వేయఁబడినబాణములవలనఁ దొమ్మిదిపర్యాయ ములు తలలు దెగఁగొట్టఁబడుచు దిరుగ మొలచుచుండుటనుఁ జూచి దివ్యాస్త్రమువలనఁగాని యితఁడు చావఁడని శ్రీస్వామి వారు తలఁచి బ్రహ్మాస్త్రమును బ్రయోగించి సంహరించిరి. ఇట్లు తలలు మొలచుట యేదో యొకవరప్రభావమైయుండును. వరప్రభావముగూడ మతసంబంధములగు నమ్మకములలో నొక టియై యున్నది. ఇట్లనే కార్తవీర్యార్జునుని బాహువులను శ్రీపరశురాములవారును, బాణాసురుని బాహువులను శ్రీకృష్ణ స్వామివారును, దెగఁగొట్టియుందురు. మరియు నీరావణునికిఁ దశకంఠుఁ డను పేరు వానిసంహారమునకు ముందే యెట్లు

గ్రంథమున వాడుక చేయఁబడె నని శంక గలుగును. పౌరుష నామములన్నియు నాయాపనులు జరిగినపిదప వాడఁబడును. అట్టివారిచరిత్రలు వారియనంతరమునందు వ్రాయఁబడును. స్వచ్ఛందమరణునికి మరణానంతరమునగాని, యీపేరు రాదు కదా? అట్లనే యీరావణున కానామములు ప్రయోగింపఁ బడెను.

## ౧౧. శ్రీరాములవారు.

శ్రీమన్నారాయణుఁడు రావణాదిదుష్టులను సంహరించి తద్ద్వారా శిష్టరక్షణము చేయుకొరకు దశరథమహారాజునకుఁ జ్యేష్ఠభార్యయగు కౌసల్యయందుఁ జ్యేష్ఠకుమారుఁడై యవతరించెను. ఆయనకు వశిష్ఠమహర్షి శ్రీరామనామము నుంచెను. సుమిత్రయను రెండవభార్యయందు లక్ష్మణశత్రుఘ్నులు కవలుగ జన్మించిరి. మూడవభార్యయగు కైకేయియందు భరతుఁడను కుమారుఁ డుదయించెను. వీరిలోఁ బాల్యము మొదలు రామలక్ష్మణులు మైత్రి గలిగి యుండిరి. అట్లనే భరతశత్రుఘ్నులు నుండిరి.

ఇట్లు వీరు దినదినప్రవర్ధమానులై యుండఁగా నొక నాఁడు విశ్వామిత్రమహర్షి దశరథమహారాజుకడ కేతెంచి తానుఁ జేయు నొకగొప్పయాగమునకు రావణునిభటులగు మారీచసుబాహులను వారు పలుమారు విఘ్నములు చేయు

చున్నందున నాయాగరక్షణార్థము తనవెంట శ్రీరాములవారినిఁ బంపుమని కోరి యందువలన విశేషమగుమేలు సమకూడునని పలికెను. అపు డామహారాజు జ్యేష్ఠుఁడును ధర్మప్రధానుఁడు నగు నాబాలునిఁ బంప వెఱచెను. అందుకు విశ్వామిత్రుఁడు కడుం గుపితుఁడు కాఁగా వశిష్ఠమహర్షి యామహారాజుతో భయములే దనియు విశ్వామిత్రునివలనఁ దివ్యాస్త్రాదిలాభము గలుగు ననియు బోధించినపిదప నామహారాజు రామలక్ష్మణుల నుభయులను బిలిపించి విశ్వామిత్రునివెంటఁ బంపెను. ఇట్లు వారు ముగ్వురు నేగుచుండఁగా శ్రీరాములవారు తాటకయను దుష్టురాలిని సంహరించిరి. ఆయాఁడుదానిం జంపుటకు సంశ యింపఁగా విశ్వామిత్రుఁడు దుష్టులగుస్త్రీలను సంహరించు టచేఁ బాపములేదని పూర్వము జరిగినకథలను జెప్పి చంపు మనఁగా నయోధ్యను విడుచునపుడు తమతండ్రివలన విశ్వా మిత్రుఁడు చెప్పినదానినంతయు జేయు మని యాజ్ఞాపింపఁబడి యున్నందునను శ్రీరాములవా రాతాటకను సంహరించిరి. అట్లు కేవలభుజబలమువలనఁ దానిని సంహరించిన శ్రీస్వామి వారిని మెచ్చుకొని వారికి దివ్యాస్త్రముల నామహర్షి యుపదే శించెను. వానిని శ్రీరాములవారు లక్ష్మణున కుపదేశించిరి. ఆపిదప యాగభంగము చేయుటకు వచ్చినమారీచసుబాహు లతో శ్రీరాములవారు యుద్ధము చేసిరి. అందు మొదటి

వాఁడు రామబాణములకుఁ దాళఁజాలక తప్పించుకొనిపోయెను. రెండవవాఁడు హతుఁడయ్యెను.

అక్కాలమునఁ జనకమహారాజుచేఁ జరుపఁబడుచున్న యజ్ఞమును జూచుటకును నామహారాజుయొద్దనున్న యీశ్వర ధనుస్సును గాంచుటకును విశ్వామిత్రునివెంట శ్రీరామలక్ష్మణులు మిథిలాపురమున కేగిరి. ఆకుమారుల నామహారాజు చూచి వీ రెవ్వ రని విశ్వామిత్రుని నడుగ 'వీరు దశరథమహారాజు కుమారులు, ధార్మికులు, ధనుర్విద్యయందు నేర్పుగలవారు, నీయింట నున్న శివధనుస్సును జూడ నభిలాషముగలవారై వచ్చి' రని యతఁడు చెప్పఁగా నామహారాజు చాల యానందించి యాధనుస్సునుఁ దెప్పించి దీనిని శ్రీరాములవా రెక్కువెట్టిన యెడల వీర్యశుల్కగా నిచ్చుటకు శపథము చేసియున్న తనకుమార్తెయగు సీతాదేవి నిచ్చెద నని చెప్పెను. అవుడు శ్రీరాములవా రతిసులభముగ దాని నెక్కువెట్టుతరి నది నడిమికి విరిగిపోయెను. దానిం జూచి జనకమహారాజు చాల మెచ్చుకొని సీతాదేవిని శ్రీరామునకు సమర్పించెద నని పలికెను.

• ఆపయిని దశరథునకు శుభలేఖ నంపఁగా నామహారాజు భార్యలతోను భరతశత్రుఘ్నులతోను వశిష్ఠాదిపరివారము తోను గలిసి మిథిలానగరమునకు వచ్చెను. అంతటఁ జనక

మహారాజు సీతాదేవిని శ్రీరాముల వారికిని, రెండవపుత్రికయగు నూర్మిళను లక్ష్మణస్వామి వారికిని, దనతమ్మునికుమార్తెలగు మాండవీశ్రుతకీర్తులను వరుసగ భరతశత్రుఘ్నులకును నిచ్చి యేక కాలమున నతివిభవముతో వివాహము చేసెను.

భర్త సంచరించువిధమునకు శ్రీరాముల వారును, భార్య ప్రవర్తించురీతికి సీతాదేవియు, సోదరులను వర్తించుటకు లక్ష్మణస్వామియు, భక్తికి భరతుఁడును, నిదర్శకులయి ప్రవర్తించిరి.

ఇట్లు వివాహములు జరిగినపిదప దశరథమహారాజు కుమారులతోను కోడండ్రతోను బరివారముతోను నయోధ్యాపురము జేరి సుఖముగ నుండెను.

ఈతీరున గొన్ని సంవత్సరములు జరిగినపిదప భరతుఁడు శత్రుఘ్నసహితుఁడై మాతామహుఁడగు కేకయరాజుపురమున కేగియుండఁగా దశరథమహారాజు తాను మున్ను కైకేయి కిచ్చినవరమును దలఁచి భరతుఁడు లేని యిదియే సమయమని యెంచి శ్రీరాముల వారికిఁ బట్టాభిషేకము జేయఁ బూని వశిష్ఠమహర్షిచే నందుకు ముహూర్తమును నిర్ణయింపించి సంభారములు సిద్ధపరచి మరునాఁడు చేయ సమకట్టియుండెను. ఆనాఁటిరాత్రి కైకేయి తనకు ముందు భర్తచే నీయఁబడినవరముల నడుగుటవలన మరునాఁడు జరగవలసిన శ్రీరామపట్టాభిషేకము నిలిచిపోయెను. ఈవరములవిషయము దశరథమహా

రాజుచరిత్రమున విపులముగ విమర్శింపఁబడి యున్నది. ఆహా! ఏమిచిత్రమో కాని వశిష్ఠునివలన నుంపఁబడిన పట్టాభిషేక ముహూర్తముప్రకారము జరగకపోవుటయే కాక శ్రీరాముల వారి కతిశ్రమకరమగునరణ్యవాసము పదునాలుగువత్సరముల కాలము సంభవించెను. సర్వజ్ఞులని మనచే నమ్మఁబడియున్న మహర్షులలో నొక్కఁడగు నీవశిష్ఠుని సర్వజ్ఞత్వవిషయము విచారింపవలసి యున్నది. సర్వజ్ఞత్వమే యతనికి గలిగి యున్నయెడలఁ బట్టాభిషేకము గానేరదని ముందే చెప్పి యుండవలెను. లేక, పురోహితుఁడని యనుకొంటిమా, కైకను దనతండ్రియింటికిఁ బంపఁబడుదానినిగాఁ జేసియుండ వలెను. కావున మహర్షులకు గలసర్వజ్ఞత్వమునకు గొంత పరిమితి గలిగియుండక తప్పదు. తా నెఱిఁగియున్నవిషయముల లోను స్థలములలోను గతవర్తమానకార్యములను దెలిసికొను నట్టి దివ్యజ్ఞానము తపోమహిమవలన వారికి గలిగియుండును. అదియైనను యోగశక్తిని బట్టి వచ్చిన ధ్యానప్రభావముచే గలుగునదియే కాని యెల్లప్పుడు నుండునదియును గాదు. సమస్తగోళములయందును సర్వకాలములయందును, సర్వ విషయములయందును వ్యాపించియుండు పరమేశ్వరుని సర్వ జ్ఞత్వము తదితరులకు గలిగియుండునా? వశిష్ఠునకు దెలియనిది యుండునా? తెలిసియు నూరకయుండె నని కొందర రను

వచ్చును. శ్రీకృష్ణులవారు కాని కార్యమున కెందుకు వచ్చితి రని విదురునిచే నడుగఁబడి హితకార్యమునకుఁ బ్రతివాఁడును బ్రయత్నింపఁ బూనవలసినదనియు, నట్లు చేయనియెడల బాతిత్యము సంభవించుననియు, గార్యకారి కాకపోయినను నట్టిప్రయత్నమునకు ముందు ఫలము గల దనియు, సెలవిచ్చి యున్నారు. జగదీశ్వరుఁడే మేలుకొఱకుఁ బ్రయత్నించినపుడు వశిష్ఠుఁడుమాత్ర మేల ప్రయత్నించియుండఁగూడదు? కావునఁ బట్టాభిషేకవిఘ్నవిషయ మాఋషికి ముందుగఁ దెలియదని తేటపడఁగలదు.

మఱియు నిప్పటికాలపువారివలె గాక తారలనుమా త్రము చూచువాఁడుక గలదినముల నాటివాఁడగు వశిష్ఠుఁడు శ్రీస్వామివారికిఁ బట్టాభిషేకమునకు సంపత్తారను నిర్ణయిం చెను. వారికి రాజ్యలాభసంపద పోవుటయే కాక వనవాస కష్టము, భార్యావియోగము, రావణాదివీరులవధవలని శ్రమ యు, సంప్రాప్తమాయెను.

ఆమరునాఁటియుదయమున శ్రీరాములవారినిఁ బిలిపించి దశరథుఁడు దుఃఖమువలన గైకేయి కిచ్చినవరములవిషయమును జెప్పలేకయున్నపు డాదేవి శ్రీరాములవారితో 'నీవు పదు నాలుగుసంవత్సరము లరణ్యవాసము చేయునటులను భరతుఁడు రాజ్య మేలునటులను నాకు నీతండ్రి వర మిచ్చె' నని తెలి

పెను. అవుడు శ్రీస్వామివా రరణ్యమున కేగెద నని తండ్రి యెదుట నెప్పఁగొని తల్లియగు కౌసల్యయొద్దకు సెలవుఁగొం దుట కరుగఁగా నచట లక్ష్మణస్వామివా రి ట్లనిరి:—

గీ. "విషయపరతంత్రుఁడై ధర్మవిధికిఁ దప్పి
మది ననారత మిది కార్య మిదియకార్య
మని యెఱుంగక వర్తించునతఁడు తండ్రి
యైనఁ గడువధ్యుఁడని పల్కి రార్య లధిప.

క. జనపతి నీదగురాజ్యముఁ
గొనుటకు నేబలము? పిదప గుణహీనతఁ దా
మును గొని యేకారణమున
దనమదిఁ గైకేయి గొసఁగఁ దలచె మహాత్మా"

ఇ ట్లనేకవిధములఁ జెప్పఁగా నవుడు శ్రీరాములవారు సెలవిచ్చినదానిలో ముఖ్యాంశ మేమి యనిన:—

గీ. "ధరణిఁ బురుషార్థములలోన ధర్మ మెక్కు
డట్టిధర్మంబునందు సత్యంబు నిలిచి
యుండు నన్నిఁటికంటె సత్యుత్తమంబు
గురునియానతి నడచుట గురుగుణాఢ్య.

కావున నేను బితృశాసనంబునఁ గైకేయిచేతఁ బ్రచోది తుండ నైతి నింకఁ దానిఁ గడవంజాల నీవ శుభం బైనక్షత్ర ధర్మంబునందు బుద్ధిఁ జొరనీక తీక్ష్ణస్వభావంబు విడిచి పరమ

శ్రేయోనిష్ఠమైన మద్బుద్ధి ననుసరింపుము" అని సెల విచ్చిరి. తల్లియొద్ద సెలవుఁ గైకొని శ్రీరాములవారు తమనగరున కేగి యరణ్యవాసవిషయమును సీతాదేవితో సెలవీయఁగా నా యమ తానుఁగూడ వెంట వచ్చెద నని యతినిర్బంధము చేసి నందున నందుకు దుద కీయకొనిరి. స్త్రీని వెంటఁదీసికొని వెళ్లినందుచేతనేకదా సీతావియోగాదికము శ్రీస్వామివారికి సంభవించెను. సర్వజ్ఞుఁడును సర్వేశ్వరుఁడును నగు నాయనకు దుఃఖము లేకపోయినను దదితరు లట్లు భార్యను వనమునకుఁ దీసికొనిపోయినయెడల నాపదలు రాక మానవు. సమీపమున నపు డున్న లక్ష్మణుఁడు తానుగూడ వెంట వచ్చెద నని బహువిధములఁ బ్రార్థింపఁగా నందు కంగీకరించి సీతాలక్ష్మణ సహితులై శ్రీరాములవారు తండ్రియొద్దకుఁ బోయి సెలవు గైకొని పురజనులందఱు దుఃఖసముద్రమున మునిఁగియుండ, నారచీరలు ధరించి యరణ్యవాసమునకుఁ బయలుదేరి వెడలిరి. సుమంత్రుఁడు గంగానదియొద్దువరకు రథసారథిగా నరిగి గుహుఁడు వారినోడతో గంగ దాటించినపిదప మూఁడుదినములవరకు నానదీతీరమునఁ గాచియుండి, యయోధ్యకు రథమునుఁ దోలుకొనివచ్చి దశరథున కావృత్తాంతమును దెలిపెను.

రామవియోగవిషాదమువలన నాటిరాత్రియే యామహారాజు పరలోకగతుఁ డాయెను. సన్నిధిని గుమారు లెవ్వరును

లేనందున మంత్రులు యోచించి యాక ళేబరమును భద్రపరచి మాతామహుని యింటనున్న భరతునిశత్రుఘ్నునితో రప్పించిరి. అట్లు వచ్చి భరతుఁడు దహనాదిసంస్కారములు యథావిధిగ జరిపెను. అప్పటియాచారమువలననే యిక్కాలమునను యూరపుఖండపురాజులకళేబరములను బంధువులందఱు వచ్చువరకు ఖననము చేయక యుంచుటఁ గలదు.

స్వల్పదినములక్రిందట నరణ్యవాసమున కేగిన జ్యేష్ఠ కుమారులగు శ్రీస్వామివారినిమిత్తము మనుష్యులను బంపక యేడుదినముల ప్రయాణముగల మాతామహుని పురమున నున్న భరతుని నేల వశిష్ఠాదులు రావించి రని కొందఱికిఁ దోఁచును. శ్రీస్వామివారికొరకు మనుష్యుల నంపకపోవుటకు రెండుకారణములు గలవు:— 1. రాజ్యమును విడుచుకొని పదునాలుగుసంవత్సరము లరణ్యమునందే కాని యేపట్టణము నందును వసింపనని చెప్పిపోయిన శ్రీస్వామివారు గా రనియు, 2. చిత్రకూటపర్వతము దాటి యేప్రక్కకు వారు పోయిరో యామార్గమును దూతలు తెలిసికొనుట దుర్లభ మనియు వీనిని యోచించి నిర్దిష్టమైనస్థలమునం దున్న భరతశత్రుఘ్నులను బిలువనంపియుందురు.

భరతుఁడయోధ్యాపురముఁ జేరఁగనే తనతల్లివలనఁ దండిమరణమును, అన్నయొక్క వనవాసగమనమును విని, తమ్ముని

తోఁగూడ దుఃఖించి తల్లిని నిందించి తండ్రికి నుత్తరక్రియలను సలిపి వశిష్ఠునివాక్యప్రకారము రాజ్యమును స్వీకరింపనొల్లక యారాజ్య మేలుటకు శ్రీరాములవారే యర్హులని నిశ్చయించి వారియొద్దకుఁ బోయి ప్రార్థించి తీసికొనివచ్చుటకయి పరివార సహితుఁడై కదలెను. ముందు సుమంత్రునివలన చిత్రకూటాద్రివరకు శ్రీస్వామివారేగినట్లు తెలిసికొనియున్నందున చిత్రకూటాద్రిఁ జేరెను. శ్రీరాములవారికొరకు సపరివారముగాఁ బోవుచున్న భరతునిఁ గంగానదియొద్దున గుహుఁడు చూచి శ్రీస్వామివారియందు గల మిత్రభావముచే వారికిఁ గీడు చేయునేమో యని శంకితుఁడై భరతునిఁ గంగానది దాటుట కాటంకపరుపఁ బ్రయత్నించెను. అపు డాతనివలన నిజస్థితినిఁ దెలిసికొని పరివారసహితముగా నతనిని గంగానదిని దాటించి పంపెను. ఇట్లు పరివారసహితుఁడై వచ్చుచున్న భరతుని లక్ష్మణస్వామివారు చిత్రకూటాద్రిపయినుండి దూరమునఁ జూచి, వచ్చువాఁడు భరతుఁడని తెలిసికొని శ్రీస్వామివారి కపాయము చేయఁబూని వచ్చుచున్నాఁడని భ్రమసి శ్రీరాములవారితోఁ 'భరతుఁడు నీమీఁదికి యుద్ధమునకు వచ్చుచున్నాఁడు సిద్ధుఁడవు గమ్ము నేను ముందుగ సేనను దగిలి యుద్ధముచేసి భరతాదులను సంహరించెద' నని మనవి చేసెను. అపుడు శ్రీస్వామివారు భరతునకు నామీఁద గల

భక్తిని నీవెఱుఁగ వనియు నేను నీ కారాజ్యము నిమ్మని చెప్పిన యెడల భరతుఁ డిచ్చు ననియు సమాధానపరచిరి. అంత శ్రీ భరతశత్రుఘ్నులు దూరమున రథము డిగి పాదచారులై సన్నిధిఁ జేరి శ్రీస్వామివారిపాదములకు భక్తిలజ్జాశోకపరవశులై సాష్టాంగవందనము చేయ వారలను బ్రీతిపురస్సరముగ నెత్తి కౌఁగిలించుకొనిరి. అపుడు భరతునిం జూచి తండ్రియగు దశరథుని నేల యొంటరిగ విడిచి వచ్చితి వనియు, తండ్రియుఁ దల్లులు సుఖముగ నున్నారా? యనియు వారిని నిత్యమును యథావిధిగ బూజించుచున్నావా యనియు, నని యనేకరాజ్యాంగవిషయకప్రశ్నముల నడిగిరి.

తండ్రియొక్క క్షేమమునకుగా భరతు నడిగినప్రశ్నమునకు నుత్తరమును దీసికొనక రాజధర్మములను దెలుపుప్రశ్నములను విపులముగ నేల యడిగిరో విచారింపవలసి యున్నది. ఇపుడు భరతుఁడు శ్రీస్వామివారియొద్దకు వారినిఁ బ్రార్థించిన పయిని దప్పక వారు రాజ్యమును స్వీకరింతు రనెడు నమ్మికతో వచ్చియున్నాఁడు. రాజ్యమును స్వీకరింప నని చెప్పిన పిదప నతనిమనస్సు వికలమై యుండును. అపు డీరాజధర్మవిషయములు బాగుగ మనస్సునందు బట్ట వని శ్రీస్వామివారు తలఁచియు జగదీశ్వరుఁడు గావున దండ్రివిషయము తెలిసియే యుండుటచే నావిషయమున కుత్తరమును విన్నపిదప మానవ

శరీరముతోనున్న యీస్వామివారు కొంత దుఃఖింపవలసి యుండును. కావునఁ దండ్రివిషయమునను భరతుఁ డుత్తరము చెప్పకముందే రాజధర్మములను బ్రశ్నరూపముగఁ బోధించి రని మనము నిశ్చయింపవచ్చును.

ఇట్టిసర్వజ్ఞునకు రావణవధాత్పూర్వము జయముకొఱకు నగస్త్యుఁడు సూర్యు నారాధింపు మనె నఁట. మాతలి బ్రహ్మాస్త్రము నేయు మని యాది చేసెనఁట ఏమివింత?

ఈవిధమున శ్రీరాములవారు రాజధర్మముల నడిగిన పిదప భరతుఁడు తండ్రిమరణమును దెలిపెను. అప్పుడు శ్రీస్వామివారు చేయఁదగినయుత్తరక్రియలను జరిగించిరి. పిమ్మట భరతుఁ డనేకవిధముల బలుమారు రాజ్యమును స్వీకరించి యేలు మని శ్రీస్వామివారినిఁ బ్రార్థించెను. అందుకు శ్రీస్వామివారు తండ్రిచే నియోగింపఁబడిన యరణ్యవాసము పూర్తియగువరకు నయోధ్యాపురమునకు ఖండితముగ రాననియుఁ నంతవరకు నీవే రాజ్యము నేలు మనియు, తండ్రియగు దశరథుని నసత్యవంతునిగాఁ జేయఁగూడ దనియు, ధర్మయుక్తముగాను యుక్తియుక్తముగాను సెలవిచ్చి భరతునిఁ దుదకు నొప్పించిరి. అప్పు డాభరతుఁడు తాను వెంటఁ దెచ్చిన శ్రీరామపాదుకలను సింహాసనమునందు వారికి బ్రతినిధిగ నుంచుకొని తానొకమంత్రివలె బ్రజలను బాలించుట కనుజ్ఞ నిప్పింపుమని

శ్రీస్వామివారినిఁ బ్రార్థించి యటుల ననుజ్ఞఁ గైకొని పరివార సహితుఁడై కదలి యయోధ్య కేగక దాని సమీపమున నుండు నందిగ్రామమున నాపాదుకలను సింహాసనమున నునిచి రాజ్యమేలుచుండెను.

అప్రయత్న సిద్ధమైన రాజ్యమును స్వీకరింపక భరతుఁడు తన యన్నయందుగల భక్తివలన నాయననే యీ పదునాలుగు వత్సరములుగూడ నేలుమని ప్రార్థించుటయు, నందుకు శ్రీరాములవా రొప్పనిపిదప వారి పాదుకలను వారికి బ్రతినిధిగఁ గైకొని సింహాసనమున నునిచి యభిషేకించి తాను మంత్రివలె రాజ్యము నేలుచుండుటయు మిగుల శ్లాఘ్యము. అది మొదలుగ బాదుకల నారాధించు మతాచార మేర్పడినది.

భరతుఁ డరిగినపిమ్మట శ్రీస్వామివారు చిత్రకూటమును విడిచి యత్రిమహాముని యాశ్రమమును జేరి యచటినుండి దండకారణ్యము ప్రవేశించి ముందుగ విరాధుఁడను రాక్షసుని జంపి శరభంగమహాముని యాశ్రమమును బ్రవేశించిరి. అచట వాలఖిల్యాది మహర్షులు తమకు రాక్షసులవలన గలుగుచున్న బాధలను వారింపుమని కోరగా నట్లు చేయుదుమని సెలవిచ్చి సుతీక్ష్ణ మహాముని యాశ్రమమును జేరిరి. అచటినుండి యనేక మునుల యాశ్రమములను జూచుచు నట్లు పదిసంవత్సరముల వరకు గాలమును గడిపి తిరుగ సుతీక్ష్ణమహాముని యాశ్రమ

మును జేరి యతనితో గలిసి యగస్త్యుని యాశ్రమమున కేగిరి అచటఁ గొన్ని దినములుండి యాయన యనుమతిని బంచవటీని జేరి యచట నొకపర్ణశాలనుఁ గట్టుకొని నివసించియుండిరి. అటులున్నతరిని రావణాసురుని చెల్లెలగు శూర్పనఖ శ్రీస్వామి వారిని జూచి మోహించి యందుకు వా రంగీకరింపక పోవుట చే నిముఖురాయె జనస్థానమునందున్న ఖరునియొద్దకు బోయి తాను శ్రీరాములవారివలన నవమానిత నైతినని తెలిపి వానిని యుద్ధమునకుఁ బురికొల్పెను. ఈ సందర్భమున రామలక్ష్మణులు కొంతవరకు దానితో సల్లాప మాడినట్లును, కొనను రాముల వారిచే బ్రేరితుఁడై లక్ష్మణుఁడు దాని ముక్కు సెవులుఁ గోసి నట్లును, నొకకథ గలదు. సంగతి సందర్భములనుబట్టి దానితో సల్లాప మాడినట్లు తోచదు. స్త్రీ యగు దానిముక్కు సెవులు గోయుమని శ్రీస్వామివారు చెప్పియుందురా? మోహపరవశ యగుస్త్రీకి దాని కోరిక తీర్పఁబడనియపుడు కల్పితకారణము లనేకములు తనవిరోధమునుఁ దీర్చికొనుటకుఁ బ్రకటించుటఁ గలదు.

ఆపిదప ఖరాసురాదులు శ్రీస్వామివారిమీదికి యుద్ధమునకు వచ్చుటయుఁ జచ్చుటయుఁ జరిగెను. అంత శూర్పనఖ క్రోధముతీరక రావణునియొద్దకుబోయి పరస్త్రీ లోలుఁడగు నతనితో సీతాదేవియొక్క సౌందర్యాదివిషయములను జెప్పి

మోహపరవశునిగ జేసెను. అపు డా రావణుఁడు మాయా వంతుఁడును గామరూప శక్తిగలవాఁడును నగు మారీచుని కడ కేగి నే బూనుకొన్న పనికి సహాయుఁడవు గమ్మనియు నీవు చిత్రమృగరూపమును దాల్చి రాముఁడుండు పర్ణశాలకు సమీపమునఁ దిరుగుచున్న యెడల నిన్నుఁబట్టుటకు రామలక్ష్మణులు ప్రయత్నింపుదురు. అప్పుడు నేను సీతనుఁ గైకొనివచ్చెద ననియు జెప్పి యొప్పించెను. అ ట్లీమారీచుఁడు చిత్రమృగ రూపమునుదాల్చి పర్ణశాలసమీపమున దిరుగుచుండఁగా సీతా దేవి యామృగమును జూచి దాని నెటులైనఁ బట్టుకొని తెచ్చిన యెడల దాను దానినిఁ బెంచెదనని కోరఁగా లక్ష్మణుఁడు వల దని చెప్పినను శ్రీస్వామివారు మృగ మైనఁ బట్టి తెచ్చెద ననియు రాక్షసుఁడైన సంహరించి వచ్చెదననియు బ్రత్యుత్తర మిచ్చి భార్యాసంరక్షణముకొరకు లక్ష్మణు నాశ్రమమున నునిచి యా మృగముకొఱ కేగిరి. ఆమృగము చేతికి దొరకునట్లు తిరుగుచు శ్రీస్వామి వారినిఁ గడుదూరము దీసికొనిపోయెను. అంతట క్ష్మణుఁడు చెప్పినట్లు రాక్షసుఁడే యని నిశ్చయించి బాణ ముతో గొట్టిరి. తోడనె యా మారీచుఁడు హా లక్ష్మణా! హా ...తా! యని యరచుచు జచ్చెను. ఆమాటలను సీతాదేవి విని శ్రీ ...మివారి కపాయము వచ్చియుండునని భ్రమసి వారికి సాయముకొ ...గ లక్ష్మణుని బొమ్మని చెప్పఁగా నతఁ డిది రాక్ష

సమాయచే వేయఁబడిన యరపుగాని రాముని మాటగాదని బహువిధముల నెంతచెప్పినను వినక దూరనాడినందున విధి లేక పర్ణశాలవిడిచి లక్ష్మణుఁడు రామునికొరకు బోయెను. అపుడు రావణుఁడు భిక్షువేషముననవచ్చి యొంటరిగ నున్న సీతాదేవి నెత్తుకొనిపోయెను. ఈపర్ణశాల యుండుచోటు భద్రాచలము. ఇచట మనము తీసికొనవలసిన నీతులెవ్వి యనిన:—

శ్రీరాములవారు సర్వేశ్వరులును సర్వజ్ఞులును గాన, ముందు జరుగబోవునది యంతయు వారెఱుఁగుదురు. కాని మనవంటివారు స్త్రీల నటుల నడవికిం దీసికొనిపోగూడదు. మఱియు బతివ్రతాశిరోమణి యైనను బోరానిచోటులకు దనను దీసికొనిపొమ్మని భర్త మొదలగువారిని నిర్బంధింపఁగూడదు. లక్ష్మణస్వామి భ్రాతృవాత్సల్యమును భక్తిని బట్టి యన్నవెంట శుశ్రూషకుఁడు యరణ్యమున కేగుట మంచిపనియే. కాని తాను సీతాదేవియొక్క రక్షణమునకై శ్రీస్వామివారిచే నుంపఁ బడియు నాయమ యాడిన యసంబద్ధపు మాటల కాదేవిని విడిచి రాముఁ డున్నదిక్కున కేగుట తగదు. ఆమె యాజ్ఞను గూడ మీరక పోయెనంటిమా యాస్వామికి భయముండదని నమ్మినయట్టివాఁడు సమీపమున నొక పొదలో డాగి యామె రక్షణమును గనిపెట్టుచుండక శ్రీస్వామివారు కనఁబడునంత

వరకు బోవుట తగనిపని. అందునుండియే కదా శ్రీరాముల వా రామెను విడిచివచ్చినందుకు లక్ష్మణుని నిందించిరి. మఱియు తల్లి, తోబుట్టువు, భార్య, కుమార్తెలయొద్దకుగాక తదితర స్త్రీ లెంతపూజనీయులయి యుండినను వారియొద్ద నొంటరిగ నెవ్వరు నుండఁగూడదు.

అట్లు లక్ష్మణుఁడు పోయి యన్నను గలియఁగా వా రతని నిందించి యాశ్రమమును జేరి సీతఁగానక విచారపడుచు దక్షిణదిక్కునుబట్టి వెదకుచు నేగిరి. పోగాబోగా గొంతదూరం మున రావణునిచేతఁ గొట్టఁబడి పడియున్న జటాయు వను వానిం గాంచి యతనివలన రావణుఁడు సీతాదేవినిఁ గొని పోయె ననివినిరి. ఈజటాయువుండు స్థల మిప్పటి జటప్రోలు అనుచోటయి యున్నది. వెంటనే యతఁడు ప్రాణములను విడిచెను. అతనికి సంస్కారములు చేసి కొంతదూరము పోయి కబంధుఁడనువానిచే బట్టువడి వాని బాహువులను ఖండించి సుగ్రీవునితో సఖ్యముచేయుమని వానిచే బోధింపఁబడి యతఁడు చెప్పినమార్గమున బోవుచు శబరిచేత సత్కృతులై సుగ్రీవ నివాసమగు ఋశ్యమూకపర్వతము సమీపమున బం పాసరోవరతీరమునుఁ జేరిరి. అపు డాపర్వతముమీఁద మంత్రి సహితుఁడై యున్న సుగ్రీవుఁడు శ్రీరామలక్ష్మణుల నిరువురను దూరమునుండి చూచి వారినిఁ దనయన్నయగు వాలిచే దన

వధకొఱకు బంపఁబడినవారినిగా భ్రమసి కొంతదూరము పరు గెత్తి యంతట నావచ్చినవా రిరువురు నెవ్వరో తెలిసికొనిరమ్మని తన మంత్రులలో బుద్ధినధికుఁడగు హనుమంతునిఁ బంపెను. అతఁడు శ్రీరామలక్ష్మణులయొద్దకేగి వారి రూపములనుజూచి గొప్పవారని తలఁచి వందనము చేసి 'మహనీయులుగా గనఁ బడుచున్న మీరిరువురు నెవ్వరని యడుగుచు దాను సుగ్రీవుని మంత్రిననియు, దనపేరు హనుమంతుఁడనియు, మీ సఖ్య మునుగోరి మాయధిపతి మీసన్నిధికి నన్నుఁ బంపెననియు మనవిచేసెను. అపుడు శ్రీస్వామివారు లక్ష్మణునివైపుతిరిగి మన మెవ్వనిసఖ్యము గోరివచ్చుచున్నామో యతనిమంత్రియే యితఁడనియు సంస్కృతభాషను బ్రశస్తముగ మాటలాడు చున్నాఁడనియు నితనితో మనవృత్తాంతమును జెప్పుమని సెల విచ్చిరి. ఈసందర్భమును శ్రీమద్రామాయణమున జదువు వారికి గ్రంథకర్త తన నమ్మికనుబట్టి కామరూపమగు మానవ శరీరముతో వచ్చియుండెనని చెప్పియున్నను హనుమంతుఁడు కోతియని మనము నమ్ముచున్న వానరుఁడు గాడని తోపక మానదు.

ఆపిదప హనుమంతుఁడు లక్ష్మణునివలన వారి వృత్తాంత మును సమగ్రముగా దెలిసికొని సంతసించి, వారును సుగ్రీ వుని సఖ్యమును గోరుచుండుటవలన వారినిఁ దోడ్కొని

ఋశ్యమూకపర్వతముమీఁదికేగి యచట వారి నుండుమని చెప్పి భయముచే నింకొకచోట డాగియున్న సుగ్రీవునికడకరిగి యత నితో నారాజకుమారుల వృత్తాంతమును జెప్పఁగా నందఱును గలిసి రామలక్ష్మణులున్నచోటికి వచ్చిరి. అపుడు సుగ్రీవుఁడు శ్రీరాములవారితో 'తాము నాతో సఖ్యముచేయఁగోరి యున్నారని హనుమంతునివలన వింటిని. మీరు భూపతులు నే నడవిలో సంచరించువాఁడను. మీతో సఖ్యము జరిగిన యెడల నాకేవిశేషలాభము సమకూడు' నని పలికి శ్రీస్వామి వారితో హస్తమును బట్టి సఖ్యముచేసికొనెను. అపుడు శ్రీ స్వామిరారు సుగ్రీవుని కోరికప్రకారము వాలినిఁ జంపుటకు బ్రతిజ్ఞచేసిరి. సీతాదేవి యెచ్చటనున్నను వెదకిదెచ్చి సమర్పిం చెదనని సుగ్రీవుఁడు ప్రతిజ్ఞచేసెను. అటుతర్వాత నంతరిక్ష మార్గమున రావణునిచే దీసికొనిపోవఁబడుచున్నట్టి యమ్మవారి వలన గ్రిందవేయఁబడి తనచే దాఁచియుంపఁబడిన యాభరణ ములను దెచ్చి సుగ్రీవుఁడు శ్రీస్వామివారికి గనఁబరచెను. అవయిని శ్రీరాములవారు వాలిని సంహరింపగలరో చాలరో యని సుగ్రీవునకు సంశయము గలిగి సప్తసాలవృక్షముల నేక బాణముతో గొట్టుమని కోరఁగా నట్లుచేసి యతని సంశయ మును బాపిరి. పిమ్మట వారందరును గిష్కింధాసమీపమును జేరి శ్రీస్వామివారి పనుపున సుగ్రీవుఁడు వాలిని యుద్ధమునకై

యరచి పిలిచినట్లును, అపుడు వాలిసుగ్రీవులకు యుద్ధము జరిగినట్లును, అందు శ్రీస్వామివారేకరూపముతోనున్న యా యిరువురిలో వాలియెవ్వఁడో యని సంశయించి వాలినిఁ గొట్టకయున్నట్లును, మరల శ్రీస్వామివారి ప్రోత్సాహముచే సుగ్రీవుఁడు వాలినిఁబిలిచి యుద్ధము చేయుచుండఁగ శ్రీస్వామి వారు చెట్టుచాటుననుండి వాలిని సంహరించినట్లును శ్రీమద్రామాయణమున గానుపించుచున్నది. మహావీరుఁడును సర్వేశ్వరుఁడును నగు శ్రీస్వామివారు సుగ్రీవునితో యుద్ధముచేయుచున్న వాలినిఁ జాటుననుండి యేవిధముగ గొట్టియుందురో బాగుగ విచారింపవలసియున్నది. ఈగ్రంథకర్త వానరులను వీరిని గోతులని నమ్మియున్నందున గోతులు మృగములను పెద్దయాధారమును దీసికొని యట్లు మృగములను జాటున నుండి చంపుట రాజులకు దగునని ముఖ్యకారణముగ శ్రీ స్వామివారు వాలితో సెలవిచ్చినట్లు గ్రంథములో గనఁబరచెను. వానరులు కోతులు గారని యిదివరకే చర్చించియుంటిమి కావున నీసందర్భములో నీగ్రంథములోని యెవ్వరివాక్యమును బ్రమాణముగఁ దీసికొనక సంగతిసందర్భముల నాలోచింపవలసియున్నది. అది యెట్లుండుననఁగా? శ్రీరాములవారు సుగ్రీవునితో 'నాకును వాలికిని బూర్వవైరము లేదు. ముందుగ నీవు వాలిని యుద్ధమునకు బిలువుము. నీ వలసినపుడు నీనఖుఁ

డనగు నేను నీకు సహాయుఁడనుగా వచ్చి యతనితో యుద్ధము చేసి చంపెదను' అని సెలవిచ్చి వెంటను వెళ్లియుందురు. అట్లు సుగ్రీవుఁడు వాలిని యుద్ధమునకు బిలువఁగా వారిరువ్వురును బోరునపుడు సుగ్రీవుఁడు వాలిచే నెక్కుడుపడి చంపఁబడఁబోవు తరుణమున జెట్టుచాటుననున్న శ్రీస్వామివారు స్నేహితుని గాపాడుటకుగా ద్వరపడి బాణమునేసి వాలినిఁ జంపి మిత్రుఁడగు సుగ్రీవునిఁ గాపాడి ప్రతిజ్ఞను నెరవేర్చుకొని యుందురు. ఇందుకొక దృష్టాంతము భారతయుద్ధమున మనకుఁ గలదు. భూరిశ్రవునిచే సాత్యకి తలఁ దునుమఁబడబోవుసమయమున నితరులతో యుద్ధము చేయుచున్న యర్జునుఁడు శ్రీకృష్ణులవారిపనుపున నదివరకు సాత్యకినిఁ జంపుటకయి యెత్తబడియున్న ఖడ్గసహితమగు భూరిశ్రవుని హస్తమును దునిమి సాత్యకిని గాపాడెను గదా? కావున ప్రాణోపద్రవకాలమున నేవిధముననైనను మిత్రునిఁ గాపాడుట పరమధర్మము.

వాలి వధానంతరము శ్రీస్వామివారు లక్ష్మణుని బురములోనికిఁ బంపి సుగ్రీవునకు బట్టాభిషేకముఁ జేయించి తాము సోదరయుక్తముగ గిష్కింధాసమీపమున నున్న ప్రస్రవణ పర్వతమునందు వర్షాకాలము వెళ్లిపోవువరకు నివసించియుండిరి. శరత్కాలము వచ్చినను సుగ్రీవుఁడు రాజ్యసుఖముల ననుభవించుచు గామోన్మత్తుఁడై యేర్పాటుప్రకారము సేనలతో

రాకుండుటచే శ్రీరాములవారు కోపించి సుగ్రీవునికడకు లక్ష్మ ణునిఁ బంపిరి. అపుడతఁడు తెలివి తెచ్చుకొని క్షమార్పణము కోరి సేనలను దీసికొని శ్రీరాములవారిసన్నిధికివచ్చి నమ్రుఁ డయ్యెను.

అటుపయిని సుగ్రీవుని యాజ్ఞాప్రకారము సీతాన్వేష ణముకొఱకు వానరులు వెళ్లుటయు, హనుమంతుఁడు సముద్ర లంఘనముచేసి లంకాపట్టణములో నున్నసీతనుఁ జూచి యా వృత్తాంతమును శ్రీస్వామివారి కెఱింగించుటయు నాపిదప వారిధినిఁ గట్టి లంకాపురము ముట్టడించుటయు, సుగ్రీవహను మంతుల చరిత్రములలోనను రావణాదివీరుల యుద్ధక్రమము వారివారిచరిత్రములలోనను వ్రాయఁబడి యుండుటచే నిచటఁ జెప్పఁబడలేదు.

రావణ వధానంతరము విభీషణుఁడు దుష్టుఁడగు నారావ ణునకు దాను దహనాదిసంస్కారములను జేయనని విముఖుఁ డై యుండగా నపుడు మహావీరుఁడగు సీతనికి సంస్కార ములు చేయుమనియు విరోధమనునది మరణాత్పరమునందుం డగూడదనియు శ్రీరాములవా రానతిచ్చినందున నతఁడు యథా విధిగ సంస్కారములు జరిపెను.

ఆపిదప శ్రీరాములవారు లక్ష్మణస్వామివారినిఁ బంపి విభీ షణునకు లంకారాజ్యాభిషేకముం జేయించిరి. హనుమం

తునిచే దమవిజయమును సీతాదేవికిం దెలియజేయించిరి. విభీషణ పట్టాభిషేకానంతరము సీతాదేవివిషయమున ముందు జరగవలసినపనిని విచారించి విభీషణునితో నాదేవిని మంగళస్నాతను గావించి నాకడకుం దీసికొనిరమ్మని సెలవిచ్చిరి. అపుడావిభీషణుఁడు శ్రీరామాజ్ఞాప్రకారముగ నాదేవికి మంగళస్నానము జేయించి యాయమ నొకపల్లకియందునిచి శ్రీరామునికడకుఁ దోడ్కొనివచ్చుచు ముందుగ శ్రీస్వామివారిసన్నిధికి వచ్చుచుండఁగా నాదేవిని దూరమునఁజూచి శ్రీస్వామివారు సంతోషము, రోషము, దీనత్వము గలవారై యామెను దమయొద్దకుం దోడ్కొనిరమ్మని విభీషణున కానతిచ్చి పంపిరి.

అట్లు వచ్చుచున్న శ్రీయమ్మవారినిఁ జూచుటకు వానరులు గుంపులుగూడగ విభీషణుఁడు వారినిఁ దూరముగఁ దొలఁగునట్లు చేయుచున్నందున నపుడు శ్రీస్వామివారు విభీషణునితో వివాహకాలమునందును, భర్తసమీపమునందును, దుఃఖసమయములయందును, నాపదలుసంభవించునపుడును, యాగములయందును, స్వయంవరకాలమందును, యుద్ధమునందును, స్త్రీలు నలుగురికి గనఁబడుట దూష్యముగాదనియు, అందు నీదేవి యుద్ధగతయు, నాపద్గతయు, వ్యసనసంగతయు, భర్తనగునాసమీపమున నున్నదియు గావున నితరులు చూచుట కాక్షేపణము లేదని సెలవిచ్చిరి. అప్పటికాలమున నంతఃపుర

స్త్రీలు శ్రీరాముల వారిచేఁ జెప్పఁబడిన సమయములయం దితరులకు గనఁబడుట యాచారమై యుండెను.

ఆపిదప నాదేవి శ్రీస్వామివారిసన్నిధికి వచ్చి నిలుచుకొని కొంతవరకు సంకోచించి యుపశమించినపిదప శ్రీస్వామివారు:—

చ. "సరసిజనేత్రి? యాలమున శాత్రవునిం బరిమార్చి నిన్ను వే
జెఱవిడిపించి పౌరుషముఁ జెల్లఁగఁజేసి యమర్షలాభముల్
బరువడిఁగాంచి చిత్తమున నాటినవైరి కృతావమానముల్
వరుసవిషాదముం బెఱికివైచి కృతార్థుఁడ నైతి నెంతయున్.

క. పౌరుషము దృష్టమయ్యెను
జారుముఖి శ్రమము నేడుసఫలం బయ్యెన్
వారక ప్రతిజ్ఞ దీరెను
ధారుణిలో నేను జాల ధన్యుఁడ నైతిన్.

ఉ. ఏ నెడఁబాసియున్నయెడ నీచలచిత్తుఁడు రావణుండు నిన్
గానననీమనుండి చులుకన్ వెసముచ్చిలితెచ్చె నింతయున్
మానిని దైవకృత్యమిది మామక పౌరుషశక్తిచే రహిన్
వానివధించితిన్ ద్రిభువనంబుల భూరియశంబుఁ గాంచితిన్.

క. తనకొదవిన యవమానము
ననుపమతేజమున నవలనటుద్రోయఁగఁ జా
లని యల్పతేజుఁ డగుపురు
షునకుం బురుషార్థ మరసిచూచినఁ గలదే."

అని సెలవీయఁగా నాదేవి తనను శ్రీరాములవారు పరిగ్రహింపరేమోయని దుఃఖించెను. అపుడు శ్రీస్వామి వారికిఁ గోపము హెచ్చి 'నాకువచ్చిన యవమానమును బాపుకొనుటకు రావణవధాది కార్యములను దీర్చి ధన్యుఁడ నైతిని. అదియంతయు నీకొఱకుగాదు. కావున నాత్మభరణార్థము నీ కిష్టమైనచోటికిఁ బోవలసినదేకాని నాయొద్ద నుండఁదగవ' ని సెలవిచ్చిరి. ఆమాటకు సీతాదేవి దుఃఖించి శ్రీస్వామివారితో 'సర్వేశ్వరులయ్యు మీ రిట్లు సాధారణ మనుష్యునివలె శంకించుట తగ 'దని మనవిచేసి తన నైర్మల్యమును జూపుటకై యగ్నిప్రవేశము చేసెదనని ప్రతిజ్ఞచేసి యందుకై చితిపేర్చుమని లక్ష్మణునిఁ గోరఁగా నతఁడొకింత సందియమొంది యన్నమొగముఁజూచి యాతని యంగీకారమును ముఖభావమువలనఁ దెలిసికొని చితినిఁ జేర్చెను. అపుడాదేవి,

"సీ. అనిశంబు మచ్చిత్త మాత్మనాథునియందుఁ
దవిలివర్తించుట దథ్యమేని
వితతదుష్టత్వ శంకితనైన యే నుర్వి
నతిశుద్ధచారిత్ర నైతినేని
కరము వాఙ్మానసకర్మంబుచే మనో
థిపుమాట మీఱి వర్తింపనేని

రవిచంద్ర దిగ్వాయు రాత్రిసంధ్యాదిన
భూనభంబులు సర్వభూతములును
సకలదిక్పాలకులు నాదు సచ్చరితము
సర్వము నెఱింగి యుండుట సత్యమేని
పవనహేతువు లోకైకసాక్షి యైన
చిత్రభానుండు నన్ను రక్షించుఁగాక."

అని యిట్లుపల్కి యగ్నిప్రవేశముకాఁగా నామె పాతి వ్రత్యమును బ్రహ్మరుద్రాదిదేవతలు మెచ్చునట్లగ్ని యామెనుఁ దహింపక యుండెను. అపుడు శ్రీరాములవారు సంతుష్టులై సీతాదేవినిఁ బరిగ్రహించిరి. ఆపిదప విభీషణసుగ్రీవాది పరివారసహితులై పుష్పకమను విమానము నధిష్ఠించి కదలి కిష్కింధయొద్ద గొంతతడవాగి తారాది వానరస్త్రీల నెక్కించుకొనిపోవుచు మార్గమున భరద్వాజునిం జూడఁగోరి యాయన యాశ్రమమునొద్ద దిగి యతనిచేఁ బ్రార్థితులై యతని యాతిథ్యమును నాటిదినమున నంగీకరించిరి.

ఆ మునియాశ్రమమున నాడుండుటచేత నొప్పందలప్రకారము నందిగ్రామము నాడు చేరుటకు వీలులేనందున దామొకదిన మాలస్యముగఁ జేరుటకు గారణమును దెలుపుటకు హనుమంతుని భరతునికడ కంపిరి. అటు లతఁడుపోయి శ్రీరామాగమనమును జెప్పి భరతు నానందభరితునిఁ జేసెను.

మరునాటి యుదయమున శ్రీస్వామివారి నెదుర్కొనుటకు భరతశత్రుఘ్నులు హనుమదాది పరివార సహితులై వెళ్లఁగా నింతలో బుష్పకవిమానమునుఁ డాసి చేరెను. అపుడు భరతుఁ డన్నగారి పాదములు పట్టుకొని నమస్కరించి కుశల ప్రశ్నానంతరము, రాజ్యభోగములవలన సుగ్రీవునివలె శ్రీ రామకార్యమును మరచియుండక తనచే నడవరకు భక్తితోఁ బూజింపఁబడుచున్న పాదుకలను దన యన్నగారి పాదములకు సమర్పించెను. అపు డందఱును గలిసికొని నందిగ్రామముఁ జేరిరి. శ్రీరాములవారు రాజాలంకారయుక్తులై యచటి నుండి బయలుదేరి పరివారముతో నయోధ్యాపట్టణముఁ జేరి యచట బట్టాభిషిక్తు లయిరి. ఆసమయమున శత్రుఘ్నుఁడు శ్రీస్వామి వారికి శ్వేతచ్ఛత్రమును బట్టెను. సుగ్రీవ విభీషణులు చామరములను వీచిరి. ఇచట భరతలక్ష్మణులు చామరములను ధరింపక సుగ్రీవవిభీషణు లేల వీచిరో విచారింపుఁడు. వారిరువురిలో నెవ్వఁడు యువరాజుగ నభిషిక్తుఁ డగునో యది పట్టాభిషేకాత్పూర్వము నిర్ణయింపఁబడుటకు వీలులేక యుండెను.

పట్టాభిషేకానంతరము విభీషణసుగ్రీవాదులకు యథార్హముగ సత్కారములు చేసిరి. అందు సీతాన్వేషణాది కార్యములయందు ముఖ్యుఁ డగుహనుమంతునకు శ్రీసీతాదేవిచే నొకముక్తాహారము నిప్పించి గౌరవించిరి. ఆపిదప నంద

లును శ్రీరాములవారియొద్ద సెలఫుచ్చుకొని వారివారి స్థానములం జేరిరి. భరతుఁడు యువరాజైయుండఁగ ననేకసంవత్సరములు శ్రీరాములవారు కృతయుగధర్మములను నడపుచు నశ్వమేధాది యాగములం జేయుచు రాజ్యమునుఁ బాలించిరి.

ఇక మనము తీసికొనవలసిన నీతి యేమియనిన:—

పితృవాక్య పరిపాలనమునకును, సత్య ప్రతిజ్ఞతకును, శరణాగత రక్షణమునకును, భర్తృ ప్రవర్తనమునకును, సోదర వాత్సల్యమునకును, రాజ్యపాలనమునకును శ్రీరాములవారు నిదర్శకు లయియున్నారు. పాతివ్రత్యమహిమకు శ్రీసీతాదేవియు, జ్యేష్ఠభ్రాతయొక్క యనుసరణమునకును శుశ్రూషకును లక్ష్మణస్వామివారును, జ్యేష్ఠభ్రాతయందలి భక్తికిని దద్ద్వారా అప్రయత్నసిద్ధము లగురాజ్యభోగములయందు విముఖతకును భరతుఁడును, జ్యేష్ఠభ్రాత లేనిసమయమున నతనిస్థానమందున్న భరతుని ననువర్తించుటకు శత్రుఘ్నుఁడును బ్రదర్శకు లై యుండిరి.

మఱియు విశిష్టాద్వైతులు రాములవారు పితృవాక్య పరిపాలనాది సామాన్యధర్మములకును, లక్ష్మణస్వామివారు భగవచ్ఛేషత్వమునకును, భరతుఁడు భగవత్పారతంత్ర్యమునకును, శత్రుఘ్నుఁడు భాగవతశేషత్వమునకును నిదర్శకు లని చెప్పుదురు.

ఉత్తర రామాయణము లేదా ఉత్తరకాండ యనునది యీ పూర్వరామాయణకాండలు పుట్టిన యనేకసంవత్సరముల పిదప బుట్టినందున బూర్వభాగమున నున్నవానికంటె ననేకము లగునసందర్భములతో నిండియున్నది. కావున నే భాగమును దానిలోనుండి ప్రమాణముగఁ దీసికొనక యొకటి రెండు విషయములనుఁజూపి శ్రీరామకథను ముగింపఁజేసెదను.

శ్రీస్వామివారి ప్రభుత్వకాలము చాలవరకు భుక్తియైనపిదప జారులలో గొందరనుకొనుచున్న మాటను దెలిసికొని గర్భవతియగు తనభార్యయైన సీతాదేవిని వాల్మీకి యాశ్రమమున విడిచిపెట్టిరమ్మని శ్రీస్వామివారు లక్ష్మణున కాజ్ఞయిచ్చుటచే నతఁ డట్లు విడిచివచ్చినట్లును, పిమ్మట కుశలవులకు సూక్ష్మరూపముగ వాల్మీకిప్రోక్త మగురామాయణమును శ్రీస్వామివారి సన్నిధిని గానము చేయఁదగినంత వయసువచ్చువరకు సీతా విషయమును శ్రీస్వామివారు విచారింపక యున్నట్టును, అవుడు తిరుగ నామెను దెప్పించి యామె పాతివ్రత్యమును గూర్చి శపథము చేయుమన్నట్టును నందుఁ జెప్పఁబడి యున్నది. లంకలో సమస్తజనులు చూచుచుండఁగ నగ్నిప్రవేశమయి యుండుటవలన దహింపబడక పవిత్రురాలుగ నేర్పడినభార్యను బరిగ్రహించిన శ్రీరాములవారు పయివారిమాటను బురస్కరించుకొని యట్లామె నరణ్యమునకుఁ బంపి యుందురా?

ఏకారణముచేతఁ బంపియున్నను గుమారులకు రామాయణమును గానముచేయదగినంత వయసువచ్చువరకు నామెయొక్కయు నామె గర్భముయొక్కయు స్థితిని విచారింపక యుందురా? కావున నిది యసంభావితము. గర్భవతిగా నుండినభార్యను నామెకోరికఁ దీర్చుటకు వాల్మీకిమునియాశ్రమమునకుఁ గొన్నిదినములు పంపియుండిన నుండవచ్చును. అప్పుడచట నామెకుమారులను గనియుండవచ్చును. ఆయాశ్రమమున నాబిడ్డలు జన్మించినందున నాఋషి యిటీవల వారలకుఁ జదువు చెప్పియుండును. సంగతి సందర్భములనుబట్టి యిట్లు జరిగి యుండవచ్చునుగాని యాగ్రంథములో జెప్పఁబడిన ట్లుండనే యుండదుకదా? కావున దానిని మనము ప్రమాణముగఁ దీసికొనఁగూడదు. మఱియును జదువనేకూడదు.

ఇట్లు శ్రీమన్నారాయణుఁడు శ్రీరామరూపమున నవతరించి తాను జేయవలసిన పనులనుదీర్చి కుమారులకు ప్రౌఢత వచ్చినపిదప వారికిఁ బట్టాభిషేకముచేసి శ్రీవైకుంఠమునకు విజయముచేసెను.

నా యీగ్రంథమున నెవ్వరిచరిత్రములు వ్రాసితినో వారిలో శ్రీరామకృష్ణులు శ్రీమన్నారాయణుని యవతారములని చెప్పియున్నందున భగవంతునియొక్క యవతారములుగ

మన మతగ్రంథములయందుఁ జెప్పఁబడినవానిలో నేవి ముఖ్యములో వానిని మనము తప్పక విచారింపవలసియున్నది.

భాగవతమున సూతుఁడు శౌనకాదిమునులకు జెప్పుటలో నిరువదియొక్క యవతారములుగ గనఁబడుచున్నది. అవి యెవ్వియనిన :—

1. బ్రహ్మ, 2. యజ్ఞవరాహము, 3 నారదుఁడు, 4. నరనారాయణులు, 5. కపిలుఁడు, 6. దత్తాత్రేయుఁడు, 7. సుయజ్ఞుఁడు, 8. ఋషభుఁడు, 9. పృథుచక్రవర్తి, 10. మత్స్యావతారము, 11. కూర్మము, 12. ధన్వంతరి, 13. మోహిని, 14. నృసింహావతారము, 15. వామనుఁడు, 16. పరశురాముఁడు, 17. వ్యాసులు, 18. శ్రీరాములవారు, 19. బలరాములవారు, 20. శ్రీకృష్ణులవారు, 21. బుద్ధుఁడు.

మరియు నాగ్రంథముననే నారదునకు బ్రహ్మ చెప్పినట్లున్న కథలో నిరువదినాలుగవతారములుగఁ జెప్పఁబడియున్నది. అవి యెవ్వియనిన :—

1. యజ్ఞవరాహము, 2 సుయజ్ఞుఁడు, 3. కపిలుఁడు, 4. దత్తాత్రేయుఁడు, 5. కుమారావతారము, 6. నరనారాయణులు, 7. ధ్రువుఁడు, 8. పృథుచక్రవర్తి, 9. ఋషభుఁడు, 10. హయగ్రీవుఁడు, 11. మత్స్యము, 12 కూర్మము, 13. నృసింహావతారము, 14. హరియవతారము, 15. వామనుఁడు, 16.

హంసావతారము, 17. మన్వంతరావతారము, 18. ధన్వంతరి, 19. పరశురాముఁడు, 20. శ్రీరాములవారు, 21. శ్రీకృష్ణుల వారు, 22. వ్యాసులు, 23. బుద్ధుఁడు, 24. కలికి.

ఈ పయి రెండవతారకథలలో సంఖ్యాభేదము, వరుస భేదము, వ్యక్తిభేదమునుగలవు. సర్వసాధారణముగ ననేక గ్రంథములలో మత్స్యకూర్మాది దశావతారములే యొప్పుకొనఁబడి యున్నవి భగవద్గీతలలో నప్పటికాలపు ప్రజలవలన దేవతిర్యఙ్మనుష్య స్థావరములలో నేవేవి పూజనొందుచు గౌరవింపఁబడుచుండెనో యవియన్నియు జెప్పుచు నేదియేది మహిమయు సంపదయు గౌరవమును గలిగియుండునో దానియందెల్లను నాయంశము గలదని యెంచుకొనుమని శ్రీకృష్ణులవా రర్జునున కానతిచ్చియున్నారు.

శ్లో॥ "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా।
తత్తదేవావగచ్ఛత్వంమమ తేజోంశ సంభవమ్॥"

ఈవాక్యము నాధారముచేసికొని భాగవతగ్రంథకర్త భగవదంశ కలదని తాను నమ్మియున్న యిరువది యొక్కరిని ముందుగ జెప్పి పిదప మఱికొందరిని జ్ఞప్తికి దెచ్చుకొని కేశవాది చతుర్వింశతి నామములకు సరిపడున ట్లిరువదినలుగురిని భగవదవతారములని రెండవసారి చెప్పెను. కాని ముందు చెప్పిన పేరులను గమనించియున్నట్లు కనబడదు. ఇప్పటికిని

గొప్పప్రభువులను గొప్పవిద్వాంసులను భగవదంశము గలవా రని వాడుచున్నాము. ఇంక దశావతారవిషయము చర్చింప వలసియున్నది. మీఁద జెప్పఁబడిన యిరువదియొక్క యవ తారములలో దశావతారములలోని చివరది యగుకల్క్యవ తారము లేదు. తిరుగ నిరువదినాలుగవతారములుగ జెప్పుట లో నాగ్రంథకర్త ముందుచెప్పిన బలరాముని విడిచెను. ఇందునుఁ బట్టిచూచినను దశావతారవిషయములో బాగుగ జర్చింప వలసినట్లున్నది. వీనిలో మత్స్యావతారము ముందుగ గలిగిన దని చెప్పుదురు. మత్స్యమనునది కేవలము నీటిలో నుండఁ దగినది యైయున్నది కావున నీయవతారము సృష్ట్యాదియం దావిర్భవింపవలసి యుండును. ముందుగ జలగోళములసృష్టి జరుపఁబడినది. ఆపిదప బంకాదులు పుట్టెను. అటుతర్వాత నడవులు, కొండలు, మృగములు, వృక్షపక్ష్యాదు లుత్పన్నము లయ్యెను. అటుపిమ్మట దామస రాజసుల సృష్టి జరుపఁబడినది. ఇందునుబట్టి కొంత విచారింపగ నరసృష్టికి బూర్వము భగ వంతుఁ డవతరించుటకు బ్రసక్తి కనఁబడదు. అయితే మరి యెందువలన నిట్లు నమ్మియుండిరన, గీతలలో శ్రీకృష్ణులవారు:

శ్లో॥ "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥"

అని చెప్పియున్నందున సృష్ట్యాదివివిధకాలములయందు భగవంతు డవతరించియుండునని నమ్మి ముందుగ జలరూపము తో నుండు గోళములో మత్స్యరూపముతో నవతరించెననియు, నందు బంకాములు పుట్టినపిదప బంకములోను నీటియందును నివసించుట కర్హమైన కూర్మరూపముతో నవతరించెననియు, పిదప గొండలు నడవులు నేర్పడినందున వానియందును బురద యందును నుండదగిన వరాహరూపము ధరించెననియు, నటు మీఁద దామసరాజసులు సృజింపఁబడిరి కావున వారి దుష్ట త్వమును వారించుటకు నృసింహరూపమును ధరించెననియు, సాత్వికసృష్ట్యనంతరము వామనరూపమును ధరించి యుందు రనియు ఋషులును గ్రంథకర్తలును దలఁచియుందురు. ఈ వామనమూర్తి కురుచవిగ్రహము గలవాఁడని చెప్పెదరు. అనగా దామసరాజసులకంటె సాత్వికులు కురుచవారు. మఱియు వీరు సత్వగుణప్రధాను లయి తమమంచిప్రవర్తనలచే తనే క్రూరులగు తామసరాజసులను లోబరచుకొనిరి. అందుకు నిదర్శనముగ వామనమూర్తి బలిచక్రవర్తిని మంచిమాటలతో సాధించినట్లుగ గథ కల్పింపఁబడినది. ఇక నృసింహావతారవిష యము చెప్పవలసియున్నది. నృసింహశబ్దమునకు నరులలో గొప్పవీరుఁడని యర్థము. కొందరానామమును బట్టియే నర రూపమును సింహరూపమునుగల మిశ్రశరీరము గలిగియుందు

నని నమ్మి యతఁడు హిరణ్యకశిపుఁ డనురాక్షసుని నారూప ముతో సంహారించినట్లును, ప్రహ్లాదుని రక్షించినట్లును గథను గల్పించిరి. ఈ హిరణ్యకశిపుఁడుండుచో టెచ్చటనులేదు. ఇతఁడే యట్టి గొప్పప్రసిద్ధి గలప్రభు వై యుండినచో నాస్థల మిప్పటికిని నిర్దేశ్యము గాదగి యుండవలసియుండును. ఈ ప్రహ్లాదచరిత్రము కల్పితకథయై యుండును. అయినను నిందు గ్రహింపఁదగినయంశములు మూఁడుగలవు: 1. భక్తికి ప్రహ్లాదుని చారిత్రమును, 2. ఎంతతపస్సుచేసి యెన్నివిధముల ప్రాణసంర క్షణముకొరకు వరములను బొందియున్నను యుక్తప్రవర్తనము లేనివాఁడు హానిని జెందునను నీతికి నితనితండ్రి చరిత్రమును. 3. సర్వశక్తికిని భక్తులను రక్షించుటకును నృసింహ వృత్తాంత మును మనము ముఖ్యముగ గ్రహింపవలెను. ఈకథను నిజముగ జరిగినదానినిగ నమ్మియుండుటచే మనదేశమున ననేక దేవా లయములయందు సింహముఖముగల విగ్రహము లారాధింపఁ బడుచున్నవి.

మఱియు శంకరరామానుజాచార్యులు కార్యసిద్ధికొఱ కును, శత్రుక్షయముకొఱకును నృసింహమూర్తిని గొలిచిన ట్లున్నది. నరసింహశబ్దమున కర్థము నరుఁడుగ నవతరించి పరాక్రమముఁ జూపిన భగవంతుఁడని కదా? నరరూపమునుఁ దాల్చిన రామకృష్ణులు పరాక్రమవంతు లయియేకదా రావ

ణాదిశత్రువులను సంహరించిరి. కావున నట్టికార్యమునకు బరాక్రమావస్థతిలోనుండు రామకృష్ణులయారాధనమే నృసింహారాధనముగ నిప్పు డేర్పడుచున్నది.

సాలగ్రామములలో మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామనమూర్తులను మనము గొలుచుచున్నామే? ఆయవతారములే లేనిచో వీని నేల యారాధింపవలెనని కొందఱికిఁ దోచును. సాలగ్రామమే శ్రీవిష్ణుస్వరూపమని మనము నమ్ముచున్నపు డాకారభేదముచే గలిగిననామముల విషయమున సంశయింపఁ బనిలేదు.

ఈపిదప దదితరావతారములను వ్రాయఁబోవుచున్నాను. అవతారములలోఁ గొన్ని యావేశావతారములనియు, గొన్ని యంశావతారములనియు మన మతగ్రంథములలో నున్నది. అనఁగా నొక గొప్పకార్యమునొఱకు దాత్కాలికముగ భగవంతునిశక్తి యొక నరునియందు గలుగుట యావేశావతారమని చెప్పుదురు. ఇట్టిదియే పరశురామావతారము. ఇట్టి యావేశములను మనపూర్వులు నమ్ముట కలదు. జన్మమాదిగ వైకుంఠమున కేగువరకు భగవదంశముగలది యంశావతారము. ఇట్టివియే రామకృష్ణుల యవతారములు.

ఇఁక బుద్ధావతారవిషయము :—

ఈబుద్ధుఁడొకానొక సమయమునుబట్టి బౌద్ధమతము నుప దేశించినట్లు మనగ్రంథములలో నున్నది. అతనియనంతరమున నామతస్థులందఱు నతని నఖరోమాదులను నతని యాభరణాదులను నతిభక్తితో నారాధించుచు నుండఁగా శ్రీశంకరాచార్యులవారతఁడే మహావిష్ణువుయొక్క యవతారమని చెప్పి చాలమందిని మనమతములోనికి దిగుగవచ్చునట్లు చేసిరని పశ్చిమఖండపు నవీనగ్రంథకర్తలు కొందఱు వ్రాసియున్నారు. బహుశః ఇదియే నిజమైయుండును. ఏమియనిన, జగదీశ్వరుఁడు సంహరించునూహతో వంచనచేసి నాస్తికమతము నుపదేశించి యుండునా? ఏమియాశ్చర్యము?

శంకరాచార్యులవారు నాస్తికమతఖండనమున్గొఱకు బౌద్ధమతాచార్యుని మహావిష్ణువుయొక్క యవతారమని బోధించుటయేగాక యప్పటికి వేరువేరుగ బంచదేవతల నారాధించుచుండునట్టి మనమతస్థుల నందఱిని నేకీభవింపఁజేయుటకయి పంచదేవతారాధనము నుపదేశించి యతియగు తానును నట్లారాధించియుండెను.

ఈ బుద్ధుఁడును దేవుఁడు కలఁడా? లేఁడా? యనువిషయమును జర్చింపక యప్పటిప్రజలు యజ్ఞాదికర్మములవలననే తమకు సమస్తము లభించునని నిండునమ్మికతోనుండి తమప్రవర్తనల విషయమున నజాగ్రత్త గలిగియుండుటచే యుక్తప్రవర్తనమే

ముక్తికి ప్రధానమని యెంచి యట్లు బోధించుచు నది యెనిమిది విధములని వివరించెను. అవి యెవ్వియనిన:—

1. సత్యసంకల్పము, 2. సత్యనిశ్చయము, 3. సత్యవాక్కు, 4. సత్యప్రవర్తనము, 5. సత్యజీవనము, 6. సత్యప్రయత్నము, 7. సత్యగ్రహణము, 8. సత్యపర్యాలోచనము ఈయంశము లను బుద్ధుఁడు బోధించినను ప్రతిమనుష్యుఁడును ముఖ్యముగ బరిగ్రహింపవలెను. యుక్తప్రవర్తనములేని యారాధనాదు లెందుకును బనికిరావుకదా?

రేపు జరుగునదియె తెలియరాని మనకు ముందు కాబోవు నని యూహించి గ్రంథకర్తలచే జెప్పఁబడిన కల్క్యవతార ముతో బనియేమి? కావున భగవదవతారములని చెప్పఁబడిన యన్నిటిలో శ్రీరామకృష్ణావతారములే నిజమైన యవతార ములని నమ్మవలయును. శ్రీరామకృష్ణుల యవతారముల యనం తరము వారివారి విగ్రహములను బ్రతిష్ఠించి పూజించుచు న్నాము. నరశరీరములను దాల్చిన వారిమూర్తులేల పూజనీ యము లయ్యెననగా? శ్రీకృష్ణులవారు వైకుంఠమునకు విజయము చేయుటకుముందు వారిని విడిచియుండజాలనని మొఱ్ఱపెట్టు కొన్న తనసఖుఁ డగునుద్ధవునకు దమయవతారానంతరమున దమ రూపమువంటి యాకారము గలవిగ్రహములను జేయించు కొని యథావిధిగ నారాధించుచుండినయెడల నిహముపరము

గలదని యానతిచ్చియున్నారు. కావున నిట్లనే శ్రీరాముల వారి యిష్టదేవముగ నారాధించువారు వారివిగ్రహములను గొల్చుచున్నారు.

విగ్రహారాధనము లేనియెడల బండితపామరసాధారణముగ మనసునిలిపి భగవంతుని ధ్యానించుట యసాధ్యము. కావున మనము విగ్రహారాధనము చేయుచుండగా యితరమతస్థులు మనల నాక్షేపించుట సరికాదు. బౌద్ధమతస్థుల తోబాటుగ మహమ్మదీయులు మహమ్మదుయొక్క నఖరోమాదులను బూజించుచున్నారు.

క్రైస్తవ లామతాచార్యుని మేకుబందీచేసిన త్రిభుజాకారము (క్రాస్) గలకఱ్ఱను వారి దేవళములమీఁద నుంచుకొనుచున్నారు. కేవల శైవులు లింగమును గట్టుకొన్నట్లు పాదిరులు త్రిభుజాకారముగల లోహపుదునుకను ధరించుచున్నారు. మఱియు పాదిరిగుడులలో నద్దపుతనాబీలయందు క్రైస్తుయొక్కయు నతనితల్లియొక్కయు రూపము లమర్పఁబడి యున్నవి.

లోహసంబంధమైన త్రిభుజాకారముగల కఱ్ఱలను గురువు లుపదేశించుచోట నుంచియున్నారు. వీరిలో విగ్రహారాధనము నంగీకరించిన రోమన్‌కాతలిక్ పాదిరు లించుమించు మనతో బాటుగనే విగ్రహారాధనమే చేయుచున్నారు. తక్కినమతస్థు

లందఱు నేదో యొకదానినిఁ గురుతుగ నుంచుకొని యారాధించుచున్నారు. కావున బ్రతిమతమునందును విగ్రహారాధన మేదో యొకవిధముగ నుండనే యున్నది.

మన విగ్రహారాధనములలో స్వయంవ్యక్త [redacted] దేవతలచేఁ బ్రతిష్ఠింపఁబడిన విగ్రహము [redacted] సిద్ధులచేఁ బ్రతిష్ఠింపఁబడిన విగ్రహము [redacted] మనుష్యులచేఁ బ్రతిష్ఠింపఁబడిన విగ్రహము [redacted], నందు దనచే (గాని తనపూర్వులచేగాని) ప్రతిష్ఠింపఁబడిన విగ్రహము శ్రేష్ఠమనియు, మన మతగ్రంథములలోఁ జెప్పఁబడియున్నది. [redacted] రామకృష్ణాది విగ్రహములు మనుష్యులచేఁ బ్రతిష్ఠింపఁబడినందున [redacted] శ్రేష్ఠములు. ఇటులనే శివార్చన చేయువారునుగూడ నర్చాభేదమును గ్రహింపవలెను.

ఏవిగ్రహమును బూజించుచుండినను యుక్తప్రవర్తన గలవాఁడయి నిండుభక్తితో నారాధింపనివానికి నందలి ఫలములేదు.

దైవము లేడనువారును, దైవము నేనే యనువారును దాక, దైవము కలఁడు, అతఁడు రక్షకుఁడు, అని నమ్మి కొల్చుచున్న మతస్థులందఱు నించుమించుగ సమానులే యని చెప్పి యీగ్రంథమును ముగించుచున్నాను.

